సంస్థాపకులు
కీ॥ శే॥ వి వి రామవయ్య




జూన్ 197[illegible]

మేనేజింగ్ ఎడిటర్
శ్రీమతి వి లీలావతి
రామవయ్య

సహకార సంపాదకుడు : వేమూరి సత్యనారాయణ

సంపుటి 17

# విషయసూచిక

సంచిక 5



ముఖచిత్రం 'ముద్దులకొడుకు'లో నాగేశ్వరరావు, శ్రీదేవి

జ్యోతి, 17-B రాజారాం కాలనీ, P B నెం 2650, మద్రాసు-600 024
ఫోన్ 423123 సంవత్సర చందా (ప్రత్యేక సంచికతో రు 42/)

# తొలిమాట

ఒక పాఠకుడు తమ అనుభవాన్నొకదాన్ని ఇలా రాశాడు:

"మద్రాసు సెంట్రల్లో 'జమ్మూతావి ఎక్స్‌ప్రెస్'కి మామగార్ని, అత్తగార్ని, మరదల్నీ ఇద్దరు పిల్లల్నీ తీసికెళ్ళాను. రిజర్వేషన్ లేదు. జనరల్ కంపార్ట్‌మెంట్‌లో ఎలాగైనా ఎక్కించి పంపాలి. తొక్కిసలాట విపరీతంగా వుంది. అలాగే తోసుకొని నేనొక్కడినీ ఎలాగో లోపలికి ప్రవేశించాను. అక్కడ పోర్టర్లు సీట్లపై తువ్వాళ్ళూ, న్యూస్‌పేపర్లూ వేసి 'రిజర్వ్' చేసి బహిరంగంగా సీట్లు అమ్మకాలు సాగిస్తున్నారు. నాకు కడుపు మండిపోయింది. ఒక పోర్టర్ వైపు విసురుగా వెళ్ళాను - పోట్లాడి సీటు ఆక్రమించుకోవాలని. అతను ముగ్గురు కూర్చునే సీటుకి అడ్డంగా నిలబడి వున్నాడు. దాదాపు అతన్ని పక్కకు నెట్టేసే సమయంలో నాకొక ఆలోచన వచ్చింది. పోట్లాడితే నేను సీటు ఆక్రమించుకోగలనేమోగాని, ఆ అదను చూసుకొని నా వెనక వున్నవాళ్ళూ అదే పద్ధతిన మిగతా రెండుసీట్లూ ఆక్రమించుకొంటే నేను వారితో వాదించే అవకాశం వుండదు. వెంటనే ప్లేటు ఫిరాయించాను. నెమ్మదిగా ఆ పోర్టరుతో 'ఆ మూడు సీట్లూ నేనే తీసుకొంటాను వుంచు' అని చెప్పాను. 'అలాగేసార్' అన్నాడతను. మా వాళ్ళని తీసుకొచ్చి ఆ సీట్లలో సుఖంగా కూర్చోపెట్టాను. అతనికి ముట్టచెప్పవలసింది అతనికిచ్చేసి వచ్చేశాను. పాత జ్యోతి తిరగేస్తుంటే 'నేనొక మంచి వెధవను' శీర్షిక కన్పించి ఇది రాస్తున్నాను. నేను చేసిన పనికి చాలాగిల్టీగా ఫీలయ్యాను. అయినాఅవసరం మనిషిని అలా చేయిస్తుంది మరి"

నిజమే! అవసరం అంతపనీ చేయిస్తుంది మరి! రాజకీయ నాయకులనే చూడండి! ఇద్దరు రాజకీయనాయకులు ('ప్రత్యర్థి పార్టీలవాళ్ళు') కలుసుకొంటారు. ఆ పరిస్థితుల కనుగుణంగా కత్తులు దూసి పోరాడేందుకైనా నిర్ణయం తీసుకోవచ్చు! 'లేదా ఇద్దరూ కలిసిపోతున్నామోచ్' అనే సయోధ్య ప్రకటించవచ్చు. ఎవరూ ఏమీ చేయలేనిదీ, మానవజాతిని ఎన్నిటికీ వీడనిదీ అయిన 'స్వార్థం' వీటన్నిటికీ పునాది. ఆ పునాది మనం ఏమీ చేయలేనంత బలమైంది. అయితే ఏమీ చేయలేమని ఊరుకోలేముగదా! ఎవరి ప్రయత్నం వారు చేస్తే! గడ్డిపోచలతో పేనిన తాడు ఏనుగుని బంధించడానికైనా పనికొస్తుందన్నమాట మనకి ఆదర్శం అయితే మంచిది!




## సాహిత్యమూ-పత్రికలూ

గత శతాబ్దిలో ఇంగ్లండులో రాబర్ట్ బ్రౌనింగ్ అనే సుప్రసిద్ధ కవి వుండేవాడు అతని భార్య ఎలిజిబెత్ బరెట్ బ్రౌనింగ్ కూడా కవిత్వం రాసేది ఇద్దరూ గొప్ప కవిత్వం రాసిన ప్రసిద్ధులే అయినప్పటికీ రాబర్ట్ బ్రౌనింగ్ తన పద్యం ఒక్కటి కూడా పత్రికకు పంపి ఎరగడు

ఒకసారి ఒక పత్రికవాళ్ళు అతనికి పది పౌన్లకు కాబోలు చెక్ పంపుతూ తమ పత్రికకో ప్రచురణకు ఒక్క పద్యం రాసి పంపమన్నారు బ్రౌనింగ్ తాను పత్రికలకు రాయనని చెబుతూ ఆ చెక్ తిప్పిపంపాడు ఈసారి పత్రికవాళ్ళు తమ గుమాస్తా పొర పాటుకు క్షమాపణ చెప్పుకుంటూ నూరు పౌనులు పంపటానికి మారుగా పొరపాటున పది పౌనులు పంపటం జరిగిందనీ తప్పక ఒక కవిత పంపవలసిందనీ కోరారు బ్రౌనింగ్ దాన్నికూడా తిప్ప పంపేస్తూ నేను పత్రికలకు పద్యాలు రాయను నన్నెందుకు వేధిస్తారు? నా భార్య పత్రికలలో పద్యాలు ప్రచురిస్తుంది ఆమెను కోరండి అని రాశాడు

ఈ సంఘటన నుంచి మనం తెలుసుకో దగిన విషయాలు చాలా వున్నాయి నూరుపై చిల్లర ఏళ్ళక్రితం బ్రిటనులో పత్రికలు సాహిత్యం ప్రచురించటానికి ఆత్రపడేవి సాహితీపరులు పత్రికల మీద ఆధారపడ కుండా వారి వర్తక ఔదార్యం లక్ష్యపెట్ట కుండా తమ రచనలను పుస్తకాలుగా వెలువ రించుకోగలిగేవారు కొందరు సాహితీపరులు (ఉదా చార్ల్స్ డికెన్స్) తమ రచనలను పత్రికలలో ప్రచురించటానికి సంకోచించలేదు అందుచేత పత్రికలలో మంచిసాహిత్యం రాదన్నమాట బ్రిటన్‌లో ఎనాడూ లేదు

మనదేశంలో పరిస్థితిఏమిటి? నిన్న మొన్నటి దాకా మన ప్రకాశకులు ప్రాచీన సాహిత్యాన్నీ పాఠ్యపుస్తకాలనూ ప్రచురించినవారు ఆధునిక సాహిత్యం అర్భకపుదశలో వున్నప్పుడు కూడా దాన్ని ప్రోత్సహించటానికి పుట్టిన పుస్తక ప్రచురణ సంస్థలు చాలాకొద్ది ప్రజలలో పఠనా సక్తి పెరిగిన తీరుగా సాహిత్యగ్రంథాల ప్రచు రణ విస్తరించని మాట నిజం

అలాటి పరిస్థితిలో లక్షలాది పాఠకులకోసం వందల సంఖ్యలో బయలుదేరిన పత్రికలు సాహిత్యానికి తప్పనిసరిగా వాహకాలయాయి కాకపోతే ఈ పత్రికలు వ్యాపారకారణాలవల్ల అచ్చగా ఉత్తమసాహిత్యమే వేస్తాయని కంకణం కట్టుకోలేదు రాశిమీద లఘుసాహిత్యం అధికంగా వుండిన కారణంచేత పత్రికలు అచ్చగా అదే ప్రచురిస్తున్నట్టు, భ్రమకలిగి వుండవచ్చు కాని అది భ్రమే

ఈ కాలంలో వచ్చే మంచి సాహిత్యం— ముఖ్యంగా, కల్పనాసాహిత్యం - ఒక్క శాతమే అనుకున్నా దాదాపు అది అంతా పత్రికల ద్వారానే వచ్చింది చిత్రం ఎమిటంటే ఈ నాడు విరివిగా వున్న పుస్తకప్రకాశకులు ఉత్తమసాహిత్యం జోలికి పోవటానికి భయ పడుతున్నారు

ఒకటి రెండు ఉదాహరణలు చెబుతాను 1937లో నేను తొలిగా యువ ప్రచురణలు ప్రారంభించి చలంగారిని కొన్ని కథలు అడి

మీ అందానికి తగిన
మిల మిల మెరిసే చీరెలు!

కంచి, ధర్మవరం, బెంగుళూరు, బెనారస్, ఆరణి పట్టుచీరెలు!!

వేలకొలది రకములు
గ్యారంటీ వెండి
జరీతో తయారైనవి
లభించును

# లక్ష్మి జనరల్ స్టోర్స్

గవర్నరుపేట, విజయవాడ-2
గ్రామ్స్: శిష్టా, ఫోన్: 73467, 77052





గితే ఆయన బోలెడన్ని వ్రాతప్రతులు నా ముందుపడేసి, కావలసినవి తీసుకోమన్నారు. ఆ రోజుల్లో చలంగారి రచనలు అచ్చు వెయ్యటానికి అప్పుడు కొద్దిపత్రికలు భయపడేవి పుస్తకాలు వేసేవాళ్లు లేరు. అప్పుడు నేను "పాపం!!" ప్రచురించాను. పత్రికలు చెయ్యాని పని పుస్తక ప్రచురణకర్తలూ చేయ లేదు

నేను నలభై ఏళ్ళ పాటు రాసిన కథలూ, పెద్దకథలూ ఇవాళ ప్రచురించేవాళ్ళు లేరు కాని సాహిత్యంగా ఆ రచనలను ఆదరించే వారు కొద్ది యింకా వున్నారు ఆ మాటకు వస్తే నా రచనల ఆధారంతో డాక్టరేట్ సంపాదించుకున్నవారూ, సంపాదించటానికి ప్రయత్నించినవారూ వున్నారు. ఆ రచనలన్నీ పత్రికలలో వచ్చినవే.

మళ్ళా ఒకసారి ఇంగ్లండుకు పోదాం. ఒక పుస్తక ప్రచురణకర్త చార్ల్స్ డికెన్స్‌కు ఒక కంట్రాక్టు రాసి ఇస్తూ, ఆయన రాగల నాలుగేళ్ళలోపల చేసే రచనలను తాను పుస్తకాలుగా వేసుకునేటందుకు అడ్వాన్సుగా—పరిష్కారంగా కాదు!—28,000 పౌన్లు ఇచ్చాడు.

తెలుగులో ఇటువంటి గౌరవం "హాట్ వేవ్" రచయిత్రులకు కూడా జరిగివుండదు.

ఇవాళ కూడా మంచి సాహిత్యం కావలసిన వారికి అది, సముద్రంలో కాకిరెట్టలాగే అనుకోండి, పత్రికలలోనే దొరకాలి. పుస్తకాలలో లభించటం కష్టం. ఎప్పటికప్పుడు సృష్టి అయ్యే సాహిత్యం మాట చెబుతున్నాను

—కొడవటిగంటి కుటుంబరావు,

మద్రాసు

నా శేషప్రశ్న కథ (డిసెంబర్ జ్యోతి), దానిపై విజయ్‌గారి విమర్శ (ఫిబ్రవరి), నా జవాబు (మార్చి), విజయ్‌గారి ప్రతివిమర్శ (మే) లను దృష్టిలో వుంచుకొని, "ముందుగా అభిప్రాయాలు ఏర్పరచుకుని మాట్లాడటమంటే, ఎదుటి వారిని చర్చనుండి విరమింపచేయటమే" అన్న విజయ్‌గారి అభిప్రాయంతో ఏకీభవిస్తున్నాను.

—వినయ్ ఎస్., జి.,

మిగతా పనులన్నీ మానేసైనా సరే చేతిలో పుస్తకాన్ని పూర్తిచెయ్యాలన్నంత అభిలాషని తెలుగు పాఠకుల్లో కల్గించింది నిస్సంశయంగా మాసపత్రికలూ, వారపత్రికలే. అయితే 'సీరియల్' అనేసరికి రచయిత కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలి.

1. రచనలో సస్పెన్సు వుండి, వచ్చేవారం (నెల) కోసం ఎదురుచూసేలా చెయ్యాలి. ఇంకోలా చెప్పాలంటే డిటెక్టివ్ నవలా ఛాయ ఉండాలి. మొదటి ఇష్యూలో వేసిన ముడిని చివరి ఇష్యూలో విప్పితే-అది మంచి సీరియల్‌గా గుర్తించబడుతుంది.

2. పాత్రల మానసిక సంఘర్షణని ఎక్కువ వర్ణించకూడదు నాలుగు పేజీలు దాని గురించే వ్రాస్తే యిక ఆ ఇష్యూలో ఏ ట్విస్టూ వుండదు కాబట్టి "ఈ సంచికలో ఫలానా సీరియల్ ఆసక్తికరంగా లేదూ" అని వుత్తరాలు వస్తాయి. కాబట్టి విషయం చప్పున తేల్చేయాలి. ముఖ్యంగా 'కాన్‌ఫ్లిక్టు' వున్న చోట.

3. ఒక పత్రికలో ఒకేసారి రెండు మూడు సీరియల్స్ పడుతూవుంటాయి కాబట్టి, మీది వేదాంతపరమైన కథ అయి, వేరొకటి అబ్బాయి అమ్మాయిల ప్రేమకథ అయివుంటే పాఠకులు చప్పున అటు మొగ్గుతారు. అంతేకాక-సీరియల్ నవలల్లో క్యారక్టరైజేషన్‌కి పెద్ద ప్రాముఖ్యత ఇవ్వనవసరంలేదు (కొన్ని నెలలపాటు నడుస్తుంది కాబట్టి). పాత్రల మానసిక పరిపక్వతకన్నా-సీక్వెన్సురైజింగుకీ, నాటకీయతకీ ఎక్కువ ప్రాముఖ్యత యివ్వాల్సి వుంటుంది.

పైవేవీ మంచి నవలా లక్షణాలు కావు. అందుకే చివరకు మిగిలేదీ, మోహన వంశీ, అల్పజీవి, మనీ ఛేంజర్స్, ప్రైజ్, శ్రీకాంత్ లాటి నవలల్ని ఎవరైనా సీరియల్స్‌గా వేయబూనితే, ఆ పత్రిక సర్క్యులేషన్ సగానికి సగం పడిపోవటం ఖాయం

అయితే ఒక విషయం. ఇప్పుడిప్పుడే తెలుగు నవల చదవటంతో పెద్దబాలశిక్ష పూర్తి చేసిన సగటు పాఠకురాళ్ళు-తొందరలోనే దాంతో

విసుగెత్తిపోయి, "స్వారోచిష మను సంభవ మేదీ?" అని అడగబోతున్నారు ఈ పరిస్థితి ఎంత తొందర్లో వస్తే అంత మంచిది. రావటానికి దోహదం చేస్తున్నది మన పత్రికలే.

యండమూరి వీరేంద్రనాథ్.

మే నెల జ్యోతి చూశాను. జ్వాలాముఖిగారి "వేలాడిన మందారం" నవల పర్వాలేదు వారి కథలలో వున్న ఇన్స్పిరేషన్ నవలలో లేదు. అలాగని రచయిత బాధ్యతారహితుడిగా ఎక్కడా కనబడదు.

కథలు స్టాండర్డ్ బాగున్నాయి. కాని యద్దనపూడిగారి సీరియల్ చాలా తక్కువగా ప్రచురించి ఊరిస్తున్నారు.

ఉత్తరాల శీర్షికలో సాయిలలిత, రమణమూర్తి (నంద్యాల)గార్ల ఆక్రోశం ఆవేదన మేమూ గమనించి బాధపడ్డాము. వారి అభిప్రాయాలకు మనమూ జవాబు తెలుసుకోవాలి.

— ఈతకోట సుబ్బారావు
నెల్లూరు

'వేలాడిన మందారం చాలా ఆలోచనలను రేకెత్తించింది అనడంకన్నా మనసులో అంతకుముందు నుంచీ అస్తవ్యస్థంగా వున్న ఆలోచనలకు ఓ స్పష్టమైన రూపాన్నిచ్చిందనడం సమంజసం.

'దెబ్బకు దెబ్బ, ప్రాణానికి ప్రాణం' అనే ఆటవికపు ధర్మసూత్రానికి సజీవ, 'న్యాయబద్ధమైన', వారసురాలీ 'ఉరి'. మనం ఆటవిక దశ నుండి ఎదిగినా, ఎదిగామనీ అణుయుగంలో అడుగిడామనీ గొంతులుచించుకుని అరిచి చెపుతున్నా-మనలోనూ, మన న్యాయవ్యవస్థలోనూ జీర్ణించుకుపోయివున్న అనాగరికతకు నిదర్శనమీ 'ఉరి.'

భుట్టోను చట్టబద్ధంగా హత్యచేశారు. దొరతనం మౌనాన్ని ఆశ్రయించినా ప్రముఖులంతా రాష్ట్రపతితో సహా-దాన్ని గర్హించారు. విచారించారు. జయప్రకాష్ కృపలానీ చంద్రశేఖర్ లాంటి వాళ్ళు వ్యక్తిగతంగా ఉరిశిక్ష మీద వ్యతిరేకభావాన్ని వెలిబుచ్చారు. ఇంతమంది ప్రముఖులు ఇంత స్పష్టంగా 'ఉరి' అనాగరికమని భావిస్తున్నప్పుడు మరి మన నాగరికత నా ఉరిబారి నుండి తప్పించడానికి అడ్డంకులేవిటో? వీరంతా కలసి 'ఉరి'ను న్యాయశాస్త్రాల నుంచి తొలగించడానికి ఎందుకు ప్రయత్నించలేదో?! గాంధీగారి అహింసా సిద్ధాంతానికి వారసులమని చెప్పుకొనే మన గాంధీయవాదులంతా - మొరార్జీతో సహా - ఈ విషయంలో గట్టిగా కృషి చేయవలసి వుంటుంది. ప్రపంచవ్యాప్తంగా కూడా 'ఉరి'కి తిలోదకాలిచ్చే రోజు ఎంతో దూరంలో లేదని నా అభిప్రాయం. ఇస్లామిక్ దేశాల్లో-అలా అనడంకన్నా ఇస్లాంను అడ్డంపెట్టుకొని గుడ్డిగా ప్రజల్ని చంపే నియంతలున్న దేశాల్లో-కూడా అంతో యింతో ఆలస్యమైనా ఈ పరిణామం వచ్చి తీరుతుంది.

నవలగురించి, పదునుగా వున్నా ప్రచార ధోరణి వుంది మొదటినవడంవల్ల కొంత అమెచ్యూరిష్‌గా వుంది. పాత్రల గతాలను ఉపకథలుగా వర్ణించడం అంత మంచి శిల్పం కాదనుకొంటాను. ఏమైనా కీర్తికిరీటాల కోసం కథకులూ, వాళ్ళకు కిరీటాలను పెట్టడంకోసం పత్రికల యజమానులూ శాయశక్తులా కృషి చేస్తున్న ఈ తరుణంలో ఇంతటి సామాజిక స్పృహవున్న నవలరావడం ఆనందదాయకం. మరిన్ని జ్వాలలు మీ పత్రికాముఖంగా వస్తాయని ఆశిస్తున్నా.

—అమరేంద్ర.

ప్రశాంతగారి "ఇది కథ కాదు" అనే కథ అందరికీ తెలిసిందే. నేటి సమాజాలలో ఎన్నో కుటుంబాలలో జరుగుతున్న కథే ఇది కాని రచయిత ఎంతో శ్రమపడి పాతమసాలానే పట్టుగా తీసుకొని వ్రాశారు. నిజం చెప్పాలంటే సుధీర్ చాలా అమాయకుడే. ఏ కన్న తండ్రయినా తన కూతురు పరవాడితో కులికిందని దాని ఫలితంగా గర్భిణీ అయిందని, వాడిని వదిలించుకొన్నామని వేరే వాడితో సంబంధం చేసి వివాహం చేస్తున్నామని పెళ్ళికి ముందు చెప్పగలరా? ఈ విషయం మునుపే చెబితే కానున్న పెళ్ళి ఆగిపోదూ! ముందే చెబితే సమర్ధించుకొనే వాడిని అన్నమాట అనిపిం

చారు సుధీర్‌తో! తనకు కాబోయే భార్య పరాయివాడితో కులికింది అని తెలిసి కూడ ఎందుకు వివాహమాడతాడు. అవన్నీ కల్లబొల్లి మాటలే కదా!

ఈ కథకు 'ఇది కథకాదు' అనే పేరుకన్నా "ప్రతీకారం" అనే పేరు చాలా బాగుండేది.

"జ్వాలాముఖిగారి వేలాడిన మందారంలో రచయిత కేవలం జైలుజీవితాన్ని విశద పరచారు. మొదట్లో కొంత 'బోర్' అనిపించినా తరువాత చాలా బాగుంది. ఖూనీ చేసినంత మాత్రాన ఆ నేరస్తుడికి(రాలికి) ఉరిశిక్ష విధించారు. మన దేశంలో అల్లా గనుక జరిగితే ఇక ఖూనీలుండవు. మనిషిని చంపితే తాను కూడ ఉరికంబ మెక్కవలసి వస్తుంది అనే భయం వుంటుంది. కథల్లో అయితే రాయచ్చు గాని, దాన్ని అమలుజరిపే ప్రభుత్వం లేదు. 'LOVE' అనే పదానికి విడివిడిగా ఒక్కొక్క అక్షరానికి అర్థం చాలా బాగుంది. కేవలం క్రైస్థవ మతాన్ని ఎక్కువగా వాడారు. బహుశః వీరు క్రైస్థవులనుకుంటాను.

—మాడ్గుల ప్రభాకర్.

ఏప్రియల్ జ్యోతిలో శ్రీ శ్రీ గారితో మాట్లాడిన-మాట్లాడించిన ఏడిద గోపాలరావు గారి వ్యాసములో సినిమాలను గురించిన ప్రస్తావనలో శ్రీశ్రీగారు ఇలా వ్రాసారు. రుక్మిణీ కల్యాణము, సినిమా తీద్దామని కొంత ప్రయత్నించిన తరువాత ఆగిపోయిందట. అందులో అతన్ని (శ్రీశ్రీ) ఆకర్షించిన ముఖ్యమైన అంసము ఒక రాజుకూతురు, గొల్లవాడిని పెళ్లి చేసుకోవడము, ద్వాపరయుగంలో, ఏనాడో-ధనవంతుల పిల్ల యాదవుణ్ణి చేసుకోవడము నాకు నచ్చింది. ఆ నాడు కూడా కులాంతర వివాహాలకు, ధనవంతులకూ, బీదవారికీ మధ్య జరిగే వివాహాలకు ఎందరి అండదండలున్నాయన్నాయట? ఇటువంటి ప్రశ్నలు వేసేవారు వారి పిల్లలకు అలా-పెళ్ళిళ్ళు చేసి చూపించాలి. మాటలు చెప్పడము కాదు

భాగవతములో యదువంశీయులందరూ దేవతలేననీ (సురులు) సాక్షాత్ నారాయణుడే కృష్ణుడనీ యదువంశము చదివినా, విన్నా, గానం చేసినా, పునర్జన్మ లేదనీ వుంది. యయాతి మొదలైన మహారాజులందరూ యాదవరాజులే మరి? కృష్ణుణ్ణి గొల్లవాడనీ ఆ కృష్ణవిగ్రహాన్ని కళ్ళకద్దుకోవడమెందుకూ? దేవుడే కదూ? మనుష్యులకు కులాలను ఏర్పరచినదెవరూ? అసలు దేవుడికి కులముందా? బాగా ఆలోచిస్తే కులానికి సంకరముందా? కలికాలం వర్ణసంకరమైపోతుంది అని గోల పెడుతున్నారుగాని అసలు మనుషుల, మనసులకే సంకరమనే పదము వర్తిస్తుంది. ఒకప్పుడు చాటు మాటుగా చేసే వ్యవహారాలు ఇప్పుడు బాహాటంగా చేస్తున్నారు.

నేను విద్యకీ విజ్ఞానానికీ చాలా చిన్నిదాన్ని కాని తెలుసుకోవాలనే కాంక్షతో వ్రాస్తున్నాను. అసలు కులము మనిషితో పుట్టిందా? మనిషి చేసే పనితో పుట్టిందా? అగ్రకులం వారనీ అన్నీ తెలిసిన వారనీ చెప్పుకునేవారు నిర్ణంచారా ఈ కులాలు? ఇది నీచం, ఇది ఉచ్చం, అని ఈ వరుసమెట్లు ఎవరు నిర్మించారు? విద్య, విజ్ఞానము, హృదయ నైర్మల్యము ఎవరికుందో వారే ఉన్నతులు-పూజ్యనీయులూ అని నా అభిప్రాయము.

—ఎం. వి. రమణమ్మ, బిలాస్‌పూర్.

## ప్రేమ సింహాసనము

సీరియల్ యీ సంచికలో ప్రచురించలేక పోతున్నందుకు విచారిస్తున్నాము. వచ్చే సంచికనుంచీ సీరియల్ యథావిధిగా కొనసాగుతుంది.

—ఎడిటర్



# మయసభ

ఎక్కడన్నా బయటిదేశానికి వెళితే "పొగడరా నీ తల్లి భారతి"ని అన్నాడు కవి.

మరి భారతదేశంలోనే వున్నప్పుడు ఈ భారతీయుడనబడే వాడు దేన్ని పొగడాలి?

అని నన్ను అడిగితే "భారతియ రైల్వేలను" అని చెప్పేస్తాను.

**WHY SO?**

అంటే—అనాదిగా భారతదేశం పేరుపొందినటువంటి ఆ అనాసక్తమైన స్థిత ప్రజ్ఞత్వానికి ఈనాడు ఇతోధికంగా తోడ్పడుతున్నవారు రైల్వేవారే!

మన శరీరాలకు మెదడులకు మాంచి వ్యాయామం కల్పించి వాటిని 'టిప్‌టాప్' కండిషన్‌లో వుంచేవాళ్ళు రైల్వే మహాశయులే!

"వసుదేవుడంతటివాడు—" అన్నటువంటి వేదాంత ధోరణిలో, అహాన్ని పూర్తిగా నాశనం చేసి, "అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ!" అంటూ భగవద్గీతలో కృష్ణభగవానుడుపదేశించినట్లు సంపూర్ణ శరణాగతి పొందడానికి భారతీయ రైల్వేలకన్న మంచి శిక్షణ ఎవ్వరివ్వగలరు?

—"ఏమిటయ్యా నువ్వు? మనుషుల్ని వారు కోరినచోటికి తీసుకెళ్ళడం కదా రైల్వేల పని మరి ఆ విషయం చెప్పకుండా, వేదాంతము వసుదేవుడూ అంటున్నావేమిటి?" అని తొందరపడుతున్నారుకదూ

అదే మరి తమాషా! మన దేశం దేశం కాదు, కర్మభూమి, ఇక్కడ మనిషి మనిషి కాడు ఆత్మస్వరూపుడు, పశువు పశువు కాదు గోమాత! ఆచార్యులు ఆచార్యులు కారు రాజకీయుల బొదుసులు!

అంచేత ఈ 'స్వర్గాదపి గరీయసీ' అయిన దానిలో అన్నిటికి వెనక కథ బోలేడు వుంటుంది, అలాగే భారతీయ రైల్వేలకు కూడాను

మరిప్పుడు అవధరిస్తారా?

మీ అత్తగారు కాకినాడనుండి వస్తోంది; గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో వస్తోంది, సికిందరాబాద్‌లో వున్న మీరు మామూలు కన్న రెండు గంటలు ముందుగా లేచి ముఖాదులు కడుక్కుని, వీధికొసని వున్న కాఫీ హోటలుకెళ్ళి, రూపాయిచ్చి రైల్వేస్టేషన్ ఎంక్వైరీస్‌కి ఫోన్ చేయడానికి యత్నిస్తారు.

ముందుగా ఫోన్ చచ్చిపోయినట్లుంది.

తర్వాత అది బతుకుతుంది.

కాని ఎక్చేంజి నిద్రనటిస్తుంది.

కాస్సేపటికి అది నిద్రలేస్తుంది.

అలెగ్జాండర్ గ్రాహమ్ బెల్లూ వాళ్ళూ చెప్పినట్లుగా నియమంగానే, మనం ఇక్కడ నెంబర్ తిప్పగానే అవతల 'రింగ్' మోగడం విని మీరు ఆనందంతో ఉక్కిరి బిక్కిరి అవుతారు.

రామసంజీవి

అవతలనుండి ఆవలిస్తున్న గొంతు అడుగుతుంది—" ఎవరు కావాలండీ?"

"గోదావరి ఎక్స్‌ప్రెస్ రైట్ టైమ్‌కు వస్తూందాండీ " అని మీరడుగుతారు.

"ఆ మాట రైల్వేస్టేషన్‌వాళ్ళ నడగవయ్యా! పొద్దున్న మా నిద్ర పాడుచేస్తావేమిటి?" అని కోప్పడుతున్న ఆసామిని—"ఇది రైల్వేస్టేషన్ కాదాండి" అని అడుగుతారు.

"ఇది రమీజా బజార్ పోలీస్టేషన్!" అని ఠమ్మని ఫోన్ పెట్టిన చప్పుడుతో జ్ఞానోదయం అవుతుంది.

హోటల్ ప్రొప్రయిటర్ మీకేసి అనుమానంతో చూస్తున్నట్లనిపించించి, వెర్రిమొహంతో ఒక ఆముదపు నవ్వు నవ్వుతారు.

"హి హి. రాంగ్ నెంబరండీ" అంటూ ఆ 'కల్'కు రూపాయిచ్చుకుంటారు, ఇంకో రూపాయి చెల్లించి, రైల్వే ఎంక్వయరీస్ నెంబర్ అతి జాగ్రత్తగా 'డయల్' చేస్తారు. రింగ్ వెళ్తుంది, కాని మీ హృదయం ఎగిరి గంతేయదు. రింగ్ వెళ్తూనే వుంటుంది. కాస్సేపటికి ఆ రింగ్ తాలూకు లయలో పడిపోతారు ఛందస్సులో మాత్రలు, భారతీయ సంగీతంలో లయ సిద్ధాంతం, మిశ్రత్రిపుటతాళం, కోలంక వెంకటరావు 'తని' ఆవర్తనం, పల్లవి, అనుపల్లవి—ఇత్యాది అనుబంధ విషయాలమీద కెళ్ళిపోతుంది మీ మనసు.

సున్నాపాయింట్ రెండూ అయిదు కల్పాల అనంతరం—" " అని గొంతు వినపడడంలో ఊహాలోకంనుండి ఉడిపి కోమల విలాస్‌లోకి వస్తారు మీరు. మళ్ళీ అడుగుతారు, "సికింద్రాబాద్ స్టేషనేనాండీ"

"యాస్!"

"గోదావరి ఎక్స్ " అని మీరు ప్రశ్న పూర్తి చేసేలోగా "రైట్ టైమ్" అని ఆ గొంతు అనడం, టెలిఫోన్ పెట్టేయడం జరుగుతుంది.

ఇంటికెళ్ళి హడావిడిగా బట్టలు వేసుకుని ఏ ఆటోమీదో పడి స్టేషన్‌కు చేరుతారు.

ప్లాట్‌ఫారం టిక్కట్టు దగ్గర "చిల్లర శ్రీమహాలక్ష్మి" అన్న 'మనీసుడి' గుర్తుకొస్తుంది. ఆ క్లర్క్‌ని అడుగుతారు—"గోదావరి రైట్ టైమే కదండీ—" అని.

"25 నిమషాలు లేటు!" అంటాడాయన . వేరే అర్జంటు పనులు బోలెడున్నట్లు.

వాచీ చూస్తారు "సర్లే ఏ మౌలాలిదగ్గరో ఏదో అడ్డొచ్చి వుంటుంది కాబోలు మొత్తం మీద ఇంకో అరగంటలో వచ్చేస్తుందికదా అని సర్దుకుంటారు.

కాస్సేపు ఇటూ అటూ పచారుచేస్తారు. సినిమా బొమ్మలు, ఇతర రైలుబండ్ల రాకపోకలు, మనుషులు, కూలీలు అన్ని గమనించాక కాళ్ళు నొప్పెడుతున్నట్లు అన్పిస్తుంది. కూచుందాం అని చూస్తారు. కాని కొన్నివందల మంది కాచుకునే ఆ ప్లాట్‌ఫారంమీద సరిగ్గా నలభై మంది కూచోవడానికికూడా బెంచీ లుండవు

ఆలోచిస్తారు. "ఇదొక 'మ్యూజికల్ బెంచెస్' లాటి ఆట కాబోలు వేచివుండే వారి సంఖ్యకన్న బెంచీల సంఖ్య పదిరెట్లు తక్కువగా వుండాలి అన్నది రైల్వేవారి ప్రిన్స్‌పుల్ కాబోలు" అని సరిపెట్టుకుంటారు.

ఆ కొసదాక వెళ్ళివస్తారు. ఈ ప్లాట్‌ఫారం ఎక్కి దిగుతారు.

అయింది. ఇంక అయిదేనిముషాలున్నాయి; ట్రయిన్ వచ్చేస్తూ వుండాలి, లౌడ్‌స్పీకర్లు గరగరలాడవేం, అనౌన్సర్లు గళం విప్పరేం అని తహతహలాడుతుంటారు.

పది నిముషాలవుతుంది. పాతిక నిముషాల ఆలస్యం కలుపుకున్నా రెండు నిముషాల కింద వచ్చివుండాలి.

ఎంక్వైరీకి పరుగెడతారు.

"ఎనిమిదింబావు కొస్తుందండీ!" అంటాడతగాడు.

అతడిని సాచి లెంపకాయ కొడదామనిపిస్తుంది. కాని పాపం రైలుని నడిపే వాడతడు కాడే అన్పిస్తుంది. కాని మీలో విప్లవభావాలు రగులుకుంటూ వుంటాయి. రైల్వేలను చెడామడా విమర్శిస్తూ వ్యాసం రాయాలనిపిస్తుంది.

కానేవటికి వ్యాసం కాకపోతే పోయె 'సంపాదక మహాశయా' అని "అత్యధికంగా ప్రజాదరణ పొంది"యున్న ఆరేడు దినపత్రికలలో ఒకదానికి 'లేఖ' రాద్దామనుకుంటారు. ఆ మధుదండావతే గారిలా స్తే బాగుండును— "ఆ రైల్వే వేగన్ల కర్మాగారం మీరు అనుకోనట్లే అరవ్వాళ్ళ కివ్వండి! మా రైళ్ళు కనీసం గంటకన్న ఎక్కువ లేటుకాకుండా చూడండి—" అని చెబుదామనుకుంటారు.

ఈ లోపుగా మీ వైజాగ్ మిత్రుడు శేషగిరి వీపు తడతాడు. ఉభయకుశలోపరి అయింతర్వాత శేషగిరి తన కధ వివరిస్తాడు. "వచ్చే మంగళవారానికి వాల్తేరుకు రిజర్వేషన్ కావాలని నిన్న సాయంకాలం వచ్చాను. రెండు గంటలు క్యూలో నించున్నాక వచ్చే బుధవారందాకా 'గోదావరి ఎక్స్‌ప్రెస్'లో చోటులేదని తెలిసింది. 'సరికదా' అని 'కృష్ణా ఎక్స్‌ప్రెస్' లైన్‌లో కెళ్ళేసరికి బుకింగ్ టైమయిపోయింది. ఇవాళ అవసరమయితే రోజంతా ఇక్కడే వుండి, ఏదో ఒక బండిలో రిజర్వేషన్ సాధించి మరీ వెళతాను" అన్న కృతనిశ్చయుడయిన శేషగిరి చేతిలో బ్రీఫ్‌కేసు, చిన్న ఏర్-పిల్లో, దొంతర పుస్తకాలు, భుజానికి కాఫీ ఫ్లాస్కు, వాటర్ బాటిల్ వుండడం చూచి—"ఆహా! రైల్వే రిజర్వేషన్ అన్నది ఎంత మంచి ట్రెయినింగ్ కోర్సో" అన్పిస్తుంది మీకు.

ప్లాట్‌ఫారం మీద వున్న లౌడ్‌స్పీకర్లన్ని వరసగా గొంతులు సవరించికోవటం విని చెవులటు మళ్ళిస్తారు.

" లమీదుగా పోవు పాసింజర్ అయిదో నెంబర్ ప్లాట్‌ఫారం నుండి అయిదు నిముషములలో బయలుదేరును."

రక్‌మని మైక్ మూసిన చప్పుడు.

శేషగిరి ఆశ్చర్యంతో నిండిపోతాడు "అరె! మీ వూళ్ళో అనౌన్స్‌మెంట్లలో 'పాసింజర్, ప్లాట్‌ఫారం, అయిదునిముషాలు' ఈ మాటలన్నా స్పష్టంగా విన్పించాయే! "

"అంటే?"

"మా వాల్తేరు ప్లాట్‌ఫారం మీద అనౌన్స్‌మెంట్లు వింటేగాని మీరెంత ఫార్వార్డో మీకు తెలీదు. మాకు అక్కడ తెలుగు ఇంగ్లీషులాగాను,హిందీ'ఉంగా' భాషలాగాను, ఇంగ్లీషు అరవ్వాడు మాట్లాడిన తెలుగులాగాను వుంటుంది. అవి నిజంగా రైలుబండ్లను గురించిన ప్రకటనలా లేక ఏవయినా క్షుద్రశక్తులను పారద్రోలడానికి కాపాల మాంత్రికుడు వల్లిస్తున్న దండకాలా, టయిముకు బడికి రాని పిల్లల్ని కోప్పడుతున్న హెడ్‌మిస్ట్రెస్ పరుష వాక్యాలా, తెలుగు సినిమాల పొదరింటివాటున పలికే ప్రేమ సంభాషణలా—అని స్పష్టంగా తెలియదు. వాళ్ళ వాళ్ళ అనుభవాన్ని బట్టి సంస్కారాన్నిబట్టి జనం వ్యాఖ్యానించుకోవచ్చు "

"అంటే బ్రహ్మసూత్రాలన్న మాట—"

"ఎస్" అన్నాడు శేషగిరి

ఈలోగా ఝూమ్మంటూ వచ్చిందొక ఎక్స్‌ప్రెస్. ప్లాట్‌ఫారం అంతా రణరంగం అయిపోయింది. కడలి తరంగాల్లా పరుగెడుతున్నారు ప్రయాణీకులు. ఇంత అల్లకల్లోలం మధ్య నిశ్చలంగా నిలబడివున్న ఆ అపర మహావిష్ణువు, ఆ కాలాంబరధారి, ఆ పుస్తక హస్తుడు, ఇంకెవరు?

మన టి.టి.ఇ./టి.ఇ.!

బెల్లం దిమ్మ చుట్టు మూగే ఈగలవలె, పెప్పరమెంట్ల కోసం చుట్టుముట్టే పిల్లలవలె అతడి చుట్టూ, ఆఫీసర్లు, ఆడవాళ్ళు, వ్యాపారస్తులు, కౌన్సిలర్లు! "ఆహా సోషలిజం అంటే ఇదేకదా—" అన్పిస్తుంది.

ఇంతమంది చుట్టుముట్టినా ఆ కేంద్ర బిందుస్థానంలో వున్న మహాశయుడు మాత్రం నిశ్చలంగా, కాగితం మీది గళ్ళమధ్య అంకెలు గీస్తూ, మధ్యమధ్య "మీకేకాదండీ చెప్పడం—" అని ప్రయాణీకులను మందలిస్తూ, చాలా బిజీగా కన్పడుతున్నాడు.

"ఇక్కడ ఇలా అంటారా, రైలు ఎక్కేశామనుకో — బెర్తులు 'సంపాదించ'వచ్చు—" అని వివరించాడు, దృశ్యా దృశ్యానుభవాల సంపుటి అయిన రైలు ప్రయాణీకుడు శేషగిరి.

రైల్వేలగురించి ఇంత క్షుణ్ణంగా తెలిసిన వాడుకదా, అని తన చిన్ననాటినుండి పీడిస్తున్న ఒక సంశయాన్ని వెల్లడించారు మీరు "ఒరేయ్ శేషగిరీ! ఆరు నెలలకోసారి కొత్త రైల్వే టైంటేబిల్స్ వేస్తారుకదా దానికోసమని రైలు వేళలు మార్చుట, కొత్త హాల్టులు పెట్టుట, పాత హాల్టులు తీయుట—వగైరా చేస్తారా? లేక ఇవన్నీ చేస్తాంకదా అని టైంటేబిల్సు వేస్తారా?" అని అడిగారు.

శేషగిరి చిద్విలాసంగా నవ్వాడు "నాయనా! కోడికోసం గుడ్డా గుడ్డుకోసం కోడియా?"

మళ్ళీ లౌడ్‌స్పీకర్ పలుకుతుంది.

"గోదావరి ఎక్స్‌ప్రెస్ పావుగంటలో రెండవ నెంబర్ ప్లాట్‌ఫారంపై వచ్చును" వాచీచూస్తారు. తొమ్మిదయి వుంటుంది పరుగెడుతారు.

శేషగిరినీ, విప్లవాన్ని, సంపాదకుడి లేఖను మరిచి పరుగెడుతారు

పావుగంట అని అన్నారుగాని ముప్పావు గంట తర్వాత పదికి పదినిముషాలుండగా వస్తుంది రైలు.

రాక చస్తుందా?

రైలుపట్టాలమీద బండి నడిచినంతకాలం, కాజీపేట దాటింతర్వాత సికిందరాబాదు రాక మానదుకదా? కాకపోతే నాలుగ్గంటలు ఆలస్యం!

కాలమన్నది అనంతం!

జీవితం అన్నది వలయం!

ఈ అనంత వలయంలో ఆఫ్టరాల్ నాలుగ్గంటలనగా ఎంత?

చూశారా భారత రైల్వేల వేదాంత సేవా నిరతి!!

ఒక్క ప్రయాణీకురాలిని రిసీవ్ చేసుకోవడానికి వెళ్తేనే ఇంతటి నిదానము, ప్రశాంత యోగమూ అలవడ్డాయి మీకు!

నెలకోసారి ప్రయాణం చేసే వాళ్ళంతా సాక్షాత్తుగా వసిష్ఠులూ, విశ్వామిత్రులూను!

అందుకనే ఇది పుణ్యభూమి! ఇక్కడి రైల్వేలు చక్రాలమీద నడిచే ఆశ్రమాలు! □

అవసరాల రామకృష్ణారావు ఆలపించు రసవద్గీత (18)

# జనవిముక్తి యోగం

* మంచిరోజు వస్తుందని
యువతని ఉద్బోధిస్తూ
పాడిన నా పాట చివర
పరపర ప్రశ్న పరంపర'

* ప్రజకు మటుకు బాధ మిగులు
ప్రభుత కొరకు సుఖముదఖలు
చింకి పాత ప్రజా 'నేత'
బాబుల కెప్పుడు బైబై?

* 'నేటి బాలలే రేపటి
బాబాలు'గ తీర్చి దిద్దు
సుప్తుగాళ్ల చూరు నీళ్ల
కప్పల కెప్పుడు బుస్ బుస్?

* 'అక్కడ మీ' అనుయాయులు
ప్రభువు చాటు 'ప్రజాకవులు'
కుక్షింభర రుద్రాక్షపు
పిల్లలకెప్పుడు భౌభౌ?

* ఈ విధమే నానారక
స్వార్థపరుల రచ్చకీడ్చి
ఆ నఖశిఖ పర్యంతం
ఇంకెప్పుడు తథగిణతోం?

* ఎప్పుడు అని పడివుంటే
చెప్పరు దిగి ఇంకెవరో
నేడే అధర్మ నిధనం
మీదే ఈ కర్తవ్యం

* ఆవేదన అధిగమించి
ఆలోచన అతిశయించి
పట్టి చూడు లవవేశం
మేడి పండు మనదేశం

* ఉన్నవాడి దే హాయము
లేనివాడు జీ హుక్కము
ప్రజాస్వామ్య మిది అంటే
బుద్ధి దెబ్బ తిన్నట్టే

* సుఖభోగికి పీకమొయ్య
శ్రమజీవికి చిలికొక్కయ్య
సమ సమాజ మిది అంటే
రేపీకటి వున్నట్టే

* మతం పేర హత్యకాండ
మనకో జాతీయ క్రీడ
సెక్యులరిజ మిది అంటే
సిగ్గులజ్జ లేనట్టే

* అన్నీ వదులైన వాళ్ళు
ఫన్నీ నాయకులంటే
లీడరుగా తగిన వాళ్ళు
నడిమి వయసు యువజనమే

* ముప్పైఫ్ఫ ఏళ్ళకు పైగా
మనదే పాలన అయినా
నూటికి తొంభై మందికి
నేటికి కూటికె కరువా!

* ఇన్ని కోట్ల జనుల చరిత
ముందే రాస్తాడెవడో!
అంత పెద్ద లైబ్రరీకి
ఎక్కడ చోటుంటుందో!

* అంతా మన విధి లిఖితం
అని నమ్మిన కథ ఫలితం?
కొద్దిమంది మేడమీద
కోట్లకొలది చెట్లకింద!

* ఒక్కడు బలపడు నీతులవి
పాతవి పుచ్చువి పడగొట్టి
అందరూ సుఖపడు రీతులివి
కొత్తవి గొప్పవి నిలబెట్టు

* సాయుధ విప్లవ మొకటే
నేటి యువత ఆదర్శం
జన విముక్తి సాధనమే
మేటి కవిత అంతర్యం

* గీతికి ఇది తురుపు విరుపు
జాతికి ఇది మేలుకొలుపు
సకల కుహూరుత సారం
కదన కుతూహల రాగం

* స్లేపుల్‌గా వినిపిస్తే
ప్రతిబిట్టూ రసపట్టే
పన్ ఫన్‌తో తినిపిస్తే
ప్రతిపిట్టూ పెసరట్టే

* తిన్నందుకు విన్నందుకు
అందరికీ అభినందన
వ్యంగ్యహాస్య సుందరాస్య
స్వరరుచి కిక 'జనగణమన'

* ఈ గీతిక ప్రచురించిన
జ్యోతికి నా వందనం
తెలుగువాడి మెరుపుదాడి
శ్రీశ్రీ కిది అంకితం



# శ్రీశ్రీ నిర్వహించు పదబంధ ప్రహేళిక

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ■ | 1 | 2 | ■ | ■ | ■ | 3 | 4 | ■ |
| 5 | | | 6 | ■ | 7 | | | 8 |
| 9 | | ■ | 10 | 11 | | ■ | 12 | |
| ■ | 13 | 14 | ■ | | ■ | 15 | | ■ |
| ■ | ■ | 16 | | ■ | 17 | | ■ | ■ |
| ■ | 18 | | ■ | 19 | ■ | 20 | 21 | ■ |
| 22 | | ■ | 23 | | 24 | ■ | 25 | 26 |
| 27 | | 28 | | ■ | 29 | 30 | | |
| ■ | 31 | | ■ | ■ | ■ | 32 | | ■ |

ఆధారం జూన్ '79

## అడ్డం

1. దీనితో పెడర్థాల అర్ధం అటూ ఇటూ
3. మర్యాదస్తుడు అసమాపక క్రియ
5. —ఆడేది పోటీ
7. నిద్రకి పచ్చజెండా
9. సరిగ
10. పళ్ళకీ కొమ్మలకీ
12. చీమలశ్రమ
13. లంచం?
15. ఆహ్వానించు
16. చెట్టు వెళ్ళడం
17. పై
18. ఏడు
20. శక్తి రెండుస్వరాలు
22. కచ్చా?
23. భూదాన గ్రహీత

25. సి, నాః
27. అతిధులకు
29. సమాధ్యవస్థలు
31. టాలు ఏకవచనమే
32. హాకీలో గమ్యం

నిలువు

1. నీటిలో సాహసం
2. గురుతుగా వాత
3. రాతు కొద్దీ ఇది
4. బోయలు స్వర్గవాసులు
5. జనం
6 జిహ్వా కొకటి
7. మీదకు చూడు
8. లేదంటే స్ఫురించలేదు.
11. విశ్వాసమే లక్ష్యం.
14. అమ్మకపు చోట్లు
15 తరువాత
18. ప్రత్యక్షం
19. దయం ఉదయం
21. ప్రతిజ్ఞలు
22. మనతో తడబాటు
23. మంచి—కాదెప్పుడూ 11 తప్పదు
24. ఉభయచరం
26. వదరం గీతలు సమానం.
28. మారులిప్పుడు లేరు
30. (తురకల) సమాధి

## ...మే పదబంధ ప్రహేళికకు సమాధానం·

అడ్డము 1. ఆటపాక 4. కవటాకు 7 దండకవిలె 8. పది 10. అది 11. నవమి 13. కుంభిని 14. శుష్కించు 15 తరంగం 16. యయాతి 18. లాభం 21. లుక 22. గాలిబుడగ 24. కాకదంతం 25. బదనిక.

నిలువు 1. ఆలాపన 2. పాదం 3. కడలి 4. కవిత 5. వరె 6. కుముదిని 9 దివస్తారంభం 10. అభిప్రాయాలు 12. కిష్కింధ 15. తలాతోకా 17. తికమక 19. ఫలితం 20. బడబ 22. గాదం 23. గద.

విజేత: వి. గోపాలకృష్ణ, మద్రాసు-20.

## నిబంధనలు గమనించండి!

పదబంధ ప్రహేళిక కొట్టివేతలు, దిద్దుబాట్లూ లేకుండా పూర్తిచేసి మే 27 వ తేదీలోపు మాకు చేరునట్లు పంపండి. తెల్లకాగితం మీద గళ్ళు గీసి పూర్తిచేసి పంపిన ఎంట్రీలు చెల్లవు. ఎంట్రీలు పంపువారు వారి పూర్తి చిరునామా ఎంట్రీపైనే రాసి పంపాలి. ఆల్ కరెక్ట్ ఎంట్రీకి రు. 50/- బహుమతి. ఒకటికి మించి ఆల్ కరెక్ట్ ఎంట్రీలు వొచ్చినప్పుడు బహుమతి సొమ్ము విజేతలకు సమానంగా పంచబడుతుంది. ఆల్ కరెక్ట్ ఎంట్రీ ఒకటీ రాకపోతే బహుమతి సొమ్ము పై నెల బహుమతి సొమ్ముకు కలిపి అందజేయబడుతుంది.

# కవితా చమత్'కారాలు'

## డీయస్నెస్

ఆశ్చర్యాన్నీ, ఆనందాన్నీ కలిగించేటువంటి చమత్కారాలు తెలుగు కవిత్వంలో అనేకం. ఈ చమత్కారాలలో ఇంకా చమత్కారమైనవీ చిత్రమైనవీ చాలా వున్నాయి. అక్షరాలతోనూ, పాదాలతోనూ, అర్థాలతోనూ కవి ఆడుకొనే గమ్మత్తయిన ఆటలవల్ల ఈ చమత్కారాలు కలుగుతాయి. ఇవి 'ఓహో' అనిపిస్తాయేగాని 'ఆహా' అనిపించవని పలువురి అభిప్రాయం అంటే తాత్కాలికంగా ఆనందం లభించినా అది మెదడుకి శ్రమని కలిగిస్తుందని అభిప్రాయం. కాని ఇటువంటి చమత్కారాల్ని చెయ్యటానికి అద్భుతమైన ప్రతిభ, విపరీతమైన ధారణశక్తీ అవసరం. తెలుగుకవిత్వంలో గల చమత్కార రచనల్ని తెలుపటమే నా వుద్దేశం.

ఒక పద్యాన్ని మొదటినుంచి చివరికి చదివినా, చివరినుండి మొదటికి చదివినా మారదు- ఒకేవిధంగా వుంటుంది. నందితిమ్మన "పారిజాతాపహరణము" కావ్యంలో ఈ చమత్కారాన్ని చేశాడు—

నాయశరగ సారవిరయ
తాయనజయసార సుభగధీరనియమా।
మాయనిధీర భగ భసుర
సాయజనయతాయర నిరసాగరశయనా।

దీంట్లో ఇంకొక చమక్కు కూడా వుంది పూర్వభాగాన్ని అంటే రెండోపాదం చివర్నించి చదివితే ఉత్తరభాగం (అంటే మూడు నాలుగు పాదాలు) వస్తుంది. ఉత్తరభాగం తిప్పి చదివితే పూర్వభాగం వస్తుంది. ఇలాగే పద్యంలోని పాదాన్ని మొదటినుండి చివరికి చదివినా, చివరినుండి మొదటికి చదివినా మారదు. ఇలా నాలుగు పాదాలూ ఎటు చదివినా మారని విధంగా పిల్లలమర్రి పినవీరభద్రుడు అనే కవి తన జైమినీ భారతంలో రాశాడు—

వీరవర కైరవర వీ
సారస భరసాధయూధ సౌరభ సరసా
వారణ రథ్య రణ రవా
తార భవన తానమావతా నవ భరతా

*  *  *

అర్థాలు తెలుసుకోవటంవల్ల కలిగే చమత్కారాలు మన సాహిత్యంలో లక్షలుంటాయి. అటువంటి అర్థచమత్కారాల్లో ఒకటి ఈక్రింది చాటువుల్లో కనబడుతుంది.

ఒక కవి కుమారుడు వేశ్యావాటికకి వెళ్ళి ఓ అందమైన వేశ్యని చూశాడు. ఆమెతో కాసేపు మాట్లాడాలనీ, కాసేపు ఆమె అందాన్ని చూడాలనీ ఆ కవి కుమారుడికి కుతూహలం కలిగింది కాబోలు 'తాంబూలంలోకి కాస్త సున్నం పట్టరా" అని ఇలా అడిగాడు

పర్వతశ్రేష్ఠపుత్రిక పతి విరోధి
అన్నపెండ్లాము అత్తనుగన్న తండ్రి
ప్రేమతోడుత కన్నట్టి పెద్దబిడ్డ
సున్నమిప్పుడు తే గదే సన్నుతాంగి!

పైకి చాలా గంభీరంగా పొగడుతూ అడిగినట్లుగా అనిపిస్తుంది. కానీ అర్థాన్ని తెలుసుకుంటే బండారం కాస్తా బయటపడుతుంది. పర్వతశ్రేష్ఠ పుత్రిక అంటే హిమాలయుని యొక్క కూతురు పార్వతి అని అర్థం.పార్వతి యొక్క పతి శివుడు. శివుని విరోధి మన్మధుడు మన్మధుడికి అన్న బ్రహ్మ. బ్రహ్మ పెండ్లాము సరస్వతి. సరస్వతీదేవిగారి అత్తగారు లక్ష్మీదేవి. లక్ష్మిని కన్న తండ్రి సముద్రుడు. సముద్రుడు ప్రేమతో కన్నట్టి పెద్ద కుమార్తె పేరు జ్యేష్ఠాదేవి. దరిద్రానికి చిహ్నం జ్యేష్ఠాదేవి.కాబట్టి "ఓ దరిద్రపుకొట్టు పెద్దమ్మా- కాస్త సున్నం పట్టరా" అని సారాంశం.

కాని, ఆ రోజుల్లో వేశ్యలకి కూడా కవిత్వం సంగీతాది కళలు వచ్చివుండేవి. కవికుమారుడి




పద్యంలోని గూఢార్థాన్ని ఆమె పసిగట్టింది. 'వీడి తిక్క కుదర్చాలి' అనుకుంది. అంతకంటె ఘాటుగా, గూఢంగా సున్నం తీసుకొస్తూ ఇలా అంది—

శతపత్రంబుల మిత్రుని
సుతుజంపినవాని బావసూనుని మామన్
సతతము తలదాల్చు నతని
సుతువాహన వైరి వైరి సున్నంబిదిగో.

కవికుమారుడు 'సన్నుతాంగి' అని అన్నా సంబోధించాడు! ఆమె అదే వాడలేదు. శతపత్రములు-నూరు రేకులు-గల తామరపువ్వులకి మిత్రుడు అంటే సూర్యుడు. (సూర్యునివల్ల తామరపువ్వులు వికసిస్తాయి). సూర్యుని సుతుడు కర్ణుడు. కర్ణుని చంపినవాడు అర్జునుడు. అర్జునుని బావ కృష్ణుడు. కృష్ణుని సూనుడు (కొడుకు) మన్మధుడు. అతని మామ చందమామ. ఆ చందమామని ఎల్లప్పుడూ తలమీద ధరించేవాడు శివుడు. శివుని సుతుడు వినాయకుడు. వినాయకుని వాహనము ఎలుక. ఎలుక వైరి (శత్రువు) పిల్లి. పిల్లి వైరి కుక్క. "కుక్కా! సున్నం తెచ్చా నిదిగో" అని అసలు అర్థం. కవికుమారుని మొఖం ఆ సమయంలో ఎలా వుంటుందో ఊహించండి పాపం!

* * *

అన్యభాషా పదాల్ని వాడి రచించటం ఒక చమత్కారం. తెలుగు, సంస్కృతం కలిపి రాయటం, ఉర్దూ, తెలుగు పదాల్ని కలిపి రాయటం—ఇలా చాలా మంది చమత్కారాల్ని చేశారు. కీర్తిశేషులైన భోగరాజు నారాయణమూర్తిగారు "పండుగ కట్నము" అనే పద్య కావ్యంలో ఆంగ్లభాషా పదాల్ని ఎక్కువగా వాడారు. ఉదాహరణకి ఈ క్రింది పద్యాన్ని చూడండి:

"పోష్టాఫీసున పోష్టుజేయుదాక కార్డున్
రేపే నా మాటలన్
టెష్టున్ జేయగవచ్చు ష్టాటిమిడియట్లీ
యంచు వైరిచ్చుచే
బెష్టున్నింటను వైరు చూచుకొనుచున్
వేవేగమై ట్రైయినులో
నే ష్టార్టే నతడారణాలెకద మీకేమైన
వేష్టెయినచోన్"

తిరుపతి వెంకటకవులు అవధానాల్లో ఇటువంటి చమత్కారాల్ని చేసేవారు. అనేక భాషా పదాల్ని ఉపయోగిస్తూ రాసిన ఈ పద్యం వారి ప్రతిభకి తార్కాణం:

యూయంతంత్రసి డౌర్ తథాపి వెరివెల్
తస్మాన్మమాయం శశీ
నోగాసార్ మదరాసు కాయ కరితం
హింగేందు బాయెందునం
వింగత్సారయ నింగకూద విడుదల్
సీవాడ నంటింగదా
కిస్త్వాస్తే మయిబోల్తహుం అజిసునో
తక్సీర్ నమేరే ఉపర్. 

# భవబంధాలు కప్పగంతుల మల్లికార్జునరావు

ధైర్యం, పట్టుదల ముందు పుట్టి వసంతసేన తర్వాత పుట్టింది. ఉడుంపట్టు. అనుకొన్నది సాధించందే నిద్రపోదు.

అయితే రూపసినని గర్వించటానికి అంద గత్తె కాదు. దర్జాలుపోయి అహం ప్రదర్శించ టానికి ఆమె సిరిసంపదలున్న యింట పుట్ట లేదు. తాతలనాటి గొప్పలు చెప్పుకొందామన్నా ఆమె కుటుంబానికి చరిత్రేలేదు.

ఆమెకున్న 'షెడ్యూలు కేస్టు' అన్న బిరు దొక్కటే ఉపయోగమైనది. కానీ దాన్ని వుపయోగించుకోటం ఆమె కిష్టంలేదు.

ఎలా పుట్టిందో ఏమో కానీ ఆమెకు హైస్కూల్లో చదువుకొనే రోజుల్లోనే డాక్టరు కావాలన్న కోరిక పుట్టింది. పట్టుదలగామారింది.

అయితే అంత చిన్న మనిషి అంత పెద్ద కోరికను ఎలా తీర్చుకొనేటట్లు? ఎన్నో అవరోధాలే!?

అన్నిటినీ అధిగమించింది. పట్టుదలకు, తెలివితేటల్ని జోడుచేసి రాణించింది. మెడి సన్‌లో చేరింది.

మూడో సంవత్సరములో వుండగా ఆమె ప్రొఫెసర్ దృష్టిలో పడింది. ప్రొఫెసర్ దత్ పవహారణాల ఆంధ్రుడు. పూర్తిపేరు పురాణం వెంకటసుబ్రహ్మణ్య దత్తాత్రేయులు.

ఆంధ్రుడే అయినా దత్‌కు మెడికల్ రంగంలో అంతర్జాతీయ ప్రఖ్యాతి వుంది. అద్భుతమైన మేధావి. పనికి వచ్చే స్టూడెంట్స్‌ను నిముషంలో స్పాటవుట్ చేయ గలడు. రోగాన్ని డయాగ్నైజ్ చేసినట్లే తన స్టూడెంట్సునూ డయాగ్నైజ్ చేసేయగలడు.

క్లాసులో ఆయన పాఠాన్ని వోసారి వింటే చాలు బుర్రకలా విషయం అతుక్కుపోతుంది. అయితే ఆయన 'మూడి'. మాంచి టెంపోలో పాఠం చెప్తూచెప్తూ అకస్మాత్తుగా ఆగిపోతాడు. ఉత్సాహంగా మాటలాడుతూ వున్నట్లుండి నిరాశా నిస్పృహల్లోకి జారిపోతాడు.

వసంతసేన వాళ్ళ క్లాసుకు పాఠం చెప్తూ చెప్తూ మధ్యలో ఆగి ప్రశ్న వేశాడు. అది ఆయన వాళ్ళకు తీసుకొంటున్న మొదటిక్లాసు. పైగా మూడీ ప్రొఫెసర్ అని పేరు. సమాధానం చెప్తే ఏమవుతుందో, చెప్పకపోతే ఏమవుతుందో?

తెల్సి కొందరు, తెలియక కొందరు మౌనం వహించారు.

వసంతసేన తక్కున లేచి సమాధానం చెప్పింది. 'గుడ్' అంటూ ప్రశ్న మీద మరో ప్రశ్న వేశాడు. దానికీ సమాధానం సరిగ్గానే చెప్పింది.

'యు ఆర్ ఎన్ ఇంటలిజెంట్ గర్ల్' అంటూనే కాస్సేపు ప్రొఫెసర్ ఆమెవైపు పరిశీలనగా చూశాడు. అకస్మాత్తుగా మూడ్ మారిపోయింది.

'డిడ్ యూ లౌ ఎనిబడీ?!' ప్రొఫెసర్ నుంచి యిలాంటి ప్రశ్న నాశించని వసంతసేన ముందు భయపడింది. తర్వాత బాధపడింది. క్లాసంతా టెన్షన్ అయింది.

'నువ్వు ఎవరినైనా ప్రేమించావా?'

వసంతసేనకు యిప్పటికి ధైర్యం వచ్చింది. కోపమూ వచ్చింది.

'యింకా నయం. ఎవరినైనా హత్య చేశావా అని అడిగేరు కాదు? పాఠానికీ మీ ప్రశ్నకూ ఏమిటి సంబంధం? తెల్సుకో గోరుతున్నా'

క్లాసంతా ఆమె ధైర్యానికి విస్తుపోయింది. 'అమ్మడూ యిక డిగ్రీ నీకు చేతికొచ్చినట్లే. ఇంటికెళ్ళి ధైర్యాన్ని తింటూ బతుకు తల్లీ' అనుకొన్నారు మనసుల్లో కొందరు.

ప్రొఫెసర్ దత్ మాట్లాడలేదు. కుర్చీలో కూలబడ్డాడు. మొహాన్ని చేతిలోకి దూర్చేశాడు.

ఒక్కడే కొడుకు అతనికి. అమిత తెలివి తేటలుగలవాడు. అక్షరాలా తనకు వారసుడు కావల్సినవాడు.

కాని అందగాడు కాదు. అద్దంలో తన రూపాన్ని ఎప్పుడూ చూచుకునే అలవాటు చేసుకొన్నాడు. చూచుకొనే కొద్దీ తను అనాకారినన్న భావన. బాధ! దిగులు!

ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్ పెరిగింది. 'అనాకారిత్వం వెనుక ఎంత తెలివితేటలుంటేనేం?' అన్న నిస్పృహ. కాస్తంత దోవ తప్పేడు.

అందాలవైపు, ఆకర్షణలవైపు మనసు మొగ్గింది. యుక్తాయుక్త విచక్షణ నశించింది.

అందచందాలకన్నా, తెలివితేటలు, వ్యక్తిత్వం విలువైనవి అని గ్రహింపచేయటానికి దత్ చేసిన ప్రయత్నాలన్నీ వృధా అయ్యాయి.

మెడిసన్‌లో చేర్చాలనుకొంటున్న సంవత్సరంలో—

ఓ అమ్మాయిని ప్రేమించాడు. కాదు. వ్యామోహించాడు. తనకన్నా పెద్దది. చాల అందంగా, ఆకర్షణీయంగా వుంటుంది. అయితే చిరునామాలేని మనిషి!

'నువ్వు ప్రేమించాననగానే సరే! నిన్ను నేను ప్రేమించవద్దూ? ఏం చూచి ప్రేమించమంటావ్?' గడుసుగా అంది.

చిన్నబుచ్చుకొన్నాడతను.

'పోనీ ఎలాగోలాగ నిన్ను ప్రేమిస్తాను. కానీ నీ ప్రేమకు చిహ్నం ఏమిటి?'

'ఏం కావాలో చెప్పు.'

'ధైర్యం, సాహసం కావాలి.'

'అంటే ఏం చెయాలి?'

'ప్రస్తుతానికి - మీ అమ్మ మెళ్ళోవున్న వజ్రాలహారం తీసుకొచ్చి యివ్వగలవా?'

వజ్రాలహారం! అది చాలా ఖరీదైనది!

తల్లికైతే — రూపాయల్తో కొలవలేనంత ఖరీదైనది. పెళ్ళినాడు తండ్రి యిచ్చిన అపూర్వమైన బహుమతి అది!

అయినా దొంగిలించాడు — తల్లి మెళ్ళో వజ్రాలహారం. ప్రేమకోసం కాదు. అందం కోసం. తనకు లేనిదాన్ని స్వంతం చేసుకొందామన్న తపనలో!

తన తల్లిమెళ్ళో వజ్రాలహారం వుందని ప్రేయసికెట్లా తెలిసిందా అన్న ఆలోచనైనా రాలేదు. విచక్షణను నశింపచేసే 'ఇంపల్స్'లో ఆ పని చేసేశాడు.

అంతే. ఆ పిల్లకు దగ్గరయ్యాడో లేదో తెలీదు. కానీ తల్లిదండ్రులకు దూరం అయ్యాడు.

పోలీసుల విచారణలో ఎన్నో కధలు—

ఆ పిల్ల గేంగ్ లీడరని-అతనూ స్మగ్లర్స్ గ్రూప్‌లో చేరాడని!



ఏమయితేనేం? ఎటుపోతేనేం? అతని ఆచూకీ తెలియలేదు. అతను తిరిగి రాలేదు. ఒక జీవితం వృధా అయింది.

తండ్రి ఆశ మంటకల్సింది. వారసుల్లేని జీవితం-ప్రాణంలేని జీవం!

ఎవరెవరి పిల్లల్నో విజ్ఞానవంతుల్ని చేయాల్సిందే! తన వాడిని మాత్రం చక్కదిద్దుకోలేక పోయాడు. నా వాడని చెప్పుకోటానికిప్పుడు ఎవరూ లేరు.

అందానికి తెలివితేటల్ని అంతగా ఆకర్షించి చంపే శక్తివుందా?

మేధావుల్ని సైతం పిచ్చి ఆకర్షణలు అంత మూఢుల్ని చేస్తాయి!

ఈ ఆలోచనలు వచ్చినప్పుడు ప్రొఫెసర్ దత్ బేలెన్స్ కోల్పోతాడు. పిచ్చి ఆలోచనలు వస్తాయి. అంతలోనే నిగ్రహించుకొంటాడు.

ఇప్పుడూ అలాగే చేశాడు.

'అయాం సారీ!' అంటూ చివాలున లేచి క్లాసువదిలి వెళ్ళేడు!

* * *

వసంతసేన థర్డు యియర్ పరీక్షలో తప్పుతుందనే అనుకొన్నారంతా. దానికి తోడు ఆ నాడు పరీక్షరోజు ఆమె శవాన్ని 'డిసెక్టు' చేస్తుండగా ప్రొఫెసర్ ప్రత్యేకించి వచ్చి పరిశీలించాడు కూడా!

'ప్రొఫెసర్ని నేనేం తప్పు అనలేదే! ఒక వేళ అన్నా, అంతమాత్రానికే పరీక్ష ఫెయిల్ చేసేటంత శిక్ష విధిస్తే అది నా దురదృష్టమే కాదు. మొత్తం విద్యావిధానానికే దురదృష్టం. మేధావుల్ని నేనంతతప్పుగా అంచనా వేయను. నా కర్తవ్యం నేను చేశాను. మంచి మార్కులతో డెఫినెట్‌గా పాస్ అవుతాననే నా అంచనా.'

ఆమె అంచనా తప్పుకాలేదు. వసంతసేన మంచి మార్కులతో పాసయింది.

కాని ప్రొఫెసర్ దత్తు మాత్రం ఆమెతో మాట్లాడలేదు. క్లాసులో ప్రశ్న అడగలేదు.

ఈలోగా ఆయని కొడుకు కథ అందరికి తెల్సిపోయింది. ఎవరో ఆ కొడుకు ఫోటో పట్టుకొచ్చారు కూడా. కొడుకు విషయంలో ఆయన పడుతున్న ఆవేదనని గురించి కథలు కథలుగా చెప్పుకొన్నారు. ఇంకా యిప్పటికీ కొడుకు వస్తాడని ఎదురుచూస్తూనే వుంటాట్ట!

వసంతసేన యివన్నీ తెల్సేక ప్రొఫెసర్ గారిని వొకసారి ఏకాంతంగా కల్సి క్షమాపణ చెప్పుకోవాలనుకొంది కూడా. కానీ ఆ అవకాశాన్నే కాదు—అసలు తనతో మాట్లాడే అవకాశాన్నే యివ్వలేదు ప్రొఫెసర్. విష్‌చేస్తే సన్నగా తల నాడ్‌చేస్తాడు. అంతే!

అలాగే కాలం గడిచిపోయింది. ఇన్నాళ్ళ కోరిక తీరేకాలం, కష్టాలు గట్టెక్కే కాలం దగ్గరికి సమీపించింది.

భవిష్యత్తుపై కొత్తకోరికలు - వూహలు ఆశలు-భయాలు!

డాక్టరుకోర్సు చదివినా వుద్యోగాలు చిక్కటం లేదు. ప్రైవేటు ప్రేక్టీసు పెట్టుకోటానికి అప్పటికే పేటకో డాక్టరు వెలిసేడు. ఇక పల్లెటూళ్ళకు వలసలు పోవాలి. లేకపోతే ఫారిన్ వెళ్ళే ఛాన్సు సంపాదించుకోవాలి.

ఇంత చదువు చదివి పల్లెలకు వెళ్ళి అక్కడ పాలిటిక్స్‌లో పడి నలిగే సాహసం కాని, 'దేశసేవ' పేరిట త్యాగాలుచేసే కోరిక కాని ఎవరికీ లేవు. ఒకరికి చెప్పాల్సిన కమ్మటి ఆదర్శపూర్వకమైన వూహ అది. ఆచరించేది కాదు.

అంచేత చాలామంది ఫారిన్ ఛాన్సులవేట ప్రారంభించారు. కొందరు 'యం.డి'లు, 'యమ్మెస్'లు చదివే ప్రణాళికలు వేస్తున్నారు.

ఫారిన్ పోవాలనుకొనేవాళ్ళు హౌస్ సర్జరీ కూడా అక్కడే చెయ్యొచ్చునన్న ఉద్దేశ్యంతో, ఛాన్సుకోసం ప్రొఫెసర్ దత్తును ఆశ్రయిస్తున్నారు. 'కాకా' పట్టటానికి ప్రయిత్నిస్తున్నారు. ఆయనకున్న పెద్దపెద్ద కాంటేక్ట్సు అందరికీ తెల్సు. ఆయన వొక్క లెటర్ రాస్తే ఏరోప్లేను ఎక్కేయొచ్చని అందరి ఆశ.

'పోట్లాడినా మార్కులు వేస్తున్నాడు గదపే వసంతా. మరోసారి పోట్లాడి చూడు. ఫారిన్ ఛాన్సు గూడా యిప్పిస్తాడేమో!' మిసెస్ చంద్రావతి వసంతను పొడిచింది.

మిసెస్ చంద్రావతి ప్రస్తుతం వసంతసేన క్లాసుమేటు. కాని వసంతసేన యస్సెల్సీ చదివేరోజుల్లోనే ఆమె మెడిసిన్‌లో చేరింది. ఒకొక్క సంవత్సరాన్ని రెండుచేత, మూడుచేత గుణించుకొంటూ యిప్పటికి అక్కడికి చేరింది. ఈలోగా పెళ్ళయింది. పిల్లలుకూడా పుట్టేరు. పెద్దవాళ్ళవుతున్నారు. ప్రొఫెసర్‌కి ఎందరి చేతనో రెకమెండేషన్ చేయించింది. ఊహూ! అందుకే ప్రొఫెసర్ అంటే ఆమెకు మంట? తప్పకుండా పాసయ్యేవాళ్ళంటే ఆమెకు అంతకన్నా మంట!

'ఒకరు నాకు మార్కులు వేసేదేమిటి? నేను స్వశక్తితో, స్వయంప్రతిభతో సంపాదించుకొంటున్నా. అలాగే అర్హత వుంటే రెకమెండేషన్ లేకుండానే ఫారిన్‌ఛాన్సు వస్తుంది. నామీద నాకు ఆత్మవిశ్వాసం లేకపోతే కదా? వొకరిని ఆశ్రయించాల్సింది? కాకా పట్టేఖర్మ నాకేంటి?,

మిసెస్ చంద్రావతి నోరు మూతపడింది.

కాని ఎలా తెల్సిందో యీ విషయం ప్రొఫెసర్‌కి తెల్సింది.

'ఏరొగెన్సీ హేజ్ లిమిట్స్. అహంభావానికి కూడా హద్దులుంటాయి. అందమో, తెలివితేటలో తమకున్నాయని యితరులని కించపర్చటం, చులకనచేయటం-డాక్టరు వృత్తిలో చేరబోయే వాళ్ళకు తగని లక్షణం. ఐ డోంట్ లైక్ సచ్ స్టూడెంట్స్ టు బికమ్ డాక్టర్స్. అలాంటి వాళ్ళు డాక్టరు కాకపోతే సమాజానికి మంచిది. నేను సంతోషిస్తా.'

ఏదో సందర్భంలో క్లాస్‌లోనే అన్నాడు. ఆ మాటలు వసంతసేన నుద్దేశించి అన్నవనే అంతా అనుకొన్నారు. కానీ వసంతసేన గుమ్మడికాయ దొంగలా బుజాలు తడుముకోలేదు.

'నన్నేనని నే నెందు కనుకోవాలి? నాకు అహంభావం లేదు. ఆత్మ విశ్వాసం, గౌరవం




మాత్రమే వున్నాయి. ప్రొఫెసర్ చెప్పిన అహంభావులు, క్రూక్స్ చాలామంది వున్నారు క్లాసులో.'

*    *    *

ఫైనల్ యియర్ పరీక్షలు వస్తున్నాయి. సర్జరీ పరీక్షకు ముందు—

ఆపరేటివ్ సర్జరీ డెమోన్‌స్ట్రేషన్ చేయమన్నారు.

మార్చ్యుయరీ నుంచి శవాలు వచ్చాయి.

వవంతసేన తనకిచ్చిన శవం అబ్డామిన్ వోపెన్ చేస్తోంది.

దిక్కుతెలియని శవం కడుపులో వజ్రం!

పరీక్షగా శవం మొహంవైపు చూచింది.

ప్రొఫెసర్ దత్ కొడుకు ఫోటో గుర్తు కొచ్చింది. మొహాన అసహ్యమైన గంటు. పొట్టి ముక్కు. పైకి పొడుచుకొచ్చిన పళ్ళు.

సందేహం లేదు. ఆ శవం ప్రొఫెసర్ కొడుకుదే.

ఆమె మనస్సు, బుద్ధి చురుగ్గా పనిచేశాయి.

వొక్కగా నొక్క కొడుకును పోగొట్టుకొని, ఏకాంతంగా, మౌనంగా ఏడుస్తున్న ప్రొఫెసర్ దత్ రూపం కళ్ళముందు మెదిలింది.

ఢిల్లీ సుల్తానుల్లో వొకడైన బాల్బన్ కల గుర్తుకొచ్చింది.

పిడికెడు గుండెల్లో, గంపెడు మనోవ్యధను కుక్కి మూతపెట్టి అణచివేసి పైకి నిబ్బరంగా కన్పించే ప్రొఫెసర్—

దిక్కులేని స్థితిలో చచ్చిన కొడుకు శవం - తన విద్యార్థుల పరీక్షా వస్తువుగా వచ్చిందని తెలిస్తే—?

ఆ శవంలోని లోపల భాగాలను, అంగాంగాలను తన విద్యార్థులు సరిగా గుర్తించగలరా? లేదా? —అని తనే పరిశీలించాల్సి వస్తే....?

ప్రొఫెసర్ దత్తు స్థితిని వూహించలేక పోయింది!

అమెను తల్లి 'ఇంస్టింక్ట్' ఆవహించిందో క్షణం! ప్రొఫెసర్ దత్ పిల్లాడిలా కన్పించాడు.

అంతలోనే తన కోరిక—కర్తవ్యం—

ఆపరేటివ్ సర్జరీ చెడగొడ్తే పరీక్ష ఫెయిల్ చేసే వీలులేక పోవచ్చు. కాని అసలే ఆయనకు తనపై మంచి ఇంప్రెషన్ లేదు.

తను చేసిన పనిని చూచి కోపగిస్తే? చిరాకు పడితే?

ఆ దిగుల్లో, కోపంలో, తను సర్జరీ పరీక్షలో

ఫెయిల్ అయితే?

ఏమైనా ఆలోచించే వ్యవధిలేదు. ఏ క్షణంలోనైనా ప్రొఫెసర్ చెక్ చేయటానికి రావచ్చు.

వసంతసేనలోని స్త్రీ "ఇన్‌స్టింక్ట్" గెలిచింది. ఆమె వో నిశ్చయానికొచ్చింది.

శవం కడుపును చింపరవందరంగా కుట్టేసింది. కుట్లతోనే మొహాన్ని పోల్చలేనంతగా మార్చివేసింది. శరీరశాస్త్రరీత్యా, మెడికల్ పద్ధతుల ప్రకారం అన్నీ తప్పులే. అంతా అకటా వికటమే!

కానీ మానవతా దృష్ట్యా....?

ప్రొఫెసర్ రానే వచ్చాడు. ఒంటరిగాకాదు- మరికొంతమంది స్టాఫ్‌తో—

వసంత సేన చేసిన పనిని చూచాడు. శవాన్ని వో క్షణం పరిశీలించాడు. వసంతసేనకు పిచ్చెక్కిందనుకొన్నారు మిగతా డాక్టర్లు.

'వాట్ యీజ్ దిస్ నాన్సెన్స్?'

చిరాగ్గా కోపంగా అన్నాడు ప్రొఫెసర్.

'అయాం సారీసార్. నేర్చుకొన్న అనాటమీ అంతా మర్చిపోయాను. మనుష్యుల కడుపుల్ని, గుండెల్ని కోయలేను. ఎవరైనా కోస్తే అతికించగలనేమో ప్రయత్నిస్తాను. నన్ను ఫెయిల్ చేయండి ఫర్వాలేదు.'

'సందేహం లేదు వసంతసేనకు మతిపోయింది.'

లేబ్‌నుంచి పరిగెత్తి పారిపోతున్న ఆమెను చూచి అంతా అనుకొన్నారు!

ర ర ర

అంతవరకూ పాటల్తో, పరిహాసాల్తో, బాత్‌రూం కూనిరాగాలతో మోగిపోతున్న ఆడపిల్లల హాస్టలు వొక్కసారి పంక్చర్ పడ్డ ట్యూబ్‌లా గయింది.

'ఉప్పు' అన్ని గదులకు అందిపోయింది. ప్రొఫెసర్ వస్తున్నాడు!

పిల్లల్లా రూముల్లో నక్కి చూస్తున్నారు కొందరు. మరికొందరు తలుపులు తెరిచిపెట్టి పుస్తకాలువేసుకొని బల్లముందుకూర్చున్నారు.

'అంత ప్రొద్దున్నే హాస్టలుకెందుకు విచ్చేస్తున్నట్లో—మహాచక్రవర్తులవారు?'

'యింకెందుకు? వసంతసేనను దేశ బహి

స్మరణ చేయటానికే.'

'బ్రష్ అనుకొని పెద్దపులి మీసాలతో ఆడు కొన్న ఏమగును?'

'కండోలెన్సు మీటింగుకు కారణంబగును.'

'హుశ్....'

వసంతసేన కిదేం తెలియదు. నిన్నటి సంఘటన తర్వాత ఆమె బుర్ర ఖాళీ అయి పోయింది. అప్పుడు మూసిన తలుపు యింత వరకు తెరవలేదు.

'అమ్మా వసంతసేనా.'

పాత కంఠం, కొత్త పిలుపు. వులిక్కిపడి లేచింది.

ప్రొఫెసర్ దత్ లోపలికొచ్చాడు. వెంట వచ్చిన పరివారం వాకిట్లోనే దిగబడిపోయారు. కూర్చోమనకుండానే కుర్చీలో కూర్చున్నాడు. తలుపులు బార్లాగా తెరచే వున్నాయి.

'యిప్పుడే లేస్తున్నావామ్మా? అంతలోనే వాడిపోయావు? నిన్నటి సంఘటన నిన్ను బాగా కదిలించివేసి వుంటుందికదూ?'

తుఫానుకు ముందు శాంతతకాదుకదా!?

"గుండెలు కోయటం, కడుపులు చీల్చటం కూడా డాక్టర్లు మానవతా దృష్టితోనే చేస్తారమ్మా. అది వృత్తిధర్మం. కానీ, నిన్న నువ్వు చేసిన ప్రయోగం అంతకన్నా విలువైనది. చిట్లిన గుండెకాయను పూర్తిగా పగిలిపోకుండా చేయటానికి ప్రయత్నించావు. కానీ, ఆ ప్రయత్నంలో నీ నేర్పువల్ల పోటుపోయిన గుండెను అతికించావ్! గొప్ప డాక్టరు వవుతావని నిరూపించుకొన్నావ్."

'డాక్టర్. '

'నో. ఎ ఫాదర్. యిప్పుడు నీ ముందు నిల్చున్నది వొక తండ్రి. కొడుకును పోగొట్టు కొన్న వొక తండ్రి.'

వసంతసేన ఏం మాట్లాడగలదు?

'శవాన్ని చూస్తునే నా కొడుకును పోల్చు కొన్నాను. చచ్చిపోయాడే అని మనసు ఏడవ బోయింది. కాని నీ సమాధానం విన్నాక తెల్సింది డాటర్—నా కొడుకు నేనూహించి నట్లు నీ రూపంలో ప్రత్యక్ష్యమయ్యాడని! ఇంత పెద్ద ప్రొఫెసర్‌కు యింత స్వల్ప అల్ప సెంటిమెంటేమిటనుకొంటే అనుకో. ఎవరైనా అనుకోనీ. కానీ ఇది నిజం. చిన్న పిల్లవైనా ఎంత ఔదార్యాన్ని చూపేవమ్మా? ఎంత త్యాగాన్ని ప్రదర్శించావు? నౌ...యు ఆర్ మై సన్—డాటర్—ఎవ్వెరీ థింగ్. నువ్వు అవు నను, కాదను. నా భావన అంతే—'

యిదంతా వింటూ, చూస్తున్నవాళ్ళకి, అది కలో, నిజమో, తెలుగు సినిమానో తెలియక మతులు పోయాయి! □

## 'శద్దినోత్సవం'



మొదటిసారిగా తెలుగుసినిమా తీసిన ఓ పల్లెటూరి ఆసామీ మద్రాసులోని పాండీ బజారులో కార్లోవస్తూ తన చిత్రంలో నటించిన హీరోయిన్ని రోడ్డుమీద చూసి, ఒక్క గావు కేకతో కారాపి-ఆ పిల్లని బంగారుగా కార్లో ఎక్కించుకుని, ఇంటిదగ్గర దింపేసి "నా చిత్రం వందరోజుల పండుగ జరుపుకునేంతవరకు నువ్వు ఇంట్లోంచి కదలొద్దు" అన్నాడు అర్థింపుగా.

"అదేమిటి!?" అని ఆశ్చర్యపోయింది కొశ్చన్‌మార్క్ మొహంతో ఆ హీరోయిన్ పిల్ల.

"నువ్వు ఆఖరిసీనులో చచ్చిపోయావు గదా నువ్విలా రోడ్డుమీద తిరుగుతూంటే జనం నిన్ను చూసి నువ్వు చచ్చిపోలేదని నా చిత్రం చూడ్డం మానేస్తారు" అన్నాడు బావురుమంటూ.

—నాని

# నత్తివాడి కథ

మెడికో శ్యామ్

ఒక్కణ్ణీకూచుని ఆలోచించడం నా కలవాటయి పోయింది. 'ఏంటి ఆలోచిస్తున్నావూ?' అంటే 'ఇదీ' అని చెప్పలేను. ఏదో యోచన.

ఒంటరితనం జీవితంలో వెళిపోయిన వెన్నెల పీడలేగాని పడుతున్న వెన్నెల సోనలులేవు.

మరిచిపోవల్సిన జ్ఞాపకాలు, దాటిపోయిన మలుపులు, ఎక్కడో ఎప్పుడో ఎగిసిన గాలి పటం ..సినిమాల్లో స్టిల్ చిత్రాల్లా నా జ్ఞాపకాలు.

చాలా జ్ఞాపకాలు నావి తీపివి కావు.

పిల్లిని నాలుగువైపులా కార్నర్ చేస్తే... కళ్ళు పీకేంత వైల్డ్‌గా అవుతుందంటారు. కాని బిక్కచచ్చిపోవొచ్చు కూడ పిల్లిపిల్ల అయితే.

బిక్కచచ్చిన పిల్లిపిల్ల మ్యావ్ మ్యావ్ మనదా? ఆ మ్యావ్ మ్యావ్‌లో ఆ పర్రింగ్‌లో ఏదన్నా తేడా వుంటుందా వుండదా?

పర్రింగ్ కేట్‌ని పట్టుకుంటే వుండే థ్రిల్?

పాలుతాగే పిల్లుల్ని వర్ణించిన కవులు బిక్కచచ్చిన పిల్లిపిల్లని వర్ణించరేం?

ఓ చీమని తీసుకోండి దాని చుట్టూ నీటితో ఓ గడి కట్టండి. అది చూసిన చోటినే చూసి చూసి, తిరిగిన దారినే తిరిగి తిరిగి అలసి పోతుంది. దాని బుర్రలో, బ్రెయిన్‌లో ఆ వేదన ఆవేశం ఆలోచించితే—

చీమకి బుర్రేమిటి? బ్రెయినేమిటి? అనకండి. ఇన్‌సెక్ట్‌కి బ్రెయిన్ చాలా పెద్దదట శరీరంతో పోల్చి చూస్తే—

ఆ వేదనతో ఆవేశంతో అలసి సొలసిన చీమ బిక్క చచ్చిపోదా?

చీమకి భాష వస్తే, పిల్లికి మాటలు వస్తే అవికూడా నాలాగే నత్తిగా తయారయేవేమో!?

నాకు చిన్నపుడు మాటలు వేగం రాలేదుట. 'అమ్మ, అత్త, తాత' అని అందర్లాగానే మామూలుగానే మామూలు వయసుకే అన్నానుట గానీ ఆ తరువాత చాలా మాటలు పలకలేక పోయేవాణ్నట. అదేమో నాకు తెలీదు. గాని చిన్నపుడు నాతో మాట్లాడడానికెవరూ వుండేవారు గాదు. ఇంట్లోంచి కదిలేవాణ్ని గాదు. ఇప్పుడాలోచిస్తే....హోదా అనో మరేదో అనో మా ఇంటి పక్కవాళ్ళ నానిగాడితో ఆడనిచ్చేవారు గాదు. వాడొక్కడే ఆ ప్రాంతంలో నా వయసువాడు.

ఎంతసేపని బొమ్మలతో ఆడుతాం?

మా అమ్మ బొమ్మలా వుండేది అందంగా. అలా అనుకునేవాణ్ని ఆ రోజుల్లో. ఇప్పుడాలోచిస్తే నిజంగా బొమ్మ అన్పిస్తోంది. అందాల బొమ్మ. అపరంజి బొమ్మేకాదు. మరబొమ్మ.

మా నాన్నలాంటి వాళ్ళ దృష్టిలో ఆడవాళ్ళు మరబొమ్మలే కాదు. కీలుబొమ్మలుకూడ.

నాకు ఏమీ తెలీని ఆ వయసులో, ఓ నిశ్శబ్ద వాతావరణంలో ఏదో తెలీని ఇమ్మినెంట్ డెత్ ముందున్నట్టు గడిచేది కాలం మా ఇంట్లో—

—భయం భయంగా చిరాకు చిరాకుగా కొట్టుకునేది గడియారం.

మా నాన్న మనసు ఎపుడూ సరిగా వుండేది కాదు. దుస్తులూ, జుత్తూ ఏవీ సరిగా వుండేవి కాదు రాత్రులు.

వుదయాన్నే శుభ్రంగ బయలుదేరిన వ్యక్తి అస్తవ్యస్తంగా ఎందుకు వచ్చేవాడో తనకా రోజుల్లో అర్థం అయేదికాదు.

అమ్మ కళ్ళలో స్వచ్ఛమైన నీరు సుడి తిరిగినా ఎపుడూ బయటికి వచ్చేదికాదు.

ఎక్వేరియం గోడల్లోంచి లోపలికి చూసినట్టుండేది అమ్మ కళ్ళలోకి చూస్తే.

'నా కళ్ళల్లో నీరే నిండేక నిద్రకి చోటేది?' అని పాట పాడినట్టు అమ్మ ఎపుడూ నిద్రపోయేది కాదు.

నిద్ర లేకుండా కూడా అంత అందంగా వుండే కళ్ళని చూడలేదు నేను మళ్ళీ.

మళ్ళీ చూడలేదా? చూడలేదా? చూసేనా?—

నాకు నాలుగయిదేళ్ళు వచ్చి స్కూలుకి వెళ్ళే రోజుల్లో కొంచం కొంచం నత్తిగా మాట్లాడేవాణ్ని బెక్కుతూ. మొదట్లో కొంత మంది ముద్దుముద్దుగా మళ్ళీ మాట్లాడించి ఆనందించేవాళ్ళు నా మాటల్ని... ముద్దు పెట్టుకుని మరీ. అదే జీవితంలో మాటలవల్ల నేను పొందిన మెప్పయినా....ఏదైనా....

అందమైన అమ్మ, స్వచ్ఛమైన కళ్ళనీళ్ళు గల అమ్మ నాతో మాట్లాడ్డం చాలా తక్కువ. మాట్లాడినా, మాటల్లో తిట్లూ దీవెనలే ఎక్కువ. నాకు చాలాసార్లు తిన్న దెబ్బల చురుకుదనమే గుర్తు.

అసహనం, అసహాయత ఆమె రెండు చేతులు.

అసహనంతో నన్ను కొట్టేది.

అసహాయతతో మొహం కప్పుకునేది.

నేను అల్లరి చేసేవాణ్నట. ప్రతీదానికీ ఏడుపూ, గొడవా....పేచీ... పెట్టేవాణ్నట.... స్నానం చేయడం దగ్గర్నుంచీ భోజనంవరకూ. నేను ఆ ఇంటిలోకి రాకముందూ, వచ్చేకా, ఏ పరిస్థితులు వాళ్ళనా ప్రవర్తనకు ఉసిగొలిపేయో నాకు తెలీదు... అప్పటికీ ఇప్పటికీ కూడ.

రెండో, మూడో క్లాసు చదివే వేళకి నావి ముద్దుమాటలు కావనీ, నత్తిమాటలనీ స్థిర పడింది.

స్కూల్లో తనని నత్తి అని ఎవడో అన్నాడని వాణ్ని కొట్టి రెట్టింపు దెబ్బలు తిన్నాడు - స్కూల్లోనీ—ఇంట్లోనీ.

కాని వాడికి నెత్తురొచ్చింది. తనకి కన్నీళ్లు. అంతే తేడా. అది అందరికీ కన్పిస్తుంది. ఇది కన్పించదు.

అది ఒకసారా? రెండుసార్లా??

ఆదేవాడు కాదు. స్కూల్లోనీ. బయటా. మరీ ఒంటరిగా గడపవల్సి వచ్చేది.

ఆడ్డానికిగాని ఆట చూడ్డానికి గాని వెళ్తే— ఎవడో ఒకడు న....న.. న....అనో మ.... మ....మ....అనో అనడం—వూరుకున్నా బాధ పడ్డం, ఊర్కోపోయినా బాధపడ్డం అలవాటయింది.

అందుకేఆటపాటలకి స్టాప్‌పెట్టేడుఅందర్తో.

ఒంటరిగా, ఏంతోచక, ఏం చేయాలో తెలీక, ఏమీ చెయ్యలేక వున్నపుడు ఓరోజు జ్ఞాన నేత్రం తెరుచుకుంది. కాదు తెరవబడింది.

'మానవుడి మంచి నేస్తం పుస్తకం' అన్న మాటల్తో.

'పుస్తకాలు లేని ఇల్లు కిటికీలు లేని గది వంటిది.'

'మస్తకాలకు బూజుపడితే పుస్తకాలే దుల పాలి.'

'పుస్తకాలు కొన్ని కొరకమన్నారు. కొన్ని నమలమన్నారు. కొన్ని కొరికి నమిలి మింగి జీర్ణమంగే అని సుభాషితం.'

అతనెవరో చెప్పినవిషయం బాగా పట్టింది.

'పుస్తకాల్లో మంచివీ చెడ్డవీ లేవ'ని కూడా అతను అన్నాడు.

'మనసు బాగాలేనపుడు మనకు గిలిగింతలు పెట్టగలవికూడా పుస్తకాలే' అన్నాడు.

'ఒక్కొక్క పుస్తకం ఒక జీవితం. దాని అనుభవాలూ' అన్నాడు.

'ఒక్కొక్క మానవ జీవితం సగం తెరిచిన పుస్తకమ'న్నాడు.

"దాంట్లో తెరచిన పేజీలు కాకుండా తెరవని పేజీలు చదవటానికి అనుభవం, తెలివితేటలూ కావాలి. జీవితం తెలియాలి."

'ఒక జీవితం ద్వారా తెలుసుకునే విషయాలు ముందుగానే పుస్తకంద్వారా తెలుసుకోవచ్చు' అన్నాడు.

అప్పట్లో ఆ మాటలు తనకి అర్థంకాలేదు. మాటలు గుర్తున్నయ్ అంతే.

పిల్లలయినా 'చందమామే' కాకుండా అన్ని పుస్తకాలూ, డిటెక్టివ్ పుస్తకాలూ చదవ్వచ్చు అన్న మొదటి పెద్దమనిషి ఆయనే!

కంటపడిన ప్రతీ పుస్తకం చదివాను. కన పడిన ప్రతీ వాక్యం చదివాను.

పకోడీ పొట్లాల కాగితాలమీద రాసిన రాతలూ చదివాను.

ఎక్కడబెడితే అక్కడ విసిరివేయబడి వుంది సాహిత్యం అని గ్రహించాను.

'మంచి సాహిత్యం దొరకదు' 'వుత్తమ

సాహిత్యం అరుదు' 'గ్రేట్ రచనలు మృగ్యం' వంటి వాక్యాలు అంత—అంత ఏమిటి?— ఎంత మాత్రం సత్యం కాదని గ్రహించాను.

నీకు చూడాలని వుండాలేగాని ఎక్కడ చూస్తే అక్కడ కన్పిస్తుంది వుత్తమ రచన.

మనం గ్రహించడంలో వుంది.

అసలీ చెత్త సాహిత్యం ఒక పారామీటరు అమ్మాయిల జడల్లా—

రేడియోలో విన్నాను. కథలూ....కవిత్వం పాటలూ, గీతాలూ....సంగీత రూపకాలూ....

ఎన్ని విన్నా, చదివినా, తెలిసిన విషయం ఒకటే. మానవతా విలువలున్నవి, మానవుడి భావాలను మానసిక సంఘర్షణలనూ వుద్వేగాలనూ స్పృశించేవన్నీ వుత్తమమయినవే. వుదాత్తమయినవే....

జీవితంలో వున్న డ్రామా, విషాదం నామ మాత్రంగానైనా ఈ రచనలు స్పృశిస్తున్నాయా?

ఆలోచన తెగలేదు.

ప్రతీ గొప్ప పుస్తకం ఒక సత్యాన్ని తెలిపింది. ఏక నీతిని తెలిపింది.

ఒంగడం, ఒదగడం ముఖ్యమైన ఘోరాలనీ నేరాలనీ ప్రతీచోటా రాశారు.

'జీవితాన్ని తప్పొప్పుల పట్టిక' అన్నారు.

'చేసిన తప్పు చెయ్యకుండా తప్పు చెయ్యడమే జీవితం' అన్నారు.

లంచం, కట్నం, అబద్ధం, స్వార్థం, క్రూరత్వం, అసభ్యం, అసహ్యం, అన్యాయం, నీచం, లోభం, కక్కుర్తి....ఇదేమిటి? అదేమిటి ఎన్నో కూడదన్నారు.

కొన్ని కూడదన్నారు.

కొన్ని కూడదనకుండానే కూడదనిపించింది నా అంతరాత్మకి.

ఇదేమిటో కొత్తపదం నా ఆలోచనలోనికి వూహల్లోనికి ప్రవేశించింది దానంతట అదే—

ఎలా వచ్చింది?

ఏమో తెలీదు.

ఇవన్నీ నా ఊహల్లో స్థిరపడేసరికి నేను పదిహేనేళ్ళు ఎదిగాను అరుమీద.

ఎన్ని పుస్తకాలు చదివాను?

ఏం చదివాను?

లెక్క తెలీదు. గుర్తులేదు.

రేడియో వినడంద్వారా ఒకటి తెలిసింది.

ప్రతీ భాషకీ సొగసైన పదాలు వుంటాయి. వాటిని పలకడంలో షోకు వుంది. అందం వుంది. ఒక పదాన్ని రిప్లేస్ చేసే పదం ఆ భాషలోగాని మరో భాషలోగాని వుండదు.

ఒక వాక్యం ఎక్కడ విన్నానో చదివానో గుర్తులేదు. అది ఇదీ: "మన రేడియోలోగాని TV పైగాని విన్నపుడు సాధారణంగా ఏం చెబుతున్నారని వింటాంగాని, ఏం చెబుతున్నారో మానేసి ఆ శబ్దాల్ని వినండి పలకడానికి" అని.

అలా కొన్నాళ్ళకి ఒకటి తెలిసింది—

ఎంతమంది మనుషులు ఎన్ని పదాలు ఎన్నిసార్లు విన్నా ఎలా పలకలేకపోతున్నారు!!

నాకు తెలిసినా పలకలేను.

వాళ్ళకి తెలీక పలకలేరు.

ఒక పదాన్ని పలకవలసినట్టు పలకలేకపోవడం నత్తేనా కాదా?

గుర్తించని నత్తిగావచ్చు గాని నత్తి నత్తే.

నాలో ఏ లోపం ఈ నత్తికి కారణం?

వాళ్ళలో ఏ లోపం ఆ నత్తికి కారణం?

పుస్తకాల్లో చదువుతున్నారు.

స్టేజిలమీద పలుకుతున్నారు.

'గీత'లు చేతిలోధరించి మనుషులు కళ్ళద్దాలు సవరించుతున్నారు.

ఏం చెబుతున్నారు?

ఏం చేస్తున్నారు?

చరించవల్సినట్టు చరించలేకపోవడం నత్తి



కాదా?

ఏ అశక్తత నాచేత పదాల్ని పలికించలేక పోతోంది!

ఏ అశక్తత నా చేత ఇతరుల్ని దిద్దించలేక పోతోంది?

. రోడ్లు తిన్నగానే వుండవని విన్నాను. కాని మలుపులో ప్లాన్డ్‌గా వుండవు.

కాని పేర్లు మాత్రం సరళంగా, రేఖాత్మకంగా వుంటాయి.

సరళతో ఎలా పరిచయం అయిందో నాకు గుర్తులేదు.

కానీ బాగా పెరగడం గుర్తు.

జీవితంలో అంత అందమైన కళ్ళని నేను చూడ్డం రెండవసారి.

ఆమెపేరు మిస్ చిరునవ్వు అనుకున్నాను.

ఆమె ఎడ్రస్ కేర్ హాపినెస్ అనుకున్నాను.

ఆమె గమ్యం నేనే. .

'నా సుఖాలన్నీ నీవే నీ కష్టాలన్నీ నావే నువ్వు బతుకు నేనూ బతుకుతా' అని మృదు మధురంగా పాడినట్టు అన్పించింది నా హృదయానికి.

చెవులతో వింటే హృదయంలో ధ్వనించడం అంటే ఇదేనా?

'నీ నీలికురుల నీడలలో సాయంత్రాలు చూసుకుంటా' అని పాడుకున్నాను ఒంటరిగా.

'నీలో వున్నదేదో నీ పోటోలో లేదు' అనీ

'వరించవూ సవరించవూ వసంతం నా జీవితాన్ని' అని గెంతేతేను ఒంటరిగా సాయం సంధ్యకాంతుల వెలుగు నీడల.

ఊహలు నింపిన కాగితం చిరిగిపోయింది.

చేదుజ్ఞాపకాల డైరీలో మరో కాగితం పెరిగిపోయింది.

మళ్ళీ కారణం.

దారుణం.

ఏమిటి?

అదే——

ఏమిటి?

న....న... న...

మనసుకి వుంటే కాని లోపం ...

జీవితంలో వుంటే కాని లోపం....

కట్టుబడని మాటకి వుండే లోపం....

నోటిమాటకి వున్న లోపం లోపమా?

ఉన్నవన్నీ లేనట్టేనా!! లేని ఒక్కటీ వున్నట్టేనా!!

ఎన్ని రాత్రులు ఆలోచించినా——

ఎన్ని పేజీలు చించినా——

ఎన్ని తేదీలు గడిచినా——

మిగిలేది ఒక్కటే. ఒక్కటే. ఒక్క కన్నీటి చుక్క.. దాని ఖరీదు గట్టే షరాబున్నాడా?

అమిత వేదన. విడుదల చేసే కన్నీటిబొట్టు కాన్సెంట్రేషన్ కనుక్కున్నాడా ఏ సైంటిస్ట్ అయినా?

తిరుగు మరో మలుపు....

పెంచుకో విజ్ఞానం....

ఎదుగు మనిషిగా....

న్యాయంగా...

సత్యంగా....

సభ్యంగా. ..

నిస్వార్థంగా....

. . గా

. గా

.. గా....

ప్రతీ ఒక్క 'గా' నిన్ను దెబ్బతీస్తుంది.

పచ్చడి చేస్తుంది.

నంజుకుంటుంది.

నన్ను నత్తివాణ్ణిచేస్తుంది మానసికంగా....

మంచికీ చెడుకీ తేడా తెలీదు.

ఏదిచేయాలో తెలీదు.

ఏం చేయకూడదో తెలీదు.

దానికంటే నా నత్తే నయం.

బెంగుళూరు వెళ్ళి నయం చేసుకుంటా.

కాని ఈ నత్తికి విరుగుడేమిటి?

విజ్ఞానం కలిగించే, విజ్ఞానం తెచ్చియిచ్చే ఈ 'హేండీకేప్'కి క్యూరేమిటి?

ఈ వంకర నడకకి

ఈ నత్తి పలుక్కి

అంతం ఎక్కడ——?

షో మీ !

# ది డ్రీమ్ కంఠంనేని రాధాకృష్ణమూర్తి

## 1

గోడకానుకుని కూర్చుని బీడీలు చుడుతున్న నాగుమణి క్షణంపాటు తన పనినాపేసి ఇవతలకు జరిగి వొళ్ళు విరుచుకుంది. ఆమె కెదురుగా వున్న చేటలో తంబాకు (పొగాకు పొడుం) ప్రక్కనే వున్న గుల్ల (చిన్న బుట్ట)లో కట్టలు కట్టిన బీడీలూ వున్నాయి.

అంతవరకూ తను చేసిన బీడీ కట్టల్ని ఒకసారి లెక్కపెట్టిందామె. యాభయ్యారు కట్టలు. అంటే పద్నాలుగు వందల బీడీలు. క్రితంనాడు నడిరేయివరకూ చేసింది కాక ఇవాళ ఉదయాన్నుంచీ వంచిన తల ఎత్తకుండా కూర్చుని చేస్తే ఆ బీడీలు తయారాయి. అంతకు కొద్ది క్షణాల ముందే ఆమెతోపాటు కూర్చుని చేసిన రాజ్యం, నర్సమ్మ, కమలలు కార్ఖానాకు వెళ్ళిపోయారు తలా వెయ్యి చేసుకుని. అదృష్టవంతులు వాళ్ళు! ఆ వెయ్యికూడా చేయకపోయినా ఫరవాలేదు వాళ్ళకు. మొగుళ్ళ సంపాదన మస్తుగా సరిపోతుంది ఇళ్ళు గడవటానికి. కాని తనకట్లా కాదు. రోజుకు తప్పనిసరిగా వెయ్యిన్నర బీడీలయినా చెయ్యాలి. ఏకుపన్నర వస్తుంది. దాన్తో తన ఇల్లు గడవటమే కాక భర్త త్రాగుడుకూడా నడవాలి. .

తలెత్తి పరిసరాల్ని గమనించిందామె. చీకటి పడబోతోంది. కార్ఖానా కట్టేస్తారిక. మిగతా వంద బీడీలుకూడా చేస్తే కార్ఖానాకు తీసుకుపోవచ్చు. ఆత్రంగా తలవంచి ఆమె మళ్ళీ తన పనిలో నిమగ్నమయింది. ఆమె చేతివ్రేళ్ళు చప్పుచప్పున కదలసాగాయి. తంబాకుని ఆకుమీద పరవటము, ఆకును చప్పున చుట్టేయటము, చూపుడువేలితో పైవేపుకొనను మడతల్లో మూసివేయడమూ, క్రిందివేపు కొనను దగ్గరకు నొక్కి దారంతో బిగించటమూ. అంతా చక చకా సాగిపోతోంది....

## 2

"నాగుమణీ!"

పొయ్యిముందు కూర్చుని మండని కట్టెలతో కుస్తీపడుతున్న నాగుమణి తృళ్ళిపడుతూ వెనక్కి తిరిగి చూసింది.

వాకిటి ముందు మురళి. స్నానానికి పోతున్నట్లున్నాడు. లుంగీ, భుజాల చుట్టూ టవల్, చేతిలో సబ్బుపెట్టెతో నిలబడి వున్నాడు. అతను బాత్‌రూముకు పోవాలంటే నాగుమణి వాళ్ళుంటున్న చిన్న గది ముందునుంచిపోవాలి.

చప్పన లేచి నిలబడింది నాగుమణి. గది నిండా నిండివున్న పొగలో ఆమె స్పష్టాస్పష్టంగా కనిపిస్తోంది బయటికి.

"ఆ పొగలో ఏమి బాధపడతావు బయటికి రారాదు నాగుమణీ!"

అతని స్వరంలో ధ్వనించిన దిగులుకు చలించిందామె. గబగబా బయటికి వచ్చి గుమ్మం పక్క గోడ నానుకుని నిలబడింది.

"మీకు నేనంటే ఎందుకంత జాలి? మీకు నేనేమవుతానని?" అన్నది ఆర్ద్రంగా.

"ఇప్పుడు నాకేమీ కావు నాగుమణీ, కాని ముందు ముందు నువ్వు నాకేదో కావాలని ఆశ!"

అతని వొంటిమీది టవల్ జారింది. క్షణం పాటు కన్పించిన అతని ఎఱ్ఱటి ఆకర్షణీయమైన దేహంవేపు తన పెద్ద కళ్ళతో చూసి వెంటనే చూపు మరల్చుకుందామె.

"అంటే?" అన్నది అర్థంకాక.

"అంటే—" చటుక్కున ముందుకు జరిగి ఆమె నోటిమీద ముద్దుపెట్టుకుని గబగబా బాత్‌రూమ్ వేపు నడిచిపోయాడు మురళి.

చేష్టలు దక్కి అలా చూస్తూ నిలబడిపోయింది నాగుమణి. కొద్ది సేపటివరకూ ఆమెకు ఏమి జరిగిందన్నదికూడా అర్థం కాలేదు....

## 3

"నువ్వు దేవతవే నాగమణా!" ఏడుస్తూ అన్నాడు చిన్నయ్య.

కాళ్ళు జాపుకుని గోడకానుకుని కూర్చుని బీడీలు చుడుతోంది నాగుమణి. ఆమె భర్త చిన్నయ్య ఆమె పాదాలవద్ద కూర్చుని వున్నాడు. అప్పటికి అతను తాగిన నాటు సారా బాగా తలకెక్కి వుంది. అట్లాంటి సమయాల్లోనే అతను ఎక్కువగా పశ్చాత్తాపాన్ని ప్రదర్శిస్తుంటాడు.

"అవునే నాగమణా," ముద్దలు ముద్దలుగా మాటాడసాగాడతను. "నాకుసుగా నీ పైసల్నిలా తగలెయ్యటం ఇష్టం లేదే. కాని ఏం చేయను. పని చేయాలంటే కష్టపడాల, కష్టపడాలంటే- నేను చెయ్యలేనే ఆ కష్టమూ...."

"మరి నేనెట్లా చస్తున్నాననుకుంటున్నావు?" విసుగ్గా అందామె తల పైకెత్తకుండా.

"గందుకే అన్నానే నువ్వు దేవతవనీ...."

హైస్కూలువరకూ ఎట్లాగో చదువు నీడ్చుకొచ్చాడతను. ఆ తర్వాత చదువింక వంటబట్టలేదు. ఉద్యోగంకోసం ప్రయత్నించాడు కాని అదీ దొరకలేదు, అతనికి చెడుస్నేహాలైనా లేవు జులాయిగా తిరగటానికి. ఈ త్రాగుడొకటే స్నేహం! మస్తుగా తాగి ఇలా పశ్చాత్తాపాన్ని ప్రతర్శిస్తుంటాడు పెళ్ళాం ముందు. కారణం ఆ త్రాగుడికి పైసల్ని ఆమే ఇవ్వాలి. తన అసమర్థత అతనికి తెలుసు, అందుకే అలా కుళ్ళిపోతుంటాడు తాగీ తాగీ- శారీరకంగానూ, మానసికంగానూ.

ఆ క్షణాన నాగుమణి కళ్ళ ఎదుట మురళి కనిపించాడు. నగ్నంగా వున్న అతని ఛాతీ ఎర్రగా-మధ్య చిరువెంట్రుకల్తో, నునుపాటి గుండ్రటి చేతులు, ఆరోగ్యాన్నొగజిమ్ముతుండే మొహము, నవ్వుతుండే కళ్ళు, తన పెదిమల మీద కదిలిన అతని పెదిమలు....ఒక్కసారిగా ఆమె వొళ్ళు జలదరించింది.

భర్తవేపు చూసింది. మరకలు నిండిన బట్టలు, పెదిమల చివర కొద్దిగా చొంగ, ఎర్రటి కళ్ళు, దుబ్బుగా జుట్టు, ఘాటుగా సారాయి వాసనా—

"వచ్చే జన్మలో కుక్కనై పుట్టి నీ ఇంటి పంచన పడి వుంటానే నాగమణా...." గొణుగుతున్నాడతను.

"ఊరకే లొల్లి పెట్టకుండా పండుకో", విసుక్కుందామె.

## 4

"నువ్వెంత అందంగా వుంటావు మణీ!"

మురళి గదిలో నిలబడి వుందామె. అతనామెను మంచంవద్దకు లాగటానికి ప్రయత్నిస్తున్నాడు. మంకు గుర్రంలా ఆమె పెనగులాడుతోంది.

"మణీ!' అన్న ఆ సంబోధనలో నాగుమణికేదో మాదుర్యం ధ్వనించింది. క్షణంపాటు ఆమె మనసు పులకరించింది.

ఆ సమయాన సడన్‌గా ఆమెకు తన భర్త చిన్నయ్య గుర్తుకు వచ్చాడు. గదిలో స్పృహ లేకుండా పడివున్నాడతను. ఆరోజు పైసలు ఎక్కువిచ్చి అతను బాగా తాగేటట్లు చేసిందామె, మురళి ప్రోత్సాహంతో. ఎంత పాపాత్మురాలు తాను! తనమీద తనకు చికాకేసిందామెకు.

"వదలండి నే పోవాలి!"

గింజుకుంది నాగుమణి. కాని అతని వొంటి నుండి వస్తున్న ఏవో సుగంధాలు, అతని శరీరం కల్పిస్తున్న ఏవో తన్మయత్వాలు, ఆమె మనస్సును మైనంలా కరిగించసాగాయి. క్రమంగా భర్త మరుపులోకి జారిపోసాగాడు.

"అబ్బ!" మూలిగిందామె ఒక సమయాన.

"ఏమిటి మణీ?" ఆదుర్దాని ప్రదర్శించాడు మురళి.

"వొళ్ళంతా పచ్చి పుండులా వుంది."

పట్టు కొంచెంగా సడలించాడతను.

"పాపం పగలల్లా పనిచేసి వుంటావుకదూ!" మృదువుగా ప్రవర్తిస్తూ అన్నాడతను. "ఇట్లా ఇక్కడుండి ఏమి బాధపడతావుగాని మణీ నాతో వచ్చేయరాదా?"

ఏదో లోకంలోకి జారిపోసాగిందామె.

## 5

దూరాన—చాలా దూరాన—

తన భర్తకిప్పుడు వందమైళ్ళ దూరాన వుంది నాగుమణి. మురళితో కలిసి వచ్చిందామె



ఇక్కడికి. ఆ చాకిరీని పడలేకా, ఆ సుఖరాహిత్యాన్ని అనుక్షణమూ కావలించుకుని వుండలేకా, మురళి అందిస్తున్న సుఖాల్ని వదులుకోలేకా, భర్త కెదురుగా వుండి మనస్సు కల్పించే నేరభావాన్ని సహించుకోలేకానూ.

ఒక చిన్న పక్కాటి బంగళాలో కాపురం పెట్టాడు మురళి. మొత్తం ఇంటిలో ఆ ఇద్దరు మాత్రమే మెసుల్తారు, పని వేళల్లో పనిమనిషి కాక. పడక గదినీ, డ్రాయింగ్ రూమునూ ఎంతో ఆకర్షణీయంగానూ, అందంగానూ తీర్చి దిద్దుకుంది నాగుమణి. మురళి పెద్దగా ఇల్లు కదిలి వెళ్ళే వాడు కాదు. కేరింతలూ, శృంగారాలూ, షికార్లూ, సినిమాలూ, ఇలా క్షణం తీరిక లేని, ఉక్కిరి ఎక్కిరి జీవితంతో దినాలు క్షణాల్లా గడిచిపోతూ తాను మరేదో లోకంలో జీవిస్తున్నట్లూ, అంతకు మునుపు గడిపిన జీవితమంతా ఓ పీడ కలలాగానూ అనిపించేదామెకు.

స్వతహా అందమూ, ఆరోగ్యమూ కలిగి వున్న ఆమె శరీరం పోషణతో నునుపెక్కి, శృంగారంద్వారా సొగసుల్ని సంతరించుకుని, నేర్పరితనంతో కూడుకున్న వస్త్రధారణలో వంపు సొంపుల్ని ప్రదర్శించుకుంటూ సమాజంలో ఆమెని ఒక డిజైరబుల్ దేమ్‌గా తయారుచేసింది. తరచుగా ఆమె అద్దంముందు నిలబడి తనను తాను చూసుకుంటూ మురుసుకునేది. గర్వపడేది.

ఆ మొదటి దినాల్లో అప్పుడప్పుడూ ఆమెకు భర్త గుర్తుకు వచ్చేవాడు. కాని ఆమెకు లభిస్తున్న సుఖాలూ, సౌకర్యాలూ వెంటనే అతణ్ణి ఆమెలోంచి తరిమివేసేవి. త్వరలోనే అతణ్ణి మర్చిపోగలిగిందామె.

## 6

రెండేళ్ళు గడిచాయి. మూడో యేడు ప్రారంభం కాబోతుండగా ఓ రోజు నాగుమణి ఒక విచిత్ర సంఘటనను ఎదుర్కోవాల్సి వచ్చింది.

ఆ మధ్యాహ్నం మురళి బయటికి వెళ్ళిపోయాడు. కొద్దిసేపయాక ఎవరో తలుపు తట్టినట్లు వినిపిస్తే వెళ్ళి ఆమె తలుపు తెరిచింది.

గుమ్మంలో ఎదురుగా చిన్నయ్య!

"నువ్వా?"

చప్పున ఆమెను నెట్టుకుంటూ లోపలకి వచ్చాడతను. వస్తూనే ఆమె కాళ్ళమీద పడి పోయాడు.

"నాగమణా నువ్వు లేకుండా బ్రతకలేనే, వచ్చేయవే వెళ్ళిపోదాం...." ఏడవసాగాడు.

క్షణంపాటు నాగుమణికి ఏం చేయాలో అర్థం కాలేదు. తత్తరపాటుతో అతనినుండి తన కాళ్ళను విడిపించుకుంటూ అడిగింది.

"అసలిక్కడికి ఎలా వచ్చావు? నేనిక్కడ వుంటున్నట్లు నీకెలా తెలిసింది??"

చిన్నయ్య బట్టలన్నీ మాసిపోయి మురికి కంపు కొడుతున్నాడు. నాగుమణి ఈ టౌన్లో వుంటున్నట్లు అతనికెలాగో తెలిసిందట. అత నిక్కడికి వచ్చి పదిరోజులపైగా అయింది. అప్పట్నించీ ఆమెకోసమూ, మురళికోసమూ వెతుక్కుంటూ వీధులన్నీ తిరుగుతున్నాడు. నిన్న సాయంత్రం అనుకోకుండా ఈ వీధిలో మురళి కనిపించాడతనికి. మురళి అతణ్ణి గుర్తు పట్టకపోవటం మంచిదే అయింది. మురళిని వెన్నాడుతూ వచ్చి ఈ ఇంటిని కనిపెట్టాడు. రాత్రల్లా ఈ వీధిలోనే పచార్లు చేస్తూ ఇక్కడిక్కడే గడిపాడట. ఉదయం గుమ్మంముందు నాగుమణి కనిపించగానే అతనికి ఎక్కడలేని సంతోషమూ కలిగింది. కాని అతను తొందర పడలేదు. మురళి బయటికి వెళ్ళిపోయేదాకా అక్కడెక్కడో కాసుకు కూర్చున్నాడు— ఉదయం ఏడింటినుంచి మధ్యాహ్నం మూడింటి దాకా. మురళి కనుమరుగవగానే వచ్చి తలుపు తట్టేడు.

"పదవే నాగుమణా, అతనొచ్చేలోగా వెళ్ళి పోదాం!"

నాగుమణికి చాలా జాలేసింది.

"తిండి తిన్నావా?" అప్రయత్నంగా అడిగిం దామె.

"లేదు, నిన్న పొద్దున తినటం!"

గుండెలు తరుక్కుపోయా యామెకు. చప్పున అతణ్ణి వంట గదిలోకి లాక్కుపోయి కడుపునిండా తిండి తినిపించింది. అతను అన్నం తింటుండగా ఆమె చెప్పుకొచ్చింది— ఇక్కడ మురళికి పెద్దపెద్ద పోలీసాఫీసర్లతో స్నేహముందనీ, కాబట్టి త్వరగా వెళ్ళిపొమ్మనీ. ఒకవేళ మురళి కనక అతణ్ణి చూస్తే ఏదో వంకని జైల్లో పెట్టించుతాడనీ, ఇలా ఇలా. పాపం అతను బెదిరిపోయాడు. త్వరత్వరగా తినేస్తూ అన్నాడు. "అయితే నువ్వు రానం టావా?"

"వచ్చే పరిస్థితిలో లేను నేను."

ఆమె తను దాచుకున్న డబ్బు కొంత వుంటే ఆ మొత్తాన్ని అతనికి ఇచ్చేసింది. వెళ్తూవెళ్తూ అతనో మాట అన్నాడు.

"నాగుమణా ఇక్కడేమైనా నీకు కష్టాలు మొదలైనా లేక నీకెప్పుడైనా మనింటికి వచ్చేయాలని అనిపించినా వెంటనే వచ్చేసేయి. బతుకంతా నీకోసం ఎదురు చూస్తుంటాను.."

## 7

ఆ రాత్రి మురళి కౌగిటినుండి విడివడ్డాక ఆమె పరిపరివిధాల ఆలోచించింది. అనేక విధాలుగా బాధపడింది. పశ్చాత్తాప పడింది. చిన్నయ్యకు తనెంత అన్యాయం చేసింది!? ఎన్ని అబద్ధాలాడింది. ఎంత బెదరగొట్టేసింది.

అదే రాత్రి ఆమెకొక కల వచ్చింది.

గోడకానుకుని కూర్చుని ఆమె బీడీలు చుడుతోంది. యాంత్రికంగా ఆమె వ్రేళ్ళు పని చేసుకు పోతున్నాయి. క్రమక్రమంగా ఆ వ్రేళ్ళు నెప్పులు పుడుతున్నాయి. నడుం పీక్కుపోతోంది. ఆ బాధ భరించలేక ఆమె వుండి వుండి వ్రేళ్ళు విరుచుకుంటోంది, నడుమును అటు ట్విస్ట్‌చేసీ ఇటు ట్విస్ట్‌చేసీ నొప్పిని పోగొట్టుకోవాలని ప్రయత్నిస్తోంది. అయినా ఆ వ్రేళ్ళ నొప్పులూ నడుం పీకుడూ ఎంతకీ పోవటం లేదు. రాత్రంతా అదే కల, ఉదయం వరకూ.

ఉలిక్కిపడుతూ ఆమె కళ్ళు తెరిచేసరికి తెలతెలవారుతోంది. ఎంత భయంకరమైన కల! వెళ్ళి చప్పున మురళిని వాటేసుకుని పక్కనే పండుకుండిపోయింది.

వారం రోజులపాటు ఆ కల ఆమెనలా హాంట్ చేసింది. రాత్రి పండుకుని నిద్రలోకి జారిపోగానే మొదలయ్యేది. అలా గోడకానుకుని




తూర్పోవటమూ, వేళ్ళు యాంత్రికంగా ఆకుల్ని చుడుతుండటమూ, క్రమంగా నడుం పీకుడు మొదలవ్వటమూ, వేళ్ళు నొప్పిపుడుతుండటమూ....ఎగ్జాస్టు అయిపోయి అలసటతో తిరిగి నిద్ర లేచేదాకా—లేచాకకూడా—అదే బాధ—అదే కల—కాదు అదే వాస్తవం—కంటిన్యూ అవుతున్నట్లుగా ఫీలయేదామె చాలా సేపటి వరకూ.

"ఓరి భగవంతుడా!" పగలల్లా మాటి మాటికీ నిట్టూర్చేది ఆ కల గుర్తుకు వచ్చి.

అదృష్టవశాత్తూ కొన్నాళ్ళ తర్వాత ఆమెకా కల రావటం మానేసింది.

## 8

మళ్ళీ మామూలు! జీవితం సుందరంగా, లోకం రమణీయంగా కనిపిస్తున్న తరుణంలో నాగుమణి జీవితంలో అకస్మాత్తుగా ఏదో జరిగింది—గిర్రున తిరుగుతున్న కాల చక్రాన్ని ఎవరో బలిమినపట్టి ఆపినట్లుగా ఫీలయిందామె సడన్‌గా. అది ఈ రకంగా జరిగింది.

ఒకసారి మురళికి సంబంధించిన మనుష్యులెవరో వచ్చి కొన్నాళ్ళు వుండిపోయారు. ఆ నాల్రోజులూ వాళ్ళకు చాలా ఆప్యాయంగా, వాళ్ళు తనకూ స్వంత బంధువులేనన్నట్లుగా అతిథి మర్యాదలు చేసింది నాగుమణి. కాని వాళ్ళు ఆమె తమకేదో అపకారం చేసినట్లుగానూ, తామామెను వెలేసినట్లుగానూ ప్రవర్తించారు. అంతేకాదు, వాళ్ళు వచ్చి వెళ్ళిపోయాక మురళిలోకూడా అలాంటిదే ఏదో మార్పు వచ్చింది. ఇదివరకటిలా అతనామెతో అంత ఆప్యాయంగా ప్రవర్తించటం లేదు, పూర్వంలా ఇప్పుడతను ఎప్పుడూ ఇంటివద్ద వుండటం లేదు. క్లబ్బనీ, సిన్మాలనీ ఎక్కువ కాలాన్ని బయట గడుపుతున్నాడు. తన సుఖాన్ని తాను చూసుకుంటున్నాడు. ఆమెనంతగా పట్టించుకోవటం లేదు. క్రమంగా నాగుమణి వంటరితనాన్ని ఫీలవసాగింది. అతనిలో ఏదో జరుగుతోందనీ, తనకేదో జరగబోతోందనీ పసిగట్టసాగిందామె....

## 9

నిజమే, మురళి చాలా మారిపోయాడు. ఆమెమీది ఆకర్షణే సన్నగిల్లిందో లేక బంధువుల ప్రలోభాలే పనిచేశాయో గాని కొన్నాళ్ళయే

సరికి అతను మరీ విచిత్రంగా తయారయాడు. చీటికీ మాటికీ ఆమెమీద విసుక్కుంటున్నాడు. తరచుగా చేయి చేసుకుంటున్నాడు.

ఓరోజు అన్నం సరిగ్గా ఉడకలేదని అత నామెను చావ చితక బాదాడు.

"మురళీ నామీద మోజు తగ్గిపోయిందా?" అడిగిందామె అంతా అయిపోయాక బాధగా చూస్తూ.

ఉలిక్కిపడ్డాడతను. కాని సమాధాన మివ్వ లేదు. మళ్ళీ మర్నాటినుంచి మామూలే.

చిన్నగా రోజులు గడుస్తున్నాయి. అసీజీగా, భారంగా, విషాదంగా. కాలక్రమాన నాగుమణి కూడా సహనాన్ని కోల్పోసాగింది. పూర్వంలా కాకుండా ఇప్పుడామె అతనికి ఎదురు తిరిగి మాట్లాడుతోంది. మాటకి మాట అంటోంది. చివరికి అలాంటి పోట్లాట దెబ్బలాటల్తో ముగు స్తోంది, సామాన్యంగా. కాని రాత్రి అయేసరికి మాత్రం ఇద్దరూ దగ్గరవుతున్నారు. ఆ బాపతు శరీర ఆకర్షణే లేకపోతే ఇద్దరూ ఏనాడో విడి పోయి వుండేవారు. కాని ఆ విషయంలోనూ కొన్నాళ్ళకి ఆటంకమే ఎదురయ్యింది వాళ్ళకు. అది సహజమే కూడా.

ఆ రాత్రి ఎప్పటిలాగే మురళి ఆమెతో శృంగారానికి ప్రయత్నించబోయాడు.

"నాకు వంట్లో బాగాలేదు," అన్నదామె చిన్నగా విదిలించుకుంటూ. ఆ మధ్యాహ్నం జరిగిన కీచులాట ఆమె మనస్సునింకా తేలు కొండిలా కుడుతోంది.

"ఎందుకు బాగాలేదు?" అన్నాడతను.

"ఏమో!" అటువేపుకు తిరిగి పడుకుంది.

కొద్దిసేపు ఆమె వీపువేపు చూసి చటుక్కున ఆమెను తనవేపు తిప్పుకుని నోటిమీద ముద్దు పెట్టుకున్నాడతను.

ఈల్డ్ కాబోతూనే అతని మొహంలోకి చూసి ఉలిక్కిపడిందామె. అతని కళ్ళల్లో కాంక్షతప్ప ప్రేమ అనేది ఏ కొశానా లేదు. పెంకె గుర్రంలా అతని పట్టునుండి విడిపించు కుని ఛెంగున లేచి కూర్చుందామె.

"మురళీ నాకిష్టం లేకుండా నువ్వా పనిని చేయలేవు!" అన్నది తీవ్రంగా చూస్తూ.

"అంటే?"

"అంటే అదంతే. నా కిష్టం లేకుండా నువ్వా పనిని చేయవద్దంటున్నాను. చేయలేవంటున్నాను. అర్థమయిందా?"

"ఐసీ. ఆ లెక్కన నీతో వుండాల్సిన అవసరం నాకూ లేదంటున్నాను. నేను చెప్పేది అర్థమయిందా నీకు?" మాటకు మాట అన్నా డతను.

"అంటే ఆ కార్యంకోసం మాత్రమే మన మిద్దరం కలిసి వుంటున్నామంటావా?"

"కాక?! నువ్వేదో నాతో నమ్మకంగా కాపరం చేస్తావని తీసుకొచ్చుకున్నాననుకుంటు న్నావా??"

భర్తను వదిలి లేచివచ్చిన అదదాన్నిగా గుర్తుతెస్తున్నాడతను. ఆ కించపాటును భరించ లేక పోయిందామె.

అసలు చానాళ్ళనుంచి వాళ్ళిద్దరూ ఇట్లాంటి సిట్యుయేషన్ ఎదురు కావచ్చని అనుకుంటూనే వున్నారు ఎవరికి వాళ్ళ అంతరాల్లో. అందుకు తమను తాము సన్నద్ధం చేసుకుంటూనూ వచ్చారు. ఆఖరికి ఆరోజు రానే వచ్చింది.

"సరే మురళీ, నీకంత మోజు చచ్చిపోయి నప్పుడు జిడ్డులా నిన్ను నేను అంటిపెట్టుకుని వుండటంకూడా మంచిది కాదు. రేపుదయమే నేను వెళ్ళిపోతున్నాను. సరేనా?!" కసిగా అన్న దామె.

ఆ మాటలన్నప్పుడూ, అంతకుముందు కొద్ది రోజులనుంచీ ఆమె కళ్ళల్లో చిన్నయ్య మెదుల్తున్నాడు. అతను వెళ్ళిపోతూ అన్న మాటలు గుర్తుకు వచ్చాయామెకు.

"నాగుమణీ నీ కెప్పుడయినా మనింటికి వచ్చేయాలనిపించినా లేక ఇక్కడ నీకేమయినా కష్టాలు మొదలయినా మనింటికి వచ్చేసేయి. బతుకంతానీకోసం ఎదురుచూస్తుంటాను..."

"నా పిచ్చి చిన్నయ్యా, వచ్చేస్తున్నాను నీ వద్దకు!" తనలో తను గొణుక్కుందామె.

అప్పటికప్పుడు లేచి చకచకా తన బట్టల్ని సూట్‌కేసులోకి సర్దుకుందామె.

"కుక్కలా నీ కాళ్ళవద్ద పడివుంటా నను కున్నావేమో, అదేమీ జరగదు."

మధ్యలో ముక్కు చీదుకుంటూ అరిచిందామె.

"ఇప్పుడే వెళ్ళిపోతాననుకుంటున్నావేమో, అదేమీ కాదు, రేపుదయం పోతాను. ఆమాత్రం వుండే హక్కుంది నాకు...." తనలో తను గొణుక్కుంటున్నట్లుగా మళ్ళీ అన్నది పెద్దగా, అతని మంచానికి అవతలగా నేలమీద చాప పరుచుకుంటూ.

ఆమె చేష్టల్ని ఆనందంగా పరికిస్తున్న మురళి ఆమె పడుకోబోతుండగా తెప్పరిల్లిన వాడై పర్సుతీసి కొంత పైకాన్ని ఆమెవేపుకు చూపుతూ అన్నాడు.

"దారి ఖర్చులకు వీటినుంచు."

ఒక్క క్షణం అతని మొహంలోకి ఏహ్యంగా చూసి నాగుమణి విసురుగా ఆ పైకాన్నందుకుని తన తలగడక్రింద పెట్టుకుంది.

తన బంధువులు చూపించి వెళ్ళిన పిల్ల అందమైన ఫోటోనీ, ఆమె తీసుకు రాబోయే ఆస్తినీ, తనకు తండ్రి అప్పగించబోయే బిజినెస్ గురించీ తల్చుకుంటూ ఆ రాత్రి చాలా ఆలస్యంగా నిద్రపోయాడు మురళి....

# 10

గోడకానుకుని కూర్చుని బీడీలు చుడుతోంది నాగుమణి. ఎదురుగా వున్న చేటలో తంబాకు పోగుబడి వుంది ఓట్టగా. పక్కనే గుల్లలో చుట్టబడిన కొద్దిపాటి బీడీలు మాత్రం వున్నాయి.

ఆమె చేతివ్రేళ్ళు చప్పుచప్పున కదుల్తున్నాయి. తంబాకును ఆకుమీద పరవటమూ, ఆకును చప్పున చుట్టేయటమూ, చూపుడువేల్తో పైపైపు కొనను మడతల్తో మూసివేయటమూ, క్రిందివేపు కొనను దగ్గరకు నొక్కి దారంతో బిగించటమూ...

రాత్రంతా అదే కల ఆమెకు—

ఆమె వ్రేళ్ళు నొప్పి పుడుతున్నాయి, నడుం పీక్కుపోతోంది. ఆ బాధ భరించలేక మధ్య మధ్యలో మెటికలు విరుచుకుంటోందామె, నడుం విరుచుకుంటోంది....

రాత్రల్లా అదే కల—

ఎంత పనిచేసినా గుల్లలో బీడీలు పెరగటం లేదు, చేటలో తంబాకు తరగటంలేదు. బీడీ కట్టల్ని పెంచుదామనీ, ఆ తంబాకును కాస్తా అవచేదామనీ ఒకటే యాంగ్జయిటీలో ఆమె తన పని వేగాన్ని పెంచ ప్రయత్నిస్తోంది. ఫలితంగా నడుం పీకుడూ, వ్రేళ్ళ నొప్పులూ, గుండెల్లో పెరిగిపోతున్న టెన్షనూ మాత్రమే మిగుల్తున్నాయి....

హార్రర్!!

తెల్లవారు ఝామునకి ఉలిక్కిపడుతూ కళ్ళు తెరిచిందామె.

# 11

రాత్రి ఆలస్యంగా నిద్రపోయాడేమో, బాగా ప్రొద్దెక్కేదాకా నిద్రనుంచి మేల్కోలేక పోయాడు మురళి.

కళ్ళు తెరిచేసరికి ఎదురుగా నాగుమణి కనిపించింది. ట్రిమ్‌గా తయారై వుందామె. ఆమె చేతిలో కాఫీ కప్పుంది. ఆమె పెదాలపై చిరునవ్వుంది. కాని ఆమె కళ్ళల్లో దిగులు!

అవతలగా రాత్రి ఆమె సర్ది వుంచిన సూట్‌కేస్ కనిపిస్తోందతనికి.

"థాంక్ గాడ్, వెళ్ళిపోతోందన్న మాట!" కాఫీ త్రాగుతూ సంతోషంగా అనుకున్నాడతను.

కాఫీ త్రాగటం పూర్తికాగానే అతను ఖాళీ చేసిన కప్పుని అందుకుందామె, దాన్ని కొంచెం అవతలగా వున్న టీపాయ్ మీద పెట్టి ఇటు తిరిగింది. కొద్దిసేపు అతని కళ్ళల్లోకి పేలవంగా చూసి నవ్వటానికి ప్రయత్నించింది.

"ఏమిటి, ఇంకేమైనా డబ్బులు కావాలా?" అడిగాడతను!

చటుక్కున అతని పాదాలవద్ద మోకాళ్ళ మీద కూలబడిందామె. అతని అరచేతుల్ని పదే పదే ముద్దాడుతూ కళ్ళు ధారాపాతంగా వర్షిస్తుండగా ఉద్వేగంతో హిస్టీరికల్‌గా ఇలా అనసాగింది:

"మురళీ మురళీ, వదలవుకదూ నన్ను—దయచేసి నన్ను వదలవుకదూ—పిల్లిలా నీ కాళ్ళవద్ద పడి వుంటాను — వదలవుకదూ నన్ను... " □








వి. వినయమూర్తి

రెండున్నర గంటల బస్సు ప్రయాణంతో ఒళ్ళంతా ముద్దయిపోయింది. వీధిలోంచి లోపలికి అడుగు పెట్టి ఏవో నవ్వులు వినిపించ డంతో బుర్ర అటువయిపు తిప్పాను. మా బావా, వరం ఒకే మంచంమీద కూర్చుని వున్నారు మండువా నానుకుని వున్న గదిలో. షాక్ తిన్నట్టు నిలబడిపోయాను. వరం నవ్వుతున్న దల్లా నేను కనపడగానే ఒక్క అంగలో గది లోంచి బయటపడి వాళ్ళ యింటివేపు పారి పోయింది. బావ ఏం జరిగిందా అన్నట్టు ఇటు వయిపు తిరిగి నన్ను చూడగానే నివ్వెరపోతూ లేచి నించున్నాడు. అంతలోనే కంగారు కప్పి పుచ్చుకుంటూ—

"రా! రా! బావా" అంటూ ఆహ్వానించాడు.

భుజాన వేలాడుతున్న బాగ్‌ను దించు కుంటూ—

"ఎప్పుడొచ్చావ్!" అన్నాను.

నా గొంతులో సౌమ్యత లేకపోవటంతో జగన్నాధం తబ్బిబ్బు పడ్డాడు.

"మొన్న వచ్చాను."

వరలక్ష్మిని గురించి ప్రశ్నించాలనుంది. కాని ఏమని ప్రశ్నించను? ఎలా?

యింతలో చెల్లాయి లలిత "వరం" అంటూ అరుచుకుంటూ వచ్చి, నన్ను చూస్తూనే కళ్ళు యింతంతచేసి "అరేయ్! అన్నయ్యా!" ఎప్పు డొచ్చావ్!" అంది. అనడమేంటి. "అమ్మా! అన్నయ్యొచ్చాడే" అంటూ అరుస్తూ లోపలకు పోడం, అమ్మను వెంటబెట్టుకు రాడం ఒకదాని వెంబడి ఒకటి జరిగిపోయాయి.

అమ్మ నా రాకకు చాలా సంతోషించింది. సహజ ధోరణిలో "నీకు దయలేదనీ, పండగల క్కూడా రావటంలేదనీ" నిష్టూరం వేసింది. అంతట్లోనే .... "పోన్లే! యిన్నాళ్ళకయినా వచ్చావు!" అంటూ సంతృప్తి ప్రకటించింది.

యిలా ఆవిడ మాట్లాడుతుంటే ఆవిడకు అన్యమనస్కంగా జవాబిస్తున్నాను.

నాన్న ఎవరినో వెంటబెట్టుకుని వచ్చినట్టు న్నాడు. "అమ్మాయ్! చాప పంపించమ్మా!" అంటూ వీధిలోంచి అరిచాడు.

లలిత చాప తీసుకువెళ్ళి తలుపు చాటునించే అందించింది. దాని గొంతు వినిపించలేదు. కానీ నాన్న గొంతు వినిపించింది "ఇప్పుడే వస్తాను! మా పెద్దాడు వచ్చాట్ట కూర్చోండి!"

"ఎప్పుడొచ్చావురా బాబీ!" నాన్న ఆప్యా యంగా పలకరించాడు.

"యిప్పుడే!"

"పరీక్షలేవో వున్నాయన్నావు మీ బాంక్‌లో! బాగా రాసావా?"

చెప్పాను. ఆయన కుశలప్రశ్నలకు మధ్యలో మా అమ్మ అడ్డుపడుతోంది .... 'చూడండీ!

పెద్రితండ్రి ఎంతెలా చిక్కిపోయాడో! యీ సారైనా పెళ్ళికి మెడలు వంచా'లంటూ....

ఆయన వీధిలోకి వెళ్ళాడు.

"కబుర్లు తరవాత చెప్పుకోవచ్చు! నాన్న గారికి పెట్టిన వేణ్ణీళ్ళు వున్నట్టున్నాయి! లలితా! తువ్వాలు యియ్యి! స్నానంచేస్తాడు."

స్నానం చేస్తున్నాను.

వెచ్చటి నీళ్ళు ఒంటిమీద పడుతుంటే ఆ చలిలో చిత్రంగా సుఖంగా వుంది. ఆ హాయిలో మనసు లగ్నం కావటం లేదు. వరం చుట్టూ బావచుట్టూ తిరుగుతోంది.

వరలక్ష్మి మా పెదనాన్న కూతురు. వాళ్ళ కుటుంబానికీ మా కుటుంబానికీ మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటుంది. అన్నదమ్ములిద్దరూ మాట్లాడుకోని పాతిక ఏళ్ళయిందిట.యీ మధ్య పదేళ్ళుగా చితికిపోయాడుట. కూతురికి పెళ్ళి కూడా చేయలేకపోయాడని వింటున్నాను. గ్రామ రాజకీయాల్లోకూడా ఆయన మా నాన్న కన్న కాస్త వెనకబడి పోయాడనటానికి నిదర్శనం పంచాయితీ ప్రెసిడెంటు గిరీ మా నాన్నకు దక్కటమే. అయితే మళ్ళీ ఎన్నికలలో మా పెదనాన్న గెలుస్తాడని ఒక పుకారు వుంది. ఏది ఎంతవరకూ నిజమో నాకు స్పష్టంగా తెలీదు. కాని, పిల్లలమయిన మేం ఒకరి యింటికి ఒకరు అపుడపుడు వెళ్ళటం వుంది. ముఖ్యంగా వరం యిక్కడికి వస్తుంటుంది. మా పెదనాన్న ఆరుగురు కూతుళ్ళలో అదే పెద్దది. వరమూ నా చెల్లెలు మొగుడూ ఒక మంచంమీద కూర్చోటమేంటి?

భోజనాల దగ్గర నాన్న తన మామూలు ధోరణిలో ఏవేవో మాట్లాడుతున్నాడు. బావ మొహంలో భావాలు అంతు చిక్కటంలేదు. నేనేమయినా అనవసరంగా ఆలోచిస్తున్నానా?

భోజనాలు చివరి దశకు చేరుకుంటుండగా—

"యీ వేళ వరం రాలేదేంటే....?"

ఆశ్చర్యంగా నాన్నవయిపు చూశాను. వరం రాక గూర్చి ప్రత్యేకంగా అడగటమేమిటన్నది నా ప్రశ్న. ఆ దృశ్యం నా కంట బడటం వల్ల యీ ప్రశ్న ఏర్పడిందా? ఆలోచన తెగలేదు.

ఆయన ధోరణిలో ఏదో అసాధరణత నాకు అవుపిస్తోంది.

"వచ్చిందే!" అంది అమ్మ చెల్లాయి వయిపు తిరిగి.

"ఆ! వెంటనే వెళ్ళిపోయింది" లలిత జవాబిచ్చింది.

తాంబూలం నవుల్తూ నాన్న బయటకు వెళ్ళాడు. ఆయన గమ్యస్థానం చెరువు గట్టు మీద రావిచెట్టు. ఊళ్ళో పదిమందీ అక్కడకు చేరి గంటో రెండు గంటలో లోకాభిరామాయణంలో పడతారు.

"మనమూ అలా వెళ్దామా బావా!"

నా ప్రశ్నకు జవాబుగా తలూపి చెప్పులు వేసుకొన్నాడు జగన్నాధం.

ఆకాశంలో అష్టమచంద్రుడు వెన్నెల కురిపిస్తున్నాడు. మౌనంగా సిగరెట్లు కాలుస్తూ చెరువు గట్టుమీద నడుస్తున్నాం! కీచురాళ్ళ శబ్దం ఆ నిశ్శబ్దంలో చిత్రంగా వుంది. రావిచెట్టు దాటాం! ఊరు నెమ్మది నెమ్మదిగా మాకు దూరమవుతోంది.

"ఏం సినిమాలు చూసావోయ్!"

బావ ప్రశ్నకు జవాబివ్వలేక పోయాను. అడిగెయ్యాలన్న నిశ్చయం జరిగిపోయింది. ఎలా అన్నదే తెలియటంలేదు.

"యిక్కడ కూర్చుందాం!" అన్నాను.

ఒత్తుగా గడ్డి వుందక్కడ. చెరువులో అలలు చిన్న అలికిడి సృష్టిస్తున్నాయి. వందెకరాల చెరువు అది. బావ మట్టిరాళ్ళు చెరువులోకి విసురుతున్నాడు.

ఆ వెన్నెలలో అతని మొహంలో భావాలు నాకు దొరకటం లేదు.

హఠాత్తుగా నా వయిపు తిరిగాడు.

"ఏంటలా చూస్తున్నావ్?"

"ఒక విషయం అడగాలనుంది... !"

చేతిలో రాయి నేలమీద జారవిడిచాడు. మోకాళ్ళమీద తల పెట్టుకొని నేలవయిపు చూస్తూ తనలో తను గొణుక్కుంటున్నట్టు అన్నాడు.

"వరం గురించే కదూ!"

"అవును.

కొంతసేపు ఆలోచించి ఏదో భారం వదిలించుకొంటున్నట్లు అన్నాడు.

"యీ విషయం మీ చెల్లాయికి తెల్సు!"

భార్యకి ఈ విషయం తెలియటంలో అతడు ప్రత్యేకించి చెప్పవలసింది ఏమీ లేదు. కానీ అలా చెప్పటంలోనే ఏదో కొత్తదనం వుంది. నా ఊహకు అర్ధంకాని కొత్తదనం!!

"అంటే....??"

"యిలాంటి విషయం ఎలా మాట్లాడాలో నాకు అర్థంకాటం లేదు బావా!" అంటూ ఆగాడు.

ఒళ్ళు పట్టని కోపం వచ్చింది. చెయ్యటానికి ఏ అభ్యంతరాలూ వుండవు కాని... చెప్పటానికే వస్తాయి అన్ని సిగ్గులూ!!తమాయించుకున్నాను. అతను నాకు బావ అయినంతమాత్రాన అతని లైంగిక జీవితంలోకి తొంగి చూడటానికి నాకు అధికారమేంటి?

"యీ విషయంగూర్చి... తెలుసుకోవాలనుకుంటే మీ చెల్లాయినే అడుగు! అయామ్ టూ వీక్!" గొంతులో దిగులు!

అతడు సమర్ధించుకోటం లేదు. చెయ్యనే లేదనటం లేదు.

"అదికాదు బావా!...."

నా మాటలు మధ్యలోనే ఖండిస్తూ అన్నాడు.

"దయచేసి... నన్నేం ప్రశ్నించకు బావా! ఆ క్షణంలో నాకు కలిగిన ఆనందం... ఆ తరవాత యింత దుఃఖం కలిగిస్తుందని తెలిస్తే.... యింత వ్యామోహంలో పడిపోయే వాడిని కాదేమో! మరొకరి బ్రతుకును సర్వనాశనం చేసేవాడిని కాదేమో! యింత బాధపడుతూ కూడా. . ఎందుకలా లొంగిపోతాను! నాకెందుకీ బలహీనత....!"

మనిషి సన్నగా వణుకుతున్నాడు. లోపల్లోపల వున్న దుఃఖం అతని శరీరాన్నంతనీ కుదిపివేస్తున్నట్లుంది! ఆ పరిస్థితిలో అతన్ని నేను యిబ్బంది పెట్టలేకపోయాను.

కొంతసేపట్లో అతను తేరుకొన్నాక ఇంటి మొహం పట్టాం!

మర్నాటి సాయంకాలంగాని చెల్లాయిని ఈ విషయం అడగడానికికుదరలేదు. భార్యాభర్తలిద్దరికీ తెలిసిన విషయమయినప్పుడు నేను కలగచేసుకోట మెందుకు అనిపించింది. కాని, బావ దుఃఖం మనసులో మెదులుతుంటే నా జోక్యం అవసరమే అన్పించింది. బావ అన్నాడేగాని చెల్లాయికి యీ విషయం తెలుసునా? దాన్ని అడిగితే ఏం బాధపడుతుందో! రకరకాల ఆలోచనలు!

పెరట్లో కొబ్బరి మొక్కల దగ్గర మంచం మీద కూర్చున్నాం!

"లల్లీ! బావ ..."

"రాత్రి చెప్పారు.అంతా నీకు చెప్పాల్రా... " అంది ఱుర్ర వంచుకొని.

కొంతసేపు అది సంశయించింది. తర్వాత స్వరంలో ఒక చిత్రమైన గర్వం తొంగి చూస్తుండగా ఆరంభించింది—అది చెప్పినదాని సారాంశం యిది.

"—అటు మొన్న మీ బావ వచ్చారు. సాయంకాలం నాలుగూ నాలుగున్నర అవుతుంది. నేను లోపలికి రాగూడదు. ఆయన మంచంమీద కూర్చుని ఏదో మాట్లాడుతున్నారు. ఇంతలో నాన్న వచ్చాడు. ఆయనతో కబుర్లు చెబుతూ కూర్చున్నాడు. వరం అక్కయ్యకూడా అదే టయింకి వచ్చింది. మీ బావగారిని చూస్తూనే వెళ్ళిపోబోతుంటే నాన్నే "దావే! వరం!" అంటూ పిలిచాడు. కాస్సేపు కబుర్లయ్యాయి.

"యీ వేళ్టికి మీ పిన్నమ్మకి సాయం చెయ్యవే! రాత్రి ఇక్కడే పడుకుందువుగాని... ! బావకూడా వచ్చాడా! వంటంతా చెయ్యలేదు. .."

"అలాగే చిన్నాన్నా కానీ.. ." అందది.

"మీ యింటికి కవురెడతాన్లే!" అన్నాడు నాన్న బయటకి వెళ్తూ. వరం వంట యింట్లోకి వెళ్ళింది. మీ బావగారు బట్టలు మార్చుకుని పుస్తకం పట్టుకుకూర్చున్నారు. నేను పెరట్లో నించుని జాంకాయలు ముగ్గాయేమో చూస్తున్నాను.

"చీకట్లో యిక్కడ దేవుళ్ళాడుతున్నా




వెందుకే?" అంటూ నాన్న వచ్చాడు. నేనేదో చెప్పాను

"సర్లేగానీ ఓ మాట" అన్నాడు.

ఏంటా అన్నట్టు చూసాను.

"మన వరం వుంది చూసావా! దానికీ పాతికా నిండినట్టున్నాయి'"

"అవును!"

"ఓ చెంప నెరిసిపోతూనే వుంది పాపం' దాని బాబా' పాపం పెళ్ళి చెయ్యలేకపోతున్నాడు. తలుచుకొంటుంటే మన వంశం గౌరవం ఏమయిపోతుందా అని భయం వేస్తోంది కోర్కెలు తీరాల్సిన వయసులో పెళ్ళిళ్ళు కాక అడ్డమైనవాళ్ళతోనూ సంబంధాలు పెట్టుకొని యింటిల్లిపాదికీ తలవంపులు తెచ్చే ఆడపిల్లల కథలు ఎన్ని వినటంలేదూ! పాపం'"

అమోమయంగా చూస్తున్నాను.

"అందుకని మనం దానిని దయదలచాలి" అన్నాడు నాన్న.

"??"

"మన కులగౌరవం కోసం సాటి ఆడ దానికోసం నువ్వీ త్యాగం చెయ్యాలమ్మా' ఇందులో తప్పుకూడా ఏమీలేదు! పూర్వం వ్యాసమహాముని లాంటి వారే వీటిని సమ్మతించారు "

"నాకేం అర్థంకావటం లేదు నాన్నా?"

"మరేం లేదమ్మా! మీ ఆయనా వరం కలుసుకొనేటట్టు చెయ్యాలి. వంశ గౌరవం నిలుస్తుంది. యీ మాత్రం త్యాగం చెయ్యటం వల్ల వరం కోర్కెలు తీరతాయి! ఎటునుంచి ఎటొచ్చి ఏం జరిగినా మందో మాకో చూట్టానికి మనం వుండనే వున్నాం! ఇంట్లో ఇంట్లో విషయం కనక బయటకు పొక్కదు

నాన్న మాటలు మొదట్లో నాకు రుచించ లేదు. కానీ నా త్యాగంవల్ల ఎంతమంది జీవితాలు రక్షించబడతాయో నాన్న వివరంగా చెప్తుంటే వరంమీద జాలేసింది! నాకన్న పదేళ్ళు పెద్దది తను! పాపం? అనుకున్నాను.

ఆ రాత్రి వాళ్ళిద్దరికీ మంచాలు ఒకచోటే చేయించాడు నాన్న. నేను చాపమీద పడుకున్నాను మండువాలో. అర్ధరాత్రి బావ నన్ను లేపారు. ఆయనకి నిద్రపట్టటం లేదుట! నాన్న చెప్పిన మాటలు గుర్తొస్తున్నాయి. ఆయన మరో స్త్రీపట్ల దృష్టి వుండే మనిషి కాదు. నేను యిక్కడకు వచ్చి నెల దాటిపోయింది "ఎందువల్ల?" అన్నాను అమాయకంగా మొహంపెట్టి. "నువ్వెప్పుడూ యింతే "

మారాంగా అన్నారు.

నాన్న గుర్తొస్తున్నాడు. ఆయన చెయ్యాలన్న త్యాగం గుర్తొస్తోంది. గొంతు పెకల్చుకొని అన్నాను.

"ఫరవాలేదు. వరం వుందిగా?"

"వద్దు! తప్పు! వెధవ్వేళాకోళం!" అన్నారు.

"పాపం! దానికీ పాతిక ఏళ్ళు వచ్చాయండీ! అదిమాత్రం ఉప్పూ పులుసూ తింటంలేదూ?"

"నోర్ముయ్!" అంటూ వెళ్ళిపోయారు.

వరంకూడా గొడవపెట్టలేదు! పాపం! అది మాత్రం మనిషికాదూ!"

లలిత గొంతులో త్యాగం చేసానన్న ఫీలింగు బలంగా వుంది.

యీ జరిగిన సంఘటన యింత వివరంగా అది చెప్పలేకపోయినా జరిగినదిదే అని వూహించగలిగాను.

నేనేం మాట్లాడకపోవటంతో దానికి ఏదో భయం కలిగినట్టుంది. ప్రపంచం గురించీ మనుషుల అంతర్గత స్వభావాల గురించీ అర్థం చేసుకోటానికి తగిన వయసుకూడా దానికి లేదు. పధ్నాలుగేళ్ళ వయసులో యీ దేశంలో ఆడపిల్లలు పెళ్ళిళ్ళు చేసుకొని పిల్లలనుకూడా కనేస్తున్నారు గాని ఏ విషయాన్నయినా లోతుగా ఆలోచించే స్థాయికి ఎదుగుతున్నారా? అందుకే వాళ్ళను త్యాగాలూ, ప్రేమలూ, కన్నీళ్ళూ, కష్టాలూ ఆకర్షించినంత బలంగా మరేవీ ఆకర్షించలేవేమో!

"నేనేమయినా తప్పు చేసానా అన్నయ్యా!"

భయం నిండిన దాని గొంతుక నా ఆవేశాన్ని అణిచేసింది.

"సర్లే వెళ్ళు." విసుగ్గా అన్నాను.

అది వెళ్ళలేదు కొంచెంసేపు తటపటాయిస్తూ అంది.

"నాకేంటో భయంగా వుందిరా! దాని పిచ్చిలోనే ఆయన పడిపోతే నా కాపురం ఏమవుతుంది? నేను వయసులో చిన్నదాన్నిట! దానికన్నా బావుంటానుట! అందువల్ల బావ నన్ను వదల్లేడుట! నాన్న మాటలు నిజమే నంటావా?"

ఈ ఆలోచనలన్నీ ముందేమయినాయి?— అన్న ముక్క నోటి చివరివరకూ వచ్చింది. కాని అనలేదు.

అది వెళ్ళిపోయింది

దానికీ భయంగానూ బెంగగానూ వుంది. బావ సరేసరి! క్షణికమైన కోరికలో సాహసించాడే కాని చేసింది తప్పేనని ప్రశ్చాత్తాప పడుతున్నాడు! యింక వరం? అది మాత్రం ఎట్లా సంతోషపడగలదు?

యిది కథలలో తప్ప జీవితంలో ఊహించలేని సమస్య. దీని కంతటికీ ప్రోత్సాహమిచ్చిన నాన్న మనసులో వున్నదేంటి? వరం పరిస్థితి పట్ల కేవలం జాలే వున్నదా? అందుకు యిదే మార్గం అనుకున్నాడా? పల్లెటూళ్ళలో యిటువంటి సంబంధాలను ప్రోత్సాహించటమనే పద్ధతి పూర్వం నుంచీ వున్నదేనా? నా పట్నవాసం చదువులో ఉద్యోగంలో జీవనవేగంలో యీ పల్లెటూరి బ్రతుకులో నిగూఢమయివున్న యిలాంటి రహస్యాలు నా చెవులలో చేరలేదా? కాక మరేదయినా కారణం వున్నదా? ఏమిటది? ఏమిటది?

పెరట్లో మంచంమీద — అలాగే పడుకున్నాను. ఆకాశం మీదకు లగ్నం చేసిన చూపుల చుట్టూ చీకట్లు క్రమ్ముకొన్నాయి. తల నాదుగా వుంది.

"బాబీ! బాబీ!"

నన్నెవరో లేపుతున్నారు. కళ్ళు తెరిచాను

నాన్న! బుగ్గమీసాలతో వున్న ఆ ముఖంలో కనిపిస్తున్న ఆదుర్దా నాకు ఆ సమయంలో ఒక మహానటుడి మహోన్నత నటనలా కనిపించింది. భుజం పట్టుకుని కదుపుతున్నాడు.

లేచి కూర్చున్నాను.

"ఒంట్లో బావులేదా ?"

"అబ్బే! బానే వుందే!" అంటూ నించున్నాను. దూరాన లలిత నించుని వుంది. అది భయపడుతున్నట్లు తెలుస్తూనే వుంది.

## (వి)చిత్రం విజ్ఞానం



పోలీసు కుక్కల (ఘ్రాణ) శక్తి మన ఊహ కందని మేరలో వుంటుంది. దొంగ ముట్టుకున్న వస్తువులమీదా, అతడు కాలు మోపిన ప్రదేశాల మీద, అతడు విసర్జించిన కొవ్వు ఆమ్లములు వుంటాయి. మనిషి మనిషికీ యీ కొవ్వు ఆమ్లములలో తేడా వుంది. ఈ ఆమ్లముల వాస నను పసిగట్టి పోలీసు కుక్కలు దొంగలను పట్టుకుంటాయి. పోలీసుకుక్క (ఘ్రాణ) శక్తికి సమంగా మనిషి (ఘ్రాణ) శక్తి పెరగాలంటే- అది సుమారు పదిలక్షల రెట్లు పెరగాల్సి వుంటుంది!!!

"పదపద! మంచు కురుస్తోంది! లలితా! మంచం లోపల పెట్టించు!"

నాన్న గొంతు వెనకనించి వినిపిస్తోంది.

తండ్రి చెప్పిన మాటకోసం భర్త అయిన శ్రీకృష్ణ దేవరాయలను చంపడానికి సిద్ధపడిన స్త్రీలు పుట్టిన గడ్డ యిది. మనసు ఆలోచిస్తూనే వుంది.

భోజనాలు పూర్తయాయి.

అంతసేపూ నాన్నే మాట్లాడుతున్నాడు లలితా బావా అదోమాదిరిగా వున్నారు అమ్మ పాత్ర అర్థమే కాలేదు నాకు

"తోటవైపు వెళ్దామా? కాపలా సరిగ్గా వుందో లేదో చూడొచ్చు" అన్నాను. నాన్న దుప్పటీ కప్పుకుని కర్ర తీసుకొని బయల్దేరాడు.

మామిడి తోట గురించీ దాన్ని కొట్టించి వ్యవసాయం పెట్టడం గూర్చి చెప్తున్నాడు' మాకోసం ఒట్టి గడ్డితో కూర్చోటానికి తయారు చేసాడు సూరయ్య. వెచ్చగా వుంది గడ్డి. వాళ్ళిద్దరూ వ్యవసాయంగూర్చి చెప్పుకుంటు న్నారు. మామిడి చెట్లు పూతపట్టేక పూత నిలవటానికి ఏవో మందులు వచ్చాయంటు న్నారు. నాన్న ఓసారి అంతా పర్యవేక్షించి వచ్చాడు. ఆయన కూర్చోగానే అన్నాను.

"వరమూ బావ గురించీ నీకు తెలుసా?"

"ఊ!" అన్నాడు నవ్వుతూ.

"నీ వుద్దేశ్యం ఏమిటి?" సూటిగా అడిగాను.

"ఏముంది? పాపం! వరం మాత్రం మనిషి కాదా!"

"నీకు జాలేనా? మరేదయినా వుందా ?"

"అంటే ?"

"అంటే నీ అన్నగారిమీద కక్ష! రాజ కీయంలో తిరిగి ముందుకు రాకుండా ఆయనను చావు దెబ్బ కొట్టడం! ఏడిపించటం!"

"మూర్తీ !!'

నా గొంతుక ఆగిపోయింది.

"నేను వాడికి తమ్ముణ్ణిరా! ఒకే కడుపున పుట్టిన అన్నదములంరా!"

నా తెలివితేటలు ఆయనని అంచనా వెయ్య లేకపోతున్నాయి.

"—నాకు బుద్ధి లేదనుకుంటున్నావా?"

"బుద్ధుండే తప్పు చేయిస్తున్నావా ?"

"తప్పు ! నువ్వు తప్పంటున్నదేమిటి?"

"వాళ్ళ అక్రమ సంబంధం "

"అక్రమ సంబంధాలన్నీ తప్పులవుతాయా? వాటిని 'తప్పు' అనే భావం నీకు చుట్టూ వున్న మనుషులనుంచి సంక్రమించింది. నీకు గురువు చెలం కదా! యిలా మాట్లాడతావేంటి?"

ఆయన అపహాసిస్తున్నాడా?

"చలం కోరేది స్వేచ్ఛ! నిర్బంధం కాదు." అన్నాను.

"అవునా! నేనిచ్చిందీ స్వేచ్ఛే' ఎవరినీ నేను నిర్బంధించలేదు."

# బాలల సంక్షేమం మన ధ్యేయం

1979 సంవత్సరాన్ని అంతర్జాతీయ బాలల సంవత్సరంగా జరుపుకుంటున్నాం. ఈ సంవత్సరం మన రాష్ట్రంలో బాలల సంక్షేమానికి యింతక్రితమే ప్రవేశపెట్టిన పథకాలను మరింత శ్రద్ధతో అమలు జరపడంతో పాటు, అనేక కొత్త పథకాలను కూడ చేపడతారు.

ఆదిలాబాదు, అనంతపురం జిల్లాలలో రెండు బ్లాకులలో బాలల సమగ్రాభివృద్ధి సేవా పథకాన్ని అమలు జరుపుతున్నారు. ఈ పథకం క్రింద పౌష్టికాహారాన్ని సమకూర్చడం, విద్యావకాశాలు కల్పించడం ఆరోగ్యాన్ని మెరుగుపరచడం, వినోద సౌకర్యాలు కల్పించడంవంటి కార్యక్రమాలు అమలు జరుపుతారు.

1978-79 సంవత్సరంలో తూర్పుగోదావరి, వరంగల్లు, కృష్ణా, కర్నూలు జిల్లాలలోని మరో నాలుగు బ్లాకులలో ఈ పథకాన్ని చేపట్టడం జరిగింది. అంతర్జాతీయ బాలల సంవత్సరంలో విశాఖపట్నం, చిత్తూరు, మెదకు జిల్లాలలోని మరో మూడు బ్లాకులలో ఈ పథకాన్ని అమలు జరుపుతారు.

**డి. జి. స. పౌ. సం. శా.**

**43/78-79**






"నువ్వు వరాన్ని నిర్బంధించావు! బావను నిర్బంధించావు. వాళ్ళలో లేని ఉద్దేశ్యాన్ని పరిస్థితులతో కల్పించావు. ఆమెలో నిద్రపోతున్న వాంఛలను రేపి నీ స్వలాభానికి కక్షకీ ఉపయోగించుకున్నావు".

యీసారి నాన్న ఉద్రేకపడలేదు.

"నేను నా కూతురి జీవితం పాడుచేస్తానా? అయినా దాని జీవితం ఏమవుతుంది? నేను రక్షణగా వున్నానుకదా."

"మాట మార్చకు! స్వేచ్ఛగురించీ నిర్బంధం గూర్చీ మాట్లాడు! వరం బ్రతుకు పాడవుతుందా లేదా అన్నది వేరే ప్రశ్న. అది పూర్తిగా వేరే విషయం ! నా దృష్టిలో అసమర్థులకు తప్ప . బ్రతుకు పాడవటమన్నదే లేదు"

"అవునా! నేనూ అంగీకరిస్తున్నాను! బ్రతుకు పాడవటమన్నదే లేనపుడు యింక కొన్ని క్షణాల లైంగిక సంయోగంవల్ల ఒరిగే నష్టమేముంటుంది ?"

అతడు నన్ను మాట్లాడనిస్తున్నాడు. తన వాదనకి సరిపోయే మాట నా నోట దొర్లగానే దానికి వేరే అర్థాలు తీస్తున్నాడు!

"నే నన్నది పూర్తిగా వినలేనట్లుంది. బ్రతుకు పాడవటం సర్వనాశనం కావటంవటం వంటి వన్నీ వ్యక్తుల మానసిక స్థయిర్యానికి సంబంధించిన అంశాలు. నువ్వు వరం వయసునీ, లలిత శైశవాన్నీ, బావ వాంఛనీ ఉపయోగించుకుని నీ అన్నమీద దెబ్బ తీయటానికి ప్రయత్నించావు దానికి ఏ కడుపయినా వస్తే తల ఎత్తుకోలేగదుదా నలుగురిలోకి రాలేడుగదా—అని భావించావు!"

నాన్న కదల్లేదు.

"యిందులో చేయరానిదేదో చేసినట్లు అనవసరంగా ఊహించుకుంటున్నావు గానీ నన్ను సంస్కర్తగా ఎందుకు అనుకోవు? బాల్య వివాహాలని నిరోధించటం విధవా వివాహాలను ప్రోత్సహించటం ఒకప్పటి సంఘం—అవసరాలు! ఎందరో కన్నెలుగానే జీవితాలు ముగించివెయ్యటమో ఏ అలగావాడితోనో లేచిపోయి సానికొంపల పాలయి పురుగులు పట్టి రోడ్ల పక్క అనాధల్లా మరణించటమో యీనాటి దుస్థితి! యీ పరిస్థితినుంచి బయటపడటానికి నేనొక అడుగువెయ్యటం ముందడుగే అవుతుంది నేను సంస్కర్తనే అవుతాను"

"సం స్క ర్త!" గుండెలో పేరుకొం

# సాగులోకి మరింత భూమి

అందరికీ సరిపోయేటంత ఆహారం కావాలంటే ఎక్కువ భూమిని సాగుచేయాలి. ఈ విషయంలో నీటి సౌకర్యాల కల్పన ఎంతగానో ప్రాముఖ్యత వహిస్తుంది. అందుకే ఆంధ్రప్రదేశ్ బడ్జెటులో యిటీవలి కాలంలో అధిక భాగం నిధులను నీటి పారుదల ప్రాజెక్టులకు కేటాయిస్తున్నారు.

రాష్ట్రంలో నిర్ణీత ప్రాంతాలలో రు. 21.68 కోట్ల ఖర్చుతో ఆరు మధ్యతరహా నీటి పారుదల పథకాలను చేపట్టారు. మధ్య తరహా నీటి పారుదల సౌకర్యానికి అవకాశమున్న 22 లక్షల హెక్టారులలోనూ ఇంతవరకు 17.6 లక్షల హెక్టార్లలో నీటి వసతి కల్పించారు.

1979-80 సంవత్సరంలో రు. 680.26 లక్షల ఖర్చుతో అదనంగా 6350 హెక్టార్లకు నీటి పారుదల కల్పించాలని సంకల్పించారు.

**డి. జి. స. పౌ. సం. శా.**

44/78-79



(వి)చిత్ర విజ్ఞానం



సిఫిలిస్, గొనోరియా అనబడే సుఖవ్యాధులు ప్రపంచమంతటా దినదిన ప్రవర్థమానమౌతున్నాయి। 1975 వ సంవత్సరం వరకు అమెరికాలో మాత్రం సుమారు 30 లక్షల మంది ఈ వ్యాధులకు గురైనారని, డగ్లస్ కాలిగన్, SCIENCE DIGEST పత్రికలో పేర్కొన్నాడు। బంతి ఆకారంలో వున్న క్రిమి "గోనోకాకల్" క్రిమి. వెంటనే తగినమందులు వాడకపోతే ఇది స్త్రీ పురుషుల్లో వంధ్యత్వమును (sterility) కలిగిస్తుంది. మెలికలు తిరిగి తీగలా వున్న క్రిమి "సిఫిలిస్" క్రిమి. ఇది అత్యంత ప్రమాదకరమైనది।

---

టున్న అసహ్యం గొంతులో నిండింది.

"ముంద డుగు।" అంటూ నన్ను, నేను సంబాళించుకున్నాక—

"సంస్కర్త అంటే నీకు అర్థంకూడా తెలీదు "

కొంచెంసేపు ఊరుకొని "చలంని చదివావు కదా। నువ్వు అర్థంచేసుకొన్నదేంటి?"

"నీ వడిగేదీ అనదలచుకున్నదీ నాకు పూరాగా తెల్సు। చలం లైంగిక స్వేచ్ఛ వుండాలన్నాడంటావు "

"అదే అనుకున్నాను। వరానికి అవసరమైన దాన్ని సమకూర్చాను "

ఆయన దృఢత్వం కొద్దిగా బీటలువారింది. ఉద్రేకంతో అందుకున్నాను

"చూడు నాన్నా। ఒక్క విషయం అడుగుతాను। జాగ్రత్తగా విను। బాగా ఆలోచించు, వరాన్ని నీ ఆదర్శాలకి సంస్కరణకి ఎన్నుకున్నానంటున్నావు। బాగుంది. నువ్వు వరానికి యీ సూత్రాలగురించీ లైంగిక స్వేచ్ఛగురించీ వివరించావోలేదో ఆమెను అంగీకరింపజేసావో లేదో నేను అడగటం లేదు । చెల్లాయి లలిత వుంది. అది "స్త్రీ" అని చెప్పే అవయవాలు దానికి వున్నాయి. నేను "పురుషుడి" నని చెప్పే శరీర నిర్మాణం నాకు వుంది. దానికి యింకో పదేళ్ళదాకా పెళ్ళవకపోతే పాపం। అదీ వరంలాగే బాధపడుతుంది। అందువల్ల 'యింట్లో యింట్లోగనక తెలియదు. ఏదయినా జరిగితే మందో మాకో యివ్వటానికి నేనున్నానూ । నేను ముసిలాణ్ణి కనక, అన్నకీ చెల్లికీ కలిపేస్తే సరిపోతుంది' అనుకుని "

ఆగాను.

ఒక్కొక్కమాటా ఆయన శరీరంలోని అణువణువులోని రక్తాన్ని పీల్చివేస్తుంటే మొహం తెల్లనయిపోతున్నట్లుంది ఆయన వజవజా వణుకుతున్నాడు.

"నువ్వు అంగీకరిస్తానని చెప్పు నాన్నా. నీకు రెండు చేతులూ ఎత్తి మొక్కుతాను. ఈ మాటలు మాట్లాడినందుకు, యిలాంటి ఊహ చేసినందుకూ, యీ నా ధైర్యానికి రేపే నువ్వు చెల్లాయితో చెపుతావు నాతో ఏకాంతంగా వుండవద్దనీ, ఒకే మంచంమీద కూర్చోవద్దనీ."

మళ్ళీ అందుకున్నాను.

"అది వేరూ యిది వేరూ అంటావు బహుశా। కాని, దానికి జవాబు నా దగ్గరుంది. సంయోగానికి అవసరమయినవి శరీరాంగాలే కాదు. మనసుకూడా ముఖ్యం । లలితకి నేను అన్ననన్నీ, నాకు అది చెల్లెలనీ అన్నాచెల్లెళ్ళు కలియరాదనీ పుట్టిన దగ్గరనుంచీ మా రక్తంతో పుట్టి పెరిగిన భావం. ఆ భావాన్ని చంపి తామభావాన కలిగించటానికి కొంత ప్రయత్నం అవసరం। వరాన్నీ బావనీ కలపటానికి నీవు చేసిన ప్రయత్నాలకీ .. నన్నూ

చెల్లాయినీ కలపటాన్కి చేయాల్సిన ప్రయత్నాలకీ రూపంలో భేదం ఏమాత్రం లేదు! కాదంటే నీవు మరింత బలమయిన పరిస్థితులను సృష్టించాల్సి ఉంటుంది! ఏం! చెప్పు! అటువంటి భావం మామధ్య నువ్వు కలిగించగలవా? అందుకు యత్నించగలవా? "

నాన్న చేతిలో తురుఫాసు లేదు. ఆయన పడుతున్న బాధకు నిదర్శనంగా పెదాలు వణుకుతున్నాయి. ఎలాంటి స్థితిలోనూ నేలరాలని ఆయన నోట్లో చుట్ట నేల రాలింది. ఆయనలోనున్న అధర్మం నామీద ఉద్రేకపడకుండా చేసి వేసినట్టుంది. దొరికిపోయిన దొంగలా వున్నాడు.

"ఉహుం! నువ్వు జవాబివ్వలేవు నాన్నా! వాళ్ళ యిద్దరికీ మనసుల్లో కోర్కె వుండి, ఆ కోరిక తీర్చుకోనూ లేక అణుచుకోనూ లేక సతమత మవుతుంటే యిద్దరికీ లైంగిక స్వేచ్ఛ గూర్చి చెప్పి, వాళ్ళే ఒక నిశ్చయం తీసుకునేటందుకు తగిన మనోధైర్యం కల్పించటం ఒక విషయం! బావ ఎలాంటివాడో నాకు బాగా తెలుసు. మగవాడికి సైతం శీలం అవసరమన్న అభిప్రాయం గల వాడు. అంత బలమయిన అభిప్రాయం వున్నప్పుడు ఎందుకు లొంగిపోవాలంటావు? మనుషులకి అభిప్రాయాలు నిలబెట్టుకొనే దృఢత్వం లేనంతమాత్రాన అభిప్రాయాలే వుండరాదనటం అక్రమం! అతని అభిప్రాయాలను మార్చే ప్రయత్నం ఎందుకు చెయ్యాలి? నీ ప్రయత్నాలకు చలం భావాలను అప్లయిచేసి నాతో వాదిస్తున్నావా! నేను లైంగిక నియమాలను అంగీకరించను. అంత మాత్రంచేత, ఆ నియమాలను తలదాల్చేవారిని నేను కొట్టి పారెయ్యను. మనసులో కోర్కెలుంచుకుని బరిదాటలేని అమాయకులనిగూర్చి జాలిపడటంలో అర్థం వుంది. లోకానికి భయపడి 'తప్పుడు పనులు' అనబడేవాటిని దొడ్డిదోవల్లో చేయటాన్నీ అందులో వుంటే పురుషుడి మోసాన్నీ—'తప్పు' అని ఖండించటం వల్ల ప్రయోజనం వుంది. సెక్సు సంబంధాలు వ్యక్తులకు పరిమితమయినవి కావు అవి సాంఘిక గమనంతో బలంగా ముడిపడి వున్నాయనీ విశ్వసించేవారిని, వారు ఊహించుకునే వున్నత పథంనుంచి క్రిందకి యీడ్చి వాళ్ళకు లైంగిక స్వేచ్ఛ నిచ్చానని కబుర్లు చెపుతూ 'సంస్కర్త'నని వాదించటంలో ప్రయోజనం లేదు సరికదా నీ దుష్టబుద్ధే వుంది.

నాన్నా! తండ్రితో యిలా కొడుకు మాట్లాడే పరిస్థితిని నీ చేతులతో నీవే తెచ్చుకున్నావు. యిప్పటికయినా నీ అన్నగారిమీద కక్ష తీర్చు కోటం కోసం వరంలాంటి అమాయకురాలి కోర్కెలను వాడుకోకు! యింకా నయం, నీ మనసులో నున్న 'జాలి'తో నీ అన్న కూతురి వాంఛలకోసం—చలం కథలోలా — నువ్వే సిద్ధం కాలేదు!

ఒకవేళ ఆ ఉద్దేశంకూడా నీకు వున్నదేమో! అందుకు యిది ఒక ప్రయత్నమేమో!!" ఆవేశాన్ని అణుచుకోటాన్కి కాసేపు ఆగాను.

"నీకు నిజంగా జాలే వుండివుంటే దాని వివాహానికి అవసరమైన డబ్బు యిచ్చివుండేవాడివి గాని యింత వికృతంగా ప్రవర్తించి వుండేవాడివి కాదు. నిన్ను తండ్రిగా అంగీకరించాలంటేనే అసహ్యం కలుగుతోంది "

ఆయనని అక్కడే వదిలేసి ఇంటిమొహం పట్టాను. ఆయన పట్ల ఏవగింపుతో నిలువెల్లా నిండిపోయింది.

'జరిగిన దాని' గూర్చి యింత బాధపడే నాలో 'జరగవలసిన' దేమిటన్న ప్రశ్న అప్పుడప్పుడు మెదుల్తోంది.

ఆ రాత్రి నిద్రపోలేకపోయాను.

వరం నా కళ్ళముందు మెదుల్తోంది. ఆమె మనస్ఫూర్తిగా అంగీకరిస్తే పరిస్థితి వేరు. యిక్కడ కోర్కెలు తీర్చుకుంటూ యింటికి పోయి తనుచేసే పనికి తనను తను నిందించుకుంటూ కుమిలిపోతున్నట్లయితే ఆ పరిస్థితి వేరు. వరంమీద జాలితో నా గుండె నిండి పోయింది.

మర్నాడు వరాన్ని మా తోటలోకి తీసుకుపోయాను దాన్ని ఓదార్చాలి, దానికి బ్రతుకు పట్ల ధైర్యమివ్వాలి అన్న నిశ్చయంతో.

"చూడు వరం!"

వరం తన విశాలమయిన కళ్ళను ఎత్తి నేల మీంచి నా వయిపు దృష్టి మరల్చలేదు. దాని 'రహస్యం' నాకు తప్ప మరెవరికీ తెలియ దన్నట్లు భయపడిపోతోంది.

"సిగ్గుపడకు వరం! నువ్వు చేసినది తప్పు కానేకాదు "

ఒక్కమారుగా వరం నన్ను కౌగలించుకొని ఏడవటం ప్రారంభించింది. అంతలోనే పక్కనున్న రాతిమీద తల కొట్టుకోటాన్కి ప్రయత్నించింది. అందునించి ఆమెనుంచి అపుతుంటే ఆమె పిచ్చి ఆవేశానికీ బలానికీ నాకే ఆశ్చర్యం వేసింది. వీపుమీద రాస్తూ కూర్చున్నాను.

ఆమె ఏడుపు సన్నగిల్లాక అన్నాను.

"బాధపడకు! విషయంలోకి వద్దాం!"

"యింకేం విషయం? నా బ్రతుకు నాశన మయిపోయింది. ఒళ్ళూ పయీ తెలీకుండా ప్రవర్తించాను. నన్నెవరయినా పెళ్ళాడుతారా? పెళ్ళాడినా యీ విషయం దాచుకొని యీ అపవిత్ర దేహంతో కాపురం చెయ్యగలనా? నేను బ్రతకటం అనవసరం " నిరాశే నిండిన గొంతు!

మనిషికి ఆలోచన, స్వవిమర్శ ఆత్మీయుల పరామర్శనుంచే వస్తాయిట!

రాత్రంతా చేసుకున్న రిహేర్సల్స్ గుర్తు చేసుకుంటూ ఆరంభించాను.

యిదేమంత ఘోర నేరం కాదన్నాను. యిలాంటివి చాలామంది జీవితాల్లో సామాన్య మయిన విషయాలే అన్నాను. ఎవరూ దీనికి అనవసర ప్రాధాన్యత యివ్వరాదన్నాను. ఎవరి బ్రతుకును వారే నిర్ణయించుకోవాలనీ, బ్రతుకును నిందించుకోటంలోనూ . అది వద్దనుకోటం లోనూ క్షమించరాని మూర్ఖత్వమున్నదనీ, ధైర్యంగా ఎవరి సమస్యలను వారే పరిష్కరించుకోవాలనీ! సమస్యలు వచ్చినపుడే గుండె నిబ్బరం అవసరమనీ; 'తప్పు' అనుకుంటున్నది చేయటంకన్న దాన్నుంచి బయటకు రావడమే గొప్పతనమనీ చాలా చెప్పాను. చాలాసేపు చెప్పాను. చాలా మాటలు ప్రయోగిస్తూ చెప్పాను. ఆమెకు ఓదార్పు; ధైర్యం, ఆలోచన వంటివి యివ్వటానికి యత్నించాను.

నా మాటలు నాకు తృప్తి కలిగించాయికాని ఆమెలో చలనం కలిగించలేదని చిన్న అనుమానం వచ్చింది. నేను మాట్లాడుతూనే వున్నాను. ఆమె వింటూనే వుంది.

"వస్తానురా!" అంటూ వెళ్ళిపోయింది.

వరం వెళ్ళిపోడంలో, ఆ నడకలో, ఆ కనులలో ఏదో బలమైన నిర్ణయం; అటూ ఇటూ ఊగే మనసూ రెండూ నాకు స్పష్టంగానే కనుపించాయి.

ఆమె నిర్ణయం ఏమిటో నా ఊహకు అందలేదు.

మరోమారు వెనక్కి పిలిచి మాట్లాడాలి అనుకున్నాను. ఇంతకన్న ఏం మాట్లాడతాను? ఏం చెయ్యగలుగుతాను? అందుకే వూరుకొన్నాను.

మర్నాటి ఉదయానికి ఆమె నిర్ణయమేమిటో ప్రపంచమంతటితోబాటు నాకూ తెల్సిపోయింది.

పిచ్చివాడిలా పరుగెత్తాను.

ఆత్మీయుల రోదనలమధ్య విరగగొట్టబడిన తలుపుల మధ్య గది మధ్య నేలమీద పడుంది వరం! ఆమె కక్కిన రక్తం ఆమె తాగిన ఎండ్రిన్ డబ్బా రాత్రంతా ఆమెబడిన నరక యాతనను విప్పి చెపుతున్నాయి. అందమయిన వరం భయానకమయిన చావును వరంగా పొందింది.

అయితే ఆమె చావుకు కారణం ఆమె పిరికితనమా? నేనామెకు ధైర్యాన్ని కలిగించలేక పోవటమా?

ఆమె ప్రశ్నలనూ నా జవాబునూ పదేపదే గుర్తు చేసుకొన్నాను. నా కళ్ళముందున్న పొరలు కొద్దిగా తొలగుతున్నాయి.

ఒకరిమీద కక్ష తీర్చుకోటం కోసం 'సెంటిమెంట్స్'ను నా తండ్రి తెగ నరుక్కున్నంత సులువుగా—ఒకరిని రక్షించటంకోసం నేను తెగ నరుక్కోలేక పోయానన్న విషయం నా గుండెలో శల్యంలా నాటుకుంది !

ఆచరణకూ ఆలోచనకూ ఎంతదూరం!!! □

సీరియల్



కాలింగ్ బెల్ అదే పనిగా మోగుతోంటే ఆ వచ్చింది మీరాయే అని గబగబా వచ్చి తలుపు తీసింది. ఇంట్లో అరుణా తాయారమ్మా వున్నారు.

వచ్చింది మీరా కాదు—మూర్తి. గబగబా వచ్చిన అరుణ టక్కున ఆగిపోయింది. మూర్తి ఎప్పుడూ అరుణని అనురాగ దృష్టితోనే చూస్తాడు.

ఇది అరుణకి ఏమాత్రం తెలియదు.

మూర్తి ఏం అడగకపోయినా మూర్తి శేఖరం కోసమే వస్తుంటాడు గనుక అడగకుండానే "అన్నయ్య లేడండీ! ఇప్పుడే ఎక్కడికో వెళ్ళాడు" అని చెప్పేసింది.

మూర్తి ఎప్పటిలా వెళ్ళిపోలేదు. "ఎప్పుడొస్తాడు" అరుణని చూస్తూ అడిగాడు.

"ఏమో! తెలియదండీ!" చాలా మామూలుగా చెప్పేసింది.

"పోనీ ఎక్కడికి వెళ్ళాడో తెల్సా" ఈసారి అతని కళ్ళు నవ్వుతున్నాయి.

"ఊహూ" పెదాలు బిగించి తల వూపింది.

అయినా మూర్తి కదల్లేదు.

ఏదో చెప్పాలనుకొన్నది చెప్పలేనన్నట్లుగా నిలబడిపోయాడు.

అన్నయ్య లేడన్నా వెళ్ళదేమిటి? తొందరగా వెళ్ళిపోతే బాగుండు ననుకొంటూ చాలా ఇబ్బందిగా నిలబడింది అరుణ.

చివరికి మూర్తి ధైర్యం చేసి ఏదో ఒకటి మాటాడాలన్నట్లుగా అన్నాడు. "మిమ్మల్ని అమ్మా, వదినా ఓసారి రమ్మని చెప్పమన్నారు."

అరుణకేమిటో ఈరోజు అతని ప్రవర్తన కొత్తగా కనపడుతోంది.

"అలాగే" అన్నట్లుగా తలూపింది.

ఇలాంటమ్మాయితో ఇంకెలా మాటలు పెంచాలో మూర్తికి అర్ధం కాలేదు. ఎందుకో తెలియదు గాని, ఆ అమాయకత్వమే అతణ్ని ముగ్ధుణ్ని చేస్తుంది.

"శేఖరం వచ్చేకా ఓసారి రమ్మన్నానని చెప్పండి" అన్నాడు.

"అలాగేనండీ!" ఎలాగో గొంతు పెగల్చుకొని అంది.

మూర్తి వెళ్ళిపోయాడు.

మూర్తి వెళ్ళిన గంటకి శేఖరం వచ్చేడు.

అరుణ మూర్తి వచ్చి వెళ్ళిన సంగతి చెప్పింది.

"ఇంకేమన్నాడు?" శేఖరం అరుణకేసి పరీక్షగా చూస్తూ అడిగాడు.

"నిన్నోసారి రమ్మని చెప్పేరు" ఎప్పటిలా చాలా మామూలుగా అంది.

"మూర్తి ఎలాంటివాడు అరుణా!" అని అడిగాడు.

అకారణంగా అలా అడగడం అరుణకి అర్ధంకాలేదు.

"ఏమో! నాకేం తెలుసూ" అంది.

"అసలు నీకెలా అన్పిస్తున్నాడని "

అరుణ అర్థం కానట్టు చూసింది.

"చెప్పు, అరుణా!"

"కొత్తగా అడుగుతున్నావే! నాకెలా అన్పించడం ఏమిటీ!' నిజంగానే అరుణకి అన్నగారు అలా ఎందుకు అడుగుతున్నాడో అర్ధంకాలేదు

"ఇంకా చిన్న పిల్లవా అరుణా! నేను అడిగింది నిజంగా నీకు అర్ధం కాలేదా?" అరుణ కళ్ళల్లోకి చూస్తూ అడిగాడు.

మొదట తెల్లబోయిన అరుణ తర్వాత ఏదో అనుమానం కలిగి కళ్ళు కిందకి వాల్చేసు కొంది. ఇంతకు ముందు మూర్తి మాటలు కొంచెం కొత్తగా అన్పించటం — ఇప్పుడు శేఖరం మూర్తి గురించి అలా అగడటం—ఏదో కొత్త అర్థాలని చెప్తున్నాయి.

"అమ్మ రాసిన వుత్తరం చూశావా? నేను ఇవ్వనేలేదు కదూ!" ఉంటూ తల్లి దగ్గరనుండి నాలుగు రోజుల క్రితం వచ్చిన ఉత్తరాన్ని పాంటు జేబులోంచి తీసి ఇచ్చేడు. ప్రసంగం మారి నందుకు సంతోషిస్తూ, ఉత్తరం చదువుకోవడం మొదలెట్టింది అరుణ.

ఉత్తరంలోనూ అవే సంగతులు "నువ్వు మూర్తి అనే అబ్బాయిగురించి వ్రాశావు. అరుణకి నచ్చి నీకూ, అన్నయ్యకూ ఇష్టమైతే నాకేం అభ్యం రం లేదు" ఇలాగే ఇంకా రాసిం దావిడ.

అంటే ఈ సంగతులు చాలా రోజులనించి జరుగుతున్నాయన్న మాట.

"ఇప్పుడు అర్థమయిందా?" నవ్వుతూ అడిగాడు శేఖరం.

అరుణ మాట్లాడలేదు.

"అరుణా! నీ కిష్టమేనా? ఇందులో భయపడాల్సిందిగాని, సిగ్గుపడాల్సిందిగాని ఏం లేదు. నీ మనసులో మాట నిర్భయంగా చెప్పు! నీ అభిప్రాయం చెప్తే అప్పుడు అన్నయ్యకు చెప్తాను."

అరుణ మౌనంగానే వింది.

కుసుమ తల్లి రాసినదానికి రెండు రోజులు ఆలస్యంగా కుసుమ పెద్దబాబాయి చలపతి వచ్చేడు. అత్తగారు ఉత్తరం రాసినట్లు రాజేంద్రకి కూడా తెలియదు.

ఎప్పుడూ ఎక్కడికీ కదలని మేనమామ హఠాత్తుగా వూడిపడటంతో రాజేంద్రా, అరుణా తెల్లబోయారు. చాలా సంతోషించారుకూడా.

"ఏమిటి మావయ్యా! ఇంత విడ్డూరప్పని చేశావు! రేపటినుండి పగలు సూర్యుడే ఉదయిస్తాడా?" అన్నాడు రాజేంద్ర.

"పగలు సూర్యుడే ఉదయిస్తే గొప్పేముందిరా!" ఆయనా హాస్యం చేశాడు.

అరుణ తనే కాఫీ చేసి తీసుకొచ్చింది.

కుసుమ లోపల కోపంగా వున్నా పైకి ఆప్యాయంగా మాట్లాడుతోంది.

"ప్రకాశం మావయ్య ఊళ్ళోనే వున్నాడా!" రాజేంద్ర అడిగాడు.

"అన్ని వూళ్ళూ వాడివేగా! ఏదో ఒక వూళ్ళో వుంటాడు."

"ఇందిర అత్తారింటికి వెళ్ళిపోయిందా?"

"ఆc! అది వున్నప్పుడు నెలకి పదిహేను రోజులయినా ఇంట్లో వుండేవాడు. ఇప్పుడు ఒక్కో నెల రానేరాడు. అడిగేవాళ్ళు ఎవరు."

"రామూ, సోమూ ఎలా వున్నారు?"

"చిన్నవాడే దుడుకురా! ప్రతీ దాంట్లోనూ తల దూరుస్తాడు. ఇలాంటి విషయాలన్నీ చిన్నవాడివి నీకెందుకురా అని మొన్నోసారి చెప్పబోతే ఏమన్నాడో తెలుసా? 'ఒక్క నెలరోజులు మా నాన్నని ఎక్కడికీ వెళ్ళకుండా ఆపు! అప్పుడు పెద్దవాడివని నీ మాట గౌరవించి, నే చేసింది తప్పు అని అనిపించిన పని మళ్ళీ చేస్తే అడుగు' అన్నాడు."

"అదేమిటీ!"

"ఆc! ఏముందీ! మా నాన్నకి చెప్పలేవుగాని నాకు చెప్పొచ్చావా అని."

"బాగుంది" అన్నాడు రాజేంద్ర.

ఇదంతా చాలా విసుగ్గా వుంది కుసుమకి.

"స్నానం చేద్దువుగాని లే, మావయ్యా!" అంది అరుణ.

ఆయన లేచి నాలుగు అడుగులు వేసినవాడల్లా ఆగి, "అరుణకి సంబంధాలు చూస్తున్నారా? మీ పిన్ని ఎప్పుడొస్తుందీ!" అని అడిగాడు.

"ఆవిడ ఎప్పుడొచ్చేదీ ఇంకా రాయలేదు" అన్నాడు రాజేంద్ర.

చలపతి స్నానంచేసి వచ్చేడు. కుసుమ పక్కన సుందరి కూర్చునుంది.

"ఈ అమ్మాయి ఎవరూ?" అని అడిగాడు.

"మా పిన్ని కూతురు" ముక్తసరిగా చెప్పింది కుసుమ.

"పిన్నంటే! మీ పిన్నికి నలుగురూ మగపిల్లలేనేమో!"

"ఆనందం పిన్ని కూతురు."

"ఆనందం కూతురా!" అన్నాడు.

అదివరకు ఏదో పెళ్ళికి వచ్చినప్పుడు ఆనందం కూతుర్ని శేఖరానికి చేసుకోమని వాళ్ళు అడగటం ఆయనకి గుర్తొచ్చింది. "ఇప్పుడు అందుకే పంపారా!" అనుకొన్నాడు. అలా అను



కొన్నాక వచ్చినపని తొందరగా—కుసుమ లేకుండా చెప్పడం మంచిదనుకొన్నాడు.

భోజనాలయి ఇవతలకి వచ్చేక కుసుమ లేకుండా చూసి చెప్పాడు రాజేంద్రతో "కుమారికి ఈ సంవత్సరం పెళ్ళి చేసేయాలనుకొంటున్నారా" అని.

"అహాఁ! చూస్తున్నావా? కుదిరిందా?" అన్నాడు రాజేంద్ర.

"నీ మొహం! కుదిరితే నీ దగ్గరికి ఎందుకొస్తాను?" అని మనసులో అనుకొని, "నువ్వే కుదర్చాలి" అన్నాడు పైకి.

"నేనా!" అర్థంకాక ఆశ్చర్యంగా చూశాడు రాజేంద్ర.

"నువ్వే మరి! అదివరకు మీ పిన్నికి చెప్తే "వాడిష్టం" అంది. శేఖరాన్ని అడిగితే ఇప్పు డప్పుడే పెళ్ళి చేసుకొనే తలంపు లేదన్నాడు నీ తమ్ముడికి చెప్పి నువ్వే వప్పించాలిరా! కుమారిని ఇక్కడికి తీసుకొచ్చి చూపించమంటే చూపిస్తాను" చాలా ఇదిగా చెప్పాడు.

"వాడికి ఇష్టమైతే నాదేముంది మావయ్యా! పిల్లని చూసేదేముంది! కొత్తపిల్లా ఏమన్నానా?"

"అహాఁ! అలా అనకు. వాడూ కుమారిని చూసి నాలుగయిదేళ్ళు అయింది. చూసుకోవటం మంచిదే!" రాజేంద్ర మాట్లాడలేదు.

"ఏరా! ఏమంటావ్" అన్నాడాయన.

"నేనేం చెప్పను మావయ్యా! వాడొచ్చేకా అడుగుదాం" అన్నాడు.

"ఏమిటీ" అంటూ కుసుమ అక్కడికి వచ్చింది. రాజేంద్ర చెప్పేడు.

ఇంక బాగుండదని చలపతి అన్నాడు "మీరిద్దరూ చెప్పి శేఖరాన్ని వప్పించాలమ్మా!"

"వప్పిస్తా కూర్చో!" మనసులో పళ్ళు నూరుకొంది. పైకి అంది. "అతను మా మాట వింటాడా బాబాయ్! నువ్వడుగుతే ఇష్టం లేకపోతే ఇష్టంలేదని చెప్పనన్నా చెప్తాడు కానీ, మాకు అదీ చెప్పడు. ఆతని తరహా మొదట్నుంచీ అంతే! ఇప్పుడు మరీను" గబగబా చెప్పేసింది.

రాజేంద్ర పేపర్లో మొహం దూర్చుకొన్నాడు.

ఎరక్కపోయి చెప్పాన్రా బాబూ! అనుకొన్నాడు చలపతి.

"నువు కాస్సేపు పడుకొంటావా బాబాయ్!" అంది.

"ఆఁ!" నీరసంగా అని లేచేడు. ఆయన గదిలోకి వెళ్తూ అడిగాడు "శేఖరం ఎప్పు డొస్తాడూ!"

రాజేంద్ర తలెత్తి చెప్పేలోపల కుసుమే చెప్పింది "అతనికి తోచినప్పుడు వస్తాడు— ఒక్కోరోజు రాడు."

ఆయన వెళ్ళి పడుకొన్నాడు.

"అలా ఎందుకు చెప్పావ్? శేఖరం ఇంటికి రాకుండా ఎక్కడికి పోతున్నాడు" అన్నాడు రాజేంద్ర. అతనికి కొంచెం కోపం వచ్చింది. కాని పైకి అదేం కనపర్చలేదు. మామూలుగానే అడిగాడు.

"మీకు మతిమరుపుకూడానా, ఖర్మ! ఆ మధ్య రెండుసార్లు రెండుమూడు రోజులు రాలేదు" విసుగ్గా, కోపంగా అంది.

"ఏ వూరన్నా వెళ్తే రాడుగాని, వూళ్ళో వుంటే ఎందుకు రాడూ!"

"పాపం! మీరలాగే అనుకొంటూ వుండండి — ఇంకా మీ తమ్ముడు బుజ్జి పాపాయను కొంటున్నారు" అంది.

పక్కగదిలో పడుకున్న చలపతి మామయ్య ఎక్కడ వింటాడోనని రాజేంద్ర భయ పడ్డాడు. అసలు ఆయన వినాలనే కుసుమ గట్టిగా అంది.

పక్కగదిలో పడుకున్న చలపతికి ఇదంతా అగమ్యగోచరంగా అన్పించసాగింది. "శేఖరం ఇలాంటివాడా!" అన్న అనుమానంకూడా వచ్చింది.

"వాడెప్పుడూ అలా చెయ్యడు. తెలియని విషయాలు మాట్లాడకు" విసుగ్గా మావయ్య ఎక్కడ వింటాడోనని చాలా నెమ్మదిగా అన్నాడు రాజేంద్ర.

"ఆఁ! మహా అన్నీ మీకు తెలుసు—విజ్ఞులు" చాలా ఈసడింపుగా అని విసురుగా అక్కడనించి వెళ్ళిపోయింది కుసుమ.

నాలుగు గంటలవుతుండగా ఇంటికి వచ్చిన శేఖరంకూడా చలపతిగారి రాకకి ఆశ్చర్య పోయాడు. ఆప్యాయంగా—వినయంగా మేనమామని పలకరించేడు.

'వీడిగురించేనా అన్ని ఆలోచించేను,' అనుకొన్నాడాయన.

కుసుమ శేఖరం గురించి అన్న మాటలు ఆయనలో అనేక రకాల అనుమానాలని రేపి ఎం తోచకుండా చేసింది. 'అయినా ఏం తెలుస్తుంది. పైకి ఇలా వున్నవాళ్ళే కొంపలు కూలుస్తారు' అనిపించింది. ఎందుకోకాని ఆ ఆలోచన ఆయనలో ఆట్టేసేపు నిలవలేదు.

ఓ గంట సేపు మేనమామతో కబుర్లు చెప్పి స్నానంచేసి, "అలా తిరిగొద్దాం వస్తావా మావయ్యా!" అని అడిగాడు శేఖరం. ఆయనే వెంటనే "సరే" అన్నాడు.

దారిలో శేఖరం మేనమామని ఎన్నో విషయాలు అడిగాడు. ప్రకాశం మావయ్య కుటుంబం గురించి బాధని వ్యక్తంచేశాడు.

మాటల సందర్భంలో అడిగినట్టుగా శేఖరాన్ని ప్రస్తుతం ఏం చేస్తున్నాడో—ఏం చేయ దలుచుకున్నాడో అడిగాడు.

శేఖరం ఆయన అడిగిన వాటికి ఓపిగ్గా, వినయంగా బదులిచ్చాడు.

ఆయన్ని అటూ, ఇటూ తిప్పి రాత్రి ఎనిమిది గంటలకి ఇంటికి తీసుకొచ్చాడు.

చలపతి బాబాయ్ తన చమత్కారంతో శేఖరానికి ఏం నూరిపోశాడోనని కుసుమకి ఆందోళ నగా వుంది.

శేఖరం మేనమామతో తిరగటంవల్ల హోటల్లో భోజనం చేయడం కుదరలేదు. సాధా రణంగా ఇంటికి ఎవరేనా వచ్చినప్పుడు అతను ఇంట్లోనే భోజనం చేస్తూంటాడు. ఆ వచ్చినవాళ్ళ

## (వి)చిత్ర విజ్ఞానం




ఘనం తలను పైకి కిందకి ఊపితే దాని అర్థం "ఔను" అని: యీ సంజ్ఞ ప్రపంచంలో అన్ని దేశాల్లోని అన్ని భాషల ప్రజలలోనూ వాడుకలో వున్నది. అంటే ఈ సంజ్ఞకి భాషతో ప్రమేయం లేదు. యీలాంటి సంజ్ఞలు మరి కొన్నికూడా వున్నాయి. ఉదహారణకి "కాదు" అనడానికి తల అడ్డంగా వూపడం: "చక్కగా వుంది" అనడానికి చేతి బొటనవేలు, చూపుడు వేలు మొనలను దగ్గరకి చేర్చి గుండ్రంగా చూపడం లాంటివి: ఈ సంజ్ఞలన్ని మానవ సహజమైన జన్మలక్షణాలు!! అందుచేత పుట్టు గుడ్డి, చెవిటివాళ్ళు కూడ యీ సంజ్ఞలను ఎవరూ నేర్పకుండానే ఉపయోగిస్తారు!!

---

ఒకటి రెండు రోజులుకాక ఇంకా ఎక్కువ రోజులున్నట్టయితే పనివున్నవాడిలా తప్పించుకొంటాడు. ఇలాంటి సమయాలలో శేఖరంపట్ల రాజేంద్ర మనసు ఆర్ద్రతతో నిండిపోతుంది.

మర్నాడు చలపతి అందరూ వుండగానే తను వచ్చిన పని శేఖరంతో అన్నాడు, "అదివరకు మీ పిన్నితో చెప్తే "

"మావయ్యా!" బాధగా అన్నాడు శేఖరం.

ఆయనకి చటుక్కున గుర్తొచ్చింది. తను పొరపాటుగా మాట్లాడినట్లు నొచ్చుకొన్నాడు. అందులోనూ ఇలాంటి సందర్భంలో తను చాలా శ్రద్ధగా ప్రవర్తించాలి అనుకొన్నాడు.

శేఖరానికి "మీ పిన్ని" అని ఎవరన్నా అన్నారంటే చాలా బాధపడ్తాడు.

అందుకే కుసుమ చాలా కోపంగా వున్నప్పుడు "మీ పిన్ని" అంటూ చెప్తూంటుంది. దానికి శేఖరం వూరుకోడు, ఆవిడ తెలిసి కావాలని అన్నందుకు నాలుగురోజులు గుంజుకొనేలా చురకలాంటి మాట ఒకటి అంటించి మరీ వదుల్తాడు.

అసలు శేఖరానికి తల్లి—సవతి తల్లి అని తనకి పది సంవత్సరాలు వచ్చేవరకూ తెలియనే తెలియదు అప్పుడు ఏదో పెళ్ళిలో—పిల్లల కొట్లాటలలో శేఖరం, "మా అమ్మకి చెప్తాను" అని గర్వంగా ఒకటికి నాలుగుసార్లు అనటంతో కుసుమ తల్లి "నీకు ఆవిడ అమ్మకాదు—సవతి తల్లి" అని వివరంగా చెప్పింది.

శేఖరానికి ప్రపంచమంతా గిర్రున తిరుగుతున్నట్లయింది ఎలాగో శక్తిని కూడదీసుకొని "అబద్ధం—అబద్ధం" అని అరిచాడు.

పిల్లలందరికీ అది వినోదంగా అన్పించింది. నవ్వటం మొదలెట్టారు.

"పోయి మీ పిన్నిని అడుగు, చెప్తుంది" అంది కుసుమ తల్లి ఇంకా నవ్వుతూనే.

శేఖరం సుడిగాలిలా దూసుకొచ్చేడు తల్లిదగ్గరికి. ఆ అవతారం చూసి శాంతమ్మ కంగారుపడి, "ఏమిటి చినబాబూ: ఎందుకలా వున్నావ్?"

అంత దూకుడుగా వచ్చిన శేఖరం తల్లిని ఏమీ అడగలేకపోయాడు.

తల్లి ఒళ్ళో తలదాచుకొని నిశ్శబ్దంగా రోదించసాగాడు.

తర్వాత ఆవిడ చంటి పిల్లాడిని లాలించినట్లు లాలించి బుజ్జగించి అసలు విషయం తెలుసుకొంది. ఆవిడ మనసు గిలగిల్లాడింది

శేఖరం తేరుకుని మళ్ళీ మామూలుగా అవటానికి మూడురోజులు పట్టింది.

కాదు అబద్ధమని మొదట శేఖరానికి చెప్పినా తర్వాత నెమ్మదిమీద అంతా వివరంగా చెప్పి, "చినబాబూ! నేనెప్పుడూ ఆ దృష్టితో చూడలేదు—అసలు మీరు నా కన్నపిల్లలుగానే కని పిస్తారు. అన్నయ్య పిన్నీ అన్నప్పుడు మినహాయిస్తే నాకా విషయమే గుర్తురాదు "

ఇప్పుడా విషయం చలపతికి గుర్తుకొచ్చింది. ఆయన వెంటనే తేరుకొని, నొచ్చుకొన్నట్లుగా అన్నాడు "రాజేంద్రతో అన్నట్లు అనేశారా—ఏమీ అనుకోకు."

శేఖరం మాట్లాడలేదు.

పెళ్ళిమాటలకి లోలోపల మండిపడుతున్న కుసుమకి ఇది చాలా వినోదంగా వుంది. అవిడేం పూరుకోలేదు "ఇందులో బాధపడవలసిందేముంది బాబాయ్! అనుకోవటానికి ఏముంది ?"

"వదినా! " విసురుగా ఏదో అనబోయిన శేఖరం రాజేంద్ర కంగారుగా తనకేసి చూడ్డం గ్రహించి వెంటనే లేచి అక్కడనుండి వెళ్ళిపోయాడు.

అరుణ బాధగా చిన్నబుచ్చుకొన్నట్లుగా నేలచూపులు చూస్తూ కూర్చుంది. వెంటనే అక్కడ నుంచి వెళ్ళిపోతే బాగుండదని కూర్చుంది కాని, ముళ్ళమీద కూర్చున్నట్లుగా కూర్చుంది.

శేఖరం అలా కోపంగా అరిచి వెళ్ళిపోవటం కుసుమకి ఒళ్ళు మండింది.

"అమ్మ-అమ్మ అని మహా బాగా పెంచింది" ఈసడింపుగా అంది.

అరుణ ఇంక అక్కడ వుండలేక లేచి వెళ్ళిపోయింది

"వాడికా మాటంటే కోపం వస్తుందని-బాధపడ్తాడని తెలిసి ఎందుకలా మాట్లాడతావూ?" అన్నాడు రాజేంద్ర.

"నేనే మన్నాను మధ్య! బాబాయ్ అంటే!" కస్సుమంది కుసుమ.

"మావయ్య పొరపాటునన్నాడు, దానికి వాడేమననేలేదు. నువ్వెందుకూ కలగజేసు కోవడం?"

"అవును! చేయడానికి పనికొస్తానుకాని చిన్నమాట అనటానికి పనికిరాను."

రాజేంద్ర ఏదో అనబోయాడు.

చిలికి చిలికి ఇది గాలివాన అయ్యేటట్లు వుందనుకొన్నాడు చలపతి. ఇద్దరికీ చెప్తున్నట్లుగా అన్నాడు "ఇందులో ఎవరన్నదీ ఏం లేదు. పూరుకోండి. అనక వాడికి నేను సర్దిచెప్తాను."

కుసుమ కోపంగా వెళ్ళిపోయింది.

చలపతికి చాల నిరుత్సాహం కలిగింది మొదట్లోనే శేఖరం మనసు బాధపడిందని. శేఖరం పూర్తిగా తేరుకొంటేనే కాని పెళ్ళిమాట అడగకూడదనుకొన్నాడు. నాలుగు రోజులు ఆలస్యం అయినా సరే ఏదో ఒకటి తేల్చుకొని వెళ్ళాలనికూడా అనుకొన్నాడు.

*　　　*　　　*

రెండు రోజుల తర్వాత చలపతి శేఖరాన్ని అడిగేశాడు "అప్పుడు మీ అమ్మని అడిగితే నీ ఇష్టమందిరా! ఇప్పుడు రాజేంద్రా అదేమాట అన్నాడు నీకెప్పుడు వీలుంటుందో మరి—కుమారిని చూసి నువు నాలుగయిదేళ్ళు అయింది గాబట్టి వచ్చి చూసుకొంటే "

"నే ననుకొన్నది ఏదీ స్థిరంకాలెదు మావయ్యా! మొన్న నీకు చెప్పానుకదా! అరుణ పెళ్ళి అయితేగాని నేను చేసుకోదల్చుకోలేదు."

"అరుణ పెళ్ళికీ దీనికీ ఏమిటిరా లంకె. మీ ఇద్దరన్నదమ్ములకి అది గారాబు పట్టే! నీ వివాహం దానికి ఆటంకమా?"

"పూర్తిగా ,అదే కారణం కాదులే మావయ్యా! ఇప్పుడప్పుడే చేసుకోవాలని లేదు. ఇలా చెప్తున్నందుకు ఏమీ అనుకోకు."







"అనుకోవటానికి ఏముందిలే, ఒకళ్ళకొకళ్ళం కావలసిన వాళ్ళం—అరమరిక వుండదను కొన్నాను. మీ అత్తయ్యకూడా చాలా ఆశపడింది" ఆయన చాలా నిరుత్సాహపడిపోయాడు.

శేఖరం ఏమీ మాట్లాడలేదు.

ఇంక ఆయనా ఏం అనలేదు.

కుసుమ మనసు కుదుటపడింది.

శేఖరాన్ని చలపతి అడగడం కుసుమకి తెలియదు. ఆయన చమత్కారంతో శేఖరాన్ని లొంగదీసుకొనే వుంటాడని కంగారుపడింది. ఆఖరికి వుండబట్టలేక ఆయన ప్రయాణం అవు తోంటే అడిగేసింది "ఏమన్నాడు బాబాయ్‌! అసలు అడిగావా?"

"అడగటానికేం అడిగాను వాడు సరిగ్గా జవాబు చెప్పలేదు. ముందు అరుణ పెళ్ళికావా లన్నాడు—తర్వాత ఇప్పుడప్పుడే పెళ్ళి చేసుకోవాలని లేదన్నాడు."

"అతనంతే! లేనివాళ్ళ అమ్మాయిని చేసుకోంటాట్ట" కసిగా అంది.

"అదేమిటీ?" ఆశ్చర్యంగా అడిగాడాయన

"ఆఁ, అదో తిక్క! కుమారినే చేసుకొంటాడేమో. అది నా తోటికోడలవుతుందని సంబర పడ్డాను బాబాయ్‌!" చాలా ఆప్యాయం ఒలకబోసింది.

"మనిష్టం ఏముందమ్మా! రాసిపెట్టాలి" నిట్టూర్చాడు.

*            *            *

కుసుమకి శేఖరాన్ని పెళ్ళివిషయంలో ఎలా కదపాలో అర్థం కావటంలేదు. సుందరికి తెలివిగా మసులుకోవటం తెలియదు. ఎంతని తను నూరి పోయగలదు. పోనీ భర్త ఏదన్నా కలగ జేసుకొంటాడా అంటే ఆ ఆశ కనుచూపుమేరలో లేదనిపించింది కుసుమకి. అయినా తను ప్రయత్నంచేసి చూద్దాం అనుకొంది. ముందు భర్తతో చెప్పి తర్వాత నాలుగు రోజులు పోయాక శేఖరంతో అనచ్చనుకొంది.

ఓ రోజు రాత్రి—భర్తతో అంది "శేఖరాన్ని కాస్త కదిపిచూడక పోయారా!"

"ఏమిటి! కదపడం ఏమిటి?" అన్నాడు రాజేంద్ర. భార్య రెండురోజులనుంచి కాస్త ప్రసన్నంగా వున్నందుకే అతను ఉబ్బిపోతున్నాడు.

వెంటనే కోపం వచ్చినా ఎలాగో నిగ్రహించుకొంది కుసుమ. "ఏమిటంటారేమిటీ! సుందరి పెళ్ళిమాట!"

"వాడి ప్రవర్తన ఓ పక్కనించి మంచిది కాదంటూ మళ్ళీ ఇదేమిటే?"

తనని దెప్పటానికి అంటున్నాడా అని భర్త కళ్ళల్లోకి పరీక్షగా చూసింది కుసుమ. అతను మామూలుగానే కనిపించేడు. భర్త క్రాపులోకి వ్రేళ్ళు దూరుస్తూ అంది "అలా ఎందుకన్నానో మీకు తెలియదా? అలా అంటే బాబాయే వెనక్కి తగ్గుతాడని కావాలనే అలా అన్నాను. సుందరి గురించి మీరే చెప్పండి! పిన్ని ఎంతో ఆశ పెట్టుకొంది."

"మీ పిన్నికేం, డబ్బుంది—మంచి సంబంధమే చూసి చేయగలదు లక్షరూపాయల కట్నంపోసి. మావయ్య అయిదారు వేలకన్న ఇయ్యలేడు."

"ఎవరైనా మీ తమ్ముడు కట్నం తీసుకోడుగా! కట్నాల సంగతి మనకెందుకు! మీరు రేపు కాస్త కదిపిచూడండి. అది ఉత్త అమాయకురాలు. అన్నీ నేనే చూడాలి! మీరు నన్ను కాదంటే వూరుకొంటారు" కొంచెం విసుగ్గా అంది.

"వాడికి ఇప్పుడప్పుడే చేసుకోవాలని లేనట్టుంది" నసుగుతున్నట్టుగా అన్నాడు రాజేంద్ర.

"మీరెలా చెప్పగలరు? మీతో ఎప్పుడన్నా చెప్పాడా? అంత ఆత్మీయతకూడానా! ఎప్పుడు మాట్లాడినా వ్యాపారాల గొడవేగా!" కుసుమ తనకి తెలియకుండానే కోపంగా మాట్లాడేసింది.

"అబ్బ! అంతకోపం ఎందుకూ? ఇప్పుడేమన్నాననీ!" అన్నాడు రాజేంద్ర. అతనికి భయం. కుసుమకి కోపం వచ్చిందంటే అంత తొందరగా దిగదు. ఇంక తన పాట్లు ఆ దేముడికే ఎరుక.

కుసుమ కోపాన్ని తగ్గించుకొంటూ అంది "చెప్పండి! రేపు కనుక్కొంటారా?"

"పోనీ నువ్వే అడగరాదూ!" నాలిక చివరివరకూ వచ్చిన మాటని వెనక్కి తీసుకొన్నాడు రాజేంద్ర. 'అతను సవ్యంగా నాతో మాట్లాడితే ఇంకనేం—మీరెందుకూ?' తప్పకుండా కుసుమ నుండి ఈ జవాబు వస్తుంది. అందుకే అతను మౌనంగా వూరుకొన్నాడు.

"ఏమిటి మాట్లాడరేం?" రెట్టిస్తున్నట్టుగా అడిగింది కుసుమ.

"చూద్దాం" అన్నాడు.

"అలా తప్పించుకోవాలని చూడకండి! అడుగుతారా, అడగరా?"

"అలాగే! తప్పకుండా అడుగుతాను" అప్పటికి తప్పించుకొంటూ అన్నాడు. కుసుమ ఏదేనా కొంచెం భయపడటమంటూ వుంటే అది శేఖరానికే అని రాజేంద్రకి తెలుసు. తను అడుగుతే శేఖరం ఏదేనా విసురుగా అంటాడని భార్య భయపడుతోందని గ్రహించేడతను. ఆ విషయం పైకి అనదు. ఎవరైనా అన్నా ఒప్పుకోదు, శేఖరం, కుసుమా అలా మాట్లాడుకోక పోవటమే రాజేంద్రకి హాయిగా వుంటుంది. వాళ్ళు ఆర్నెల్లకో—ఏడాదికో మాట్లాడుకొంటారు. మొదటి మాటకే సూటిగా చూసుకోవడాలు—రెండో మాటకి బాణాల్లాంటి మాటలు వదులు కోవటం—మూడో మాటకి ఇద్దర్లో ఎవరో ఒకరు అక్కడనించి కోపంగా వెళ్ళిపోవటం జరుగు తుంది. ఆ తర్వాత కుసుమ ఇదంతా తనమీద చూపిస్తుంది. అందుకని వాళ్ళు మాట్లాడుకోక పోవ టమే అతనికి హాయిగా అన్పిస్తుంది.

మర్నాడు కాఫీలదగ్గరే అడిగేయమని కుసుమ అక్కడనించి తప్పుకుంది. ప్రత్యేకంగా ఎలా అడగాలో రాజేంద్రకి తెలియలేదు. భార్య నాలుగు తిట్టినా పడచ్చుకాని ఇలాంటివి తనవల్ల కావనిపించిందతనికి.

వాళ్ళు మామూలుగా వ్యవహారాల గురించే మాట్లాడుకొన్నారు.

శేఖరం రోజులా పెందలాడే వెళ్ళిపోలేదు. పది కావస్తున్నా అతను ఇంట్లోనే వున్నాడు. రాజేంద్ర వెళ్ళిపోయాడు. భర్త శేఖరాన్ని తను అడగమన్నది అడగలేదనే కోపం దిగమింగి, సుందరితో అంది కుసుమ "మళ్ళా నాలుగు రోజుల్లో రాజమండ్రి వెళ్ళిపోతున్నాను, మీకు వీలుంటే గండిపేట తీసుకెళ్తారా? అని అడుగు."

## (వి)చిత్ర విజ్ఞానం




1972 లో బోర్నియాలో మలేరియా విజృంభించింది! మలేరియా వ్యాప్తికి తోడ్పడే దోమలను నిర్మూలించడానికి WHO! సాయంతో అక్కడ DDT మందును జల్లారు. దోమలు చచ్చాయి. మలేరియా అదుపులో కొచ్చింది ఐతే యీ DDT మందు అక్కడి బొద్దింకలకు సోకింది. బొద్దింకలను తొండలు తిని ఆ విషాన్ని తమ ఒంటపట్టించుకున్నాయి. బోర్నియో పిల్లులకు తొండలంటే యిష్టం. పిల్లులు యీ తొండల్ని తినడంవల్ల DDT పిల్లులవంటికి సోకింది. పిల్లులు యీ DDT కి తట్టుకోలేక చావడం ప్రారంభించాయి. పిల్లులు చావడంవల్ల ఎలుకల సంఖ్య పెరిగింది. ఎలుకల ఉపద్రవాన్ని ఎదుర్కోడానికి బోర్నియో ప్రభుత్వం విదేశాలనుండి కొన్ని వందల ఆరోగ్యకరమైన పిల్లులను దిగుమతి చేయించింది!'

---

"నేనా!?" గుండెలమీద చేయి వుంచుకొంది సుందరి. నాలుగయిదు రోజులనుండి అతనితో మాట్లాడుతున్న మాట నిజమే! కాని, అక్కడకి తీసుకెళ్ళు ఇక్కడికి తీసుకెళ్ళు అని అడిగేటంత చనువు ఏర్పడలేదు.

"లేకపోతే నేను అడుగుతానా? పోనీ అరుణని చెప్పమని చెప్పు! అంతా నువ్వు చెప్పినట్లే చెప్పాలి' మొత్తం పాఠం వప్పచెప్పినట్లు చెప్పేసి మా అక్క చెప్పమందని చెప్పేవు జాగ్రత్త" అని హెచ్చరించింది.

ఇంక అక్కగారికి కోపం వస్తుందని సరేనంది సుందరి కాని ఎలా అడగాలో అర్థం కాలేదు. ఇప్పుడవన్నీ చూడకపోతేనేం చెప్తే విందువుకాని, విసుక్కుంది అక్కగారిమీద

నింపాదిగా అరుణ దగ్గర కొచ్చింది సుందరి. కాస్సేపు సినిమాలగురించి మాట్లాడి "నేను నాలుగు రోజుల్లో మా వూరు వెళ్ళిపోతాను. మీ చిన్నన్నయ్యకి ఏమన్నా పనుందా? గండిపేటకి తీసుకెళ్తారేమోనని—సర్దాగా వెళ్ళివద్దాం." మాటల్లోనే శేఖరం అక్కడకి వచ్చేడు.

"ఆవిడేదో అంటున్నారన్నయ్యా!" అదేమిటో నువ్వే చెప్పుకో అన్నట్లు తప్పించుకొంది అరుణ.

సుందరికి నీరసం వచ్చేసింది. అరుణతో అంటే—అరుణే చెప్తుందికదా మధ్యలో తను కూడా ఏదో ఒకటి మాట్లాడొచ్చు అనుకుంది. అరుణేమో పూర్తిగా నువ్వే చెప్పుకో అన్నట్లు అనేసింది.

"ఏమిట"న్నట్లు చూశాడు శేఖరం.

ఈసారి పాఠం వప్పచెప్తున్నట్లు చెప్పేసింది సుందరి ఎటొచ్చీ కుసుమన్నట్లు మా అక్క చెప్పమందని మాత్రం చెప్పలేదు.

ఇలా కుసుమే అడిగించిందని అతను గ్రహించేడు. సుందరిమీద జాలేసిందికూడా "నేనేదో పనిమీద తిరుగుతూంటాను. రోజంతా కాలక్షేపాలతో గడపడానికి తీరికుండదు నాకు. ఇలా అనే

స్తున్నందుకు ఏమీ అనుకోకంటి! మీరెళ్ళేలోపు ఏమాత్రం వీలున్నా ప్రయత్నిస్తాను" అన్నాడు.

'నిజానికి తన కెక్కడికీ వెళ్ళాలని లేదు. అక్క చంపుతుంది గాని' అనుకొంది. "అలాగే! దానిదేముంది" అంది.

సుందరిమీదా, భర్తరాగానే భర్తమీదా విరుచుకు పడింది కుసుమ.

సుందరి తల్లి దగ్గరనుండి ఆ రోజే ఉత్తరం వచ్చింది. ఆ వుత్తరం నిండా సుందరి పెళ్ళి గురించే. కుసుమ సుందరి కిచ్చింది చదువుకోమని. సుందరి వుత్తరం చదివి తిరిగి ఇచ్చేసింది.

"ఏమంటావ్" అని అడిగింది కుసుమ.

"ఏమిటీ?" అంది సుందరి అర్థంకాక.

"ఏం లేదులే" విసుగ్గా అని వెళ్ళిపోయింది కుసుమ.

నాలుగు రోజుల తర్వాత భార్య పోరు పడలేక రాజేంద్ర శేఖరాన్ని అడిగాడు. శేఖరం కావాలనే మాట తప్పించేశాడు. ఇంకోసారి అడిగే ధైర్యం లేక వూరుకొన్నాడు. భార్యకి, "వాడు ఇంకా రెండు మూడేళ్ళవరకూ పెళ్ళి చేసుకోడుట" అని చెప్పేడు.

"పదేళ్ళు పోయాక చేసుకోమనండి—అడిగేవాళ్ళు లేక!" కస్సుమంది.

రాజేంద్ర మౌనంగా విని వూరుకొన్నాడు.

శేఖరం అలా అన్నాడని భర్త చెప్పేక సుందరిని తను ఎక్కడకెడితే అక్కడకి తీసు కెళ్ళడం మొదలెట్టింది. అదివరకు సాధారణంగా తీసుకేళ్ళేది కాదు.

శేఖరానికి సుందరికి మనసులు కలవకపోతాయా అన్న ఆశ వుండేది.

ఆరోజు కుసుమా సుందరీ ఎక్కడికో వెళ్ళిపోయారు.

శేఖరం బయటకి వెళ్తూ అరుణనికూడా రమ్మని తీసుకెళ్ళాడు.

అతను పని చూసుకొన్నాక, అరుణకి మంచి చీరలు తీసుకొందామని బట్టలకొట్టుకేసి దారితీశాడు.

ఆ కొట్లోంచే మీరా, మీరా తల్లీ బయటకొస్తున్నారు. మీరా చేతిలో పాకెట్టుంది. మొదట మీరాని అరుణే చూసింది.

అరుణ గబగబా వెళ్ళేసరికి మీరా వాళ్ళు పదడుగులు ముందుకెళ్ళేరు. అరుణ మీరా భుజంమీద చెయి వేసేసరికి మీరా వులికిపడింది.

"నువ్వా!" అంది.

పక్కన మీరా తల్లి వుండడంతో అరుణ పెంకెగా ఏమీ అనలేదు. "బట్టలు తీసుకొన్నారా?" అని అడిగింది.

"అవును! సుమిత్ర అని చెప్పలేదూ! నాలుగు రోజుల్లో దాని పెళ్ళి. చీర తీసుకొన్నాం" అలా అంటూనే అరుణ వారిస్తున్నా పాకెట్టు వూడదీసి చీర చూపించింది మీరా. మీరాకూడా అలాంటి చీరే తీసుకొంది.

అరుణ అలా గబగబా ఎందుకెడుతోంవా ఎవరు కనిపించేరా అని చూసిన శేఖరానికి మీరా కనిపించింది.

పావుగంట గడచినా వాళ్ళ కబుర్లు తెమిలేలా కనిపించలేదతనికి.

అలా మెట్లకిందనే నిలబడ్డాడు.

కాంతమ్మగారికికూడా ఎవరో తెలుసున్నవాళ్ళు కనిపించటంతో ఆవిడ వాళ్ళతో మాట్లాడు తోంది.

రెండు మూడుసార్లు విసుగ్గా వారివైపు చూశాడు శేఖరం.

మీరా ఏదో నవ్వుతూ చెప్తోంది. అరుణ చాలా కుతూహలంగా వింటోంది.

శేఖరం మీరాని పరీక్షగా చూడసాగాడు.

కొద్దిగా కోలముఖం—నాజూకయిన చెక్కిళ్ళు సోగకళ్ళు—పొడుగాటి జడ నవ్వినప్పుడు తళుక్కుమని మెరిసే తెల్లని చక్కని పలువరసా—

అరుణకన్నా ఓ గుప్పెడు పొడుగుంది ప్రతీ చిన్న కదలికకీ ఆ పొడుగాటి జడ చిత్రంగా కదుల్తోంది

ఆ నిర్లక్ష్యం—పొగరే లేకపోతే!

వెంటనే ముఖం తిప్పేసుకొన్నాడు శేఖరం

అతనికి అలా నిలబడాలంటే చాలా విసుగ్గా వుంది

అవతల మీ అన్నయ్య చూస్తున్నట్లున్నారు వెళ్ళు అంది మీరా

రేపు తప్పకుండా రా అని చెప్పి అరుణ అన్నగారి దగ్గరకొచ్చింది

చాలా తొందరగానే రక్షించేవ్ అన్నాడు శేఖరం నవ్వుతూ అతనెందుకో కాని కోపంగా అనాలన్నా అనలేకపోయాడు

ఎంతసేపూ! పది నిముషాలేగా? అంది అరుణ మీరాతో మాట్లాడేకా—ఓ గంటవరకన్నా అరుణ ముఖం ఏదో తృప్తిపొందినట్లుగా—సంభ్రమంగా వుంటుంది

కొట్టువాడు రకరకాల చీరలు చకచకా మడతలు తీసి ఇది చూడండి కొత్త ఫ్యాషన్—ఇవి చూడండి సరికొత్త మోడల్! ఇంతక్రితమే వచ్చేయి మీదే బోణి ఇంకా ఏవేవో చెప్తున్నాడు

శేఖరం రెండు మూడు చీరలు తీసి ఇవి చూడు అరుణా! అని చూపించేడు

అరుణకి అవేం నచ్చలేదు మీరా చూపించిన చీరమీదే వుంది

తనుకూడా అలాంటిదే తీసుకొంటే ఇద్దరూ సరదాగా ఎదైనా ప్రోగ్రాం వేసుకొన్నప్పుడు కట్టుకోవచ్చు

అవి నాకు వద్దన్నయ్యా! అని కొట్టతనితో ఆ చీరపేరు చెప్పి తీసుకు రమ్మంది ఆ కొట్టతను ఎగాదిగా చూశాడు అంత మంచి చీరలు తీస్తే ఆ నాసిరకం చీరలు తెమ్మంటుందేమిటా అని

కొట్టతను అరుణ చెప్పిన చీరలు రెండుమూడు రంగుల్లో తీసుకొచ్చేడు శేఖరం అవేం బాగుంటాయన్నట్లు చూశాడు అరుణ అదేం పట్టించుకోలేదు ఇవికాదు నీలంలో లేదా? అంది

ఆ నీలం రంగు చీర తీసుకొచ్చేడు

డిజైనూ రంగూ చూడ్డానికి బాగున్నా శేఖరానికి ఆ చీర నాణ్యత నచ్చలేదు అయినా అరుణకి మంచి ఖరీదుపెట్టి తీసుకోవాలనుకొన్నాడు రోజూవారీ కట్టుకోవటానికే అరుణకి ఆ ఖరీదులో వున్నాయి

"ఇదేం బాగుంది అరుణా! అయినా నీకు ఇలాంటివి చాలా వున్నాయిగా! అవి చూడు! బాగుండకపోతే వేరే తీయిద్దాం అన్నాడు

నాకీ చీర నచ్చిందన్నయ్యా! అంది

ఇవి చూడండమ్మా! పమిటంచు చూశారా? గబగబా చీర మడతలు విప్పి—నాలుగయిదు కుచ్చిళ్ళు కిందపెట్టి ఎమిటకొంగు పమిటలా వేసుకొన్నాడు అరుణకి నవ్వొచ్చింది చకచకా ఎంత నేర్పుగా చేశాడు?

ఆఖరికి తన మనసులో మాట మెల్లగా చెప్పేసింది అరుణ

అందుకా! అన్నట్టు చూశాడు శేఖరం

ఆఖరికి అరుణ కోరిన చీర—తనకి నచ్చిన చీర—మొత్తం నూటయాభై చెల్లించి రెండు చీరలు పాక్ చేయించేడు శేఖరం

అరుణా, శేఖరం ఇంటికొచ్చేసరికి కుసుమ స్నేహితుల్ని ఎవర్నో సాగనంపుతోంది. తిరిగొచ్చిన కుసుమ మౌనంగా వుండిపోయింది.

సుందరి అడిగింది అరుణని "ఎక్కడికి వెళ్ళేరు" అని.

అరుణ చెప్పి చీరలు చూపించింది.

సుందరికి నీలం చీర నచ్చింది. కుసుమ "బాగున్నాయ్" అని వూరుకుంది. కాని లోపల మంటగానే వుంది. నిజంగా సొంత చెల్లెలే వుంటే ఇంకా ఎంత ఎగిరి పడునో అని. ఇలా ఆవిడ మండి పడడానికికూడా ఇంకో కారణం వుంది, 'ఇన్నాళ్ళబట్టి వస్తున్నాడు పోతున్నాడు తనకి—సొంత వదిన్ని కదా! ముచ్చటకన్నా ఒక్క చీర తీసుకొచ్చేడా ఎప్పుడయినా!—అయినా శేఖరం వాళ్ళపట్ల అంత అభిమానంగా వుండి వాళ్ళేం కలగజేసుకోకపోతే అది తమకి చెడ్డపేరు వస్తుందని ఆవిడ భయం. అయినా ఎందుకు చేయాలి? ఆవిడకే ఆస్తి ఏర్పాటు చేశారు. అలాంటప్పుడు అన్నదమ్ములకి చూడవలసిన అవసరం లేదు. ఇవీ ఆవిడ అభిప్రాయాలు.

అరుణ బ్రతిమాలుతున్నా వినకుండా శేఖరం భోజనానికి బయటకి వెళ్ళిపోయాడు. ఆ సమయంలో రాజేంద్ర ఇంట్లో వుంటే అతనలా బయటకి వెళ్ళటానికి వుండేది కాదు. అన్నగారి మనసు అతను సాధ్యమైనంతవరకు బాధపెట్టకుండా వుండడానికే ప్రయత్నిస్తాడు.

మర్నాడు మీరా వచ్చింది.

హాల్లోనే సోఫాలో కూర్చుని కుసుమ ఏదో పుస్తకం చదువుకొంటోంది. "అరుణ వుందాండి" అని అడిగింది మీరా.

"పైన వుంది" అని చెప్పి మళ్ళా పుస్తకంలో తల దూర్చుకుంది కుసుమ.

మీరా గబగబా మెట్లెక్కుతోంది.

అంత క్రితమే—పది నిముషాల క్రితం ఎందుకో ఇంటికొచ్చిన శేఖరం హడావిడిగా ఒక్కంగకి రెండేసి మెట్లచొప్పున దిగుతున్నతను టక్కున ఆగిపోయాడు.

ఇద్దరిమధ్యా ఇంక రెండుమూడు మెట్లు వున్నాయి.

ఇద్దరూ సడన్‌బ్రేకు వేసినట్లుగా ఒకేసారి ఆగిపోయారు.

మీరా రెయిలింగుని కరుచుకొన్నట్లుగా నిలబడిపోయింది.

అతనేదో చాలా కోపంగా చూస్తాడనీ—అక్కడెవరూ లేరు గాబట్టి ఏదో ఒహటి అని తనని బాధిస్తాడని వూపిరి బిగబట్టి నిలబడింది.

కాని, మీరా అనుకొన్నట్లుగా అదేం జరగలేదు. అతని కళ్ళు సీరియస్‌గా చూడలేదు. మొహం ఎర్రగా గీసిన కందలా అవలేదు. రెప్పపాటు కాలం మీరా చూపుల్తో తన చూపులు కలిపి—వెళ్ళిపోయాడు.

అతను మెట్లన్నీ దిగి వెళ్ళిపోయాడని నిర్ధారణకొచ్చాక గుండెల నిండా గాలి పీల్చుకొంది మీరా.

* * *

రేపు సుమిత్ర పెళ్ళి అనగా ఈరోజు దగ్గర బంధువులు కొంతమంది దిగేరు. అలాగే రాత్రికి మరికొంతమంది. మొత్తం ఓ ముప్పైమంది వరకూ వచ్చేరు.

సుమిత్రా వాళ్ళుండేది మూడే గదులు. కూర్చోవటానికికూడా సరిపోదు. మొత్తం పది వాటాల ఇల్లది. అందరికీ చెప్పేరు కాస్త సామాను సర్దుకొని ఒక్కొక్క గది కాళీచేసి ఈ రెండు రోజులూ ఇమ్మని. ఏకంగా అందరికీ కామన్ దొడ్డి. వీధిగది కాళీచేసి ఇస్తే వాళ్ళకింక వీధి మొహం కనపడదు. అయినా రెండు రోజులకి ఎవరూ మొహం చూసుకోరు. రెండు వాటాల వాళ్ళు పూర్తిగా గది కాళీచేసి ఇచ్చేశారు. మిగతావాళ్ళు మాత్రం మంచాలూ, కుర్చీలు వగైరా—




కాశీచేసి వచ్చిన వాళ్ళకి పడుకోవటానికి— పెట్టెలూ అవీ పెట్టుకోవటానికీ ఇచ్చేరు. అప్పుడు వీళ్ళుకూడా వీధివైపు మసలవచ్చుని.

అలా వచ్చిన వాళ్ళల్లో సుమిత్రకి వేలు విడిచిన మేనత్త ఒకావిడ వుంది. ఆవిడకి తగని చాదస్తం, ఆచారమూను. ఆవిడా ఇంకా అలాంటివారు ఇద్దరు ముగ్గురున్నారు. వాళ్ళకి కాంతమ్మ వాటా ఇచ్చేరు. వున్న వాటాల వాళ్ళకి చిన్న పిల్లలున్నారు. వాళ్ళుతెలియిక ముట్టుకుంటే సర్దుకుపోరు. ఏదేనా అంటే కష్టంగా వుంటుంది బాగుండదని సుమిత్ర వదిన ఈ ఏర్పాటు చేసింది.

ఆ రాత్రి సుమిత్ర కాంతమ్మ ఇంట్లోనే పడుకుంది.

రాత్రి చాలా పొద్దుపోయేవరకూ మీరా సుమిత్రా కబుర్లు చెప్పుకొంటూనే వున్నారు.

మీరాకి మెలుకువ వచ్చేసరికి పక్కన సుమిత్ర లేదు.

కరంటు పోయినట్టుంది. గదంతా చీకటిగా వుంది. అప్పటికే చాలామంది లేచినట్టున్నారు చెంబులు గిన్నెల చప్పుళ్ళూ బకెట్ల చప్పుళ్ళు వినిపిస్తున్నాయి.

'టైము ఎంతవుతుందో' అనుకొంటూ మీరా గదంతా కళ్ళు చికిలించి చూసింది. బట్టల స్టాండు దగ్గర ఎవరో కూర్చున్నట్టుగా అన్పించింది. 'ఎవరు? అలా కూర్చున్నారేమిటి?....వాళ్ళు తలుపులన్నీ తీసిపోయినట్లున్నారు—ఎవరేనా దూరలేదుకదా!' ఈ ఆలోచన రాగానే మీరా గొంతు ఎండిపోయింది. "అమ్మా!" అని పిలవాలనుకొంది. గొంతు పెగల్లేదు.

మీరా కొద్దిగా మోచేతిమీద లేచి చూడబోయింది.

ఆ ఆకారం లేచి నిలబడింది. మీరా చప్పున వెనక్కి వాలి కళ్ళు మూసేసుకొంది. తర్వాత నింపాదిగా ఒక కన్ను తెరిచి చూసింది. ఆ ఆకారం గోడవైపు తిరిగి వుంది. విరబోసుకున్న జుట్టు—ఆ జుట్టు బుజాలవరకే వుంది. చీకటికి అలవాటుబడ్డ మీరా కళ్ళు ఆ ఆకారాన్ని పరీక్షగా గమనిస్తున్నాయి.

ఆ ఆకారం ఒంగుని లేచి మీరావైపు తిరిగింది.

మీరా వూపిరి బిగబట్టి చూస్తోంది.

ఆ ఆకారం మీరానే పరీక్షగా చూస్తోంది.

మీరాకి కళ్ళు మూసుకొందామన్నా భయమేసింది, ఆ ఆకారం అమాంతంగా వచ్చి

ఎక్కడ మీద పడుతుందోనని. ఆ ఆకారం మీరాని చూసి సన్నగా శబ్దం కాకుండా నవ్వింది. మీరా గుండె కొట్టుకోవడం ఆగిపోయి....తిరిగి రెట్టింపు వేగంతో కొట్టుకోవటం ప్రారంభించింది.

ఆ ఆకారానికి పళ్ళు అస్సలు లేవు.

పెళ్ళికొచ్చిన వాళ్ళల్లో పళ్ళు లేనివాళ్ళు ఎవరూ లేరు—ఇది దయ్యమే! సందేహంలేదు! రాత్రి సుమిత్ర అత్తయ్య తనకి దగ్గర స్నేహితురాలు బలవంతంగా చచ్చిపోయిందనీ—దెయ్యమయ్యిందనీ చెప్పిందిగా! ఆవిడ అలా చెప్తోంటే తనకి భయమేసింది—సుమిత్ర ఓసారి అంది దెయ్యాలగురించి భయపడితే అవి వెంటబడతాయని....తను....తను రాత్రి భయపడింది—అందుకని ఆ దెయ్యం తన్ని వెంటాడుతోంది.

ఆ ఆకారం మళ్ళా నవ్వింది. ఈసారి ముందుకి కదుల్తోంది.

మీరా ఒంట్లో శక్తినంతటినీ కూడదీసుకొని మంచంమీంచి కిందకి ఒక్క ఉరుకు ఉరికింది. రెండంగల్లో గది బయటకొచ్చింది.

మీరా ఇవతలకి రాగానే సుమిత్ర ఎదురుపడింది.

సుమిత్ర ఏదో అనబోయింది. మీరా సుమిత్రని రెండు చేతుల్తో చుట్టేసి, "సుమిత్రా?....దె ...దెయ్యం" అంది వణికిపోతూ.

"దెయ్యమా!....ఎ....ఎక్కడ?" తనుకూడా మీరాని గట్టిగా పట్టేసుకొంటూ అంది సుమిత్ర.

మీరా సుమిత్రని ఇవతల గదిలోకి లాక్కొచ్చింది.

ఇద్దరూ ఒకర్నొకరు వదల్లేదు.

"రాత్రి మీ అత్తయ్య చెప్పలేదూ! దెయ్యం సంగతి! అచ్చు మీ అత్తయ్యలాగానే వుంది. కాని పళ్ళు అస్సలు లేవు. జుట్టు మొండిముక్కల్లా వుంది" అంది. ఇందాకటికన్నా కాస్త వణుకు తగ్గింది మీరాకి.

"ఏమిటే!" అంటూ సుమిత్ర మీరాని వదిలి "నడు, చూద్దాం" అంది.

అప్పటికి ఎవరో సుమిత్రకి అర్థమయి భయంస్థానే నవ్వు ప్రవేశించింది.

"అమ్మో! నేను రాను. నువ్వుకూడా వెళ్ళద్దు!" అంటూ సుమిత్ర ఎక్కడ వెళ్తుందోనని సుమిత్ర చెయి గట్టిగా పట్టుకుంది.

"ఏం కాదులే, రా" అని సుమిత్ర చెయి విడిపించుకొని నాలుగు అడుగులు గబకేసింది. మీరా ముందుకు రెండడుగులు వేసి టక్కున ఆగిపోయింది. ఆ గదిలోంచి సుమిత్ర అత్తయ్య వస్తోంది. బోసినోటితో.

సుమిత్ర మీరాకేసి చూసి, నవ్వింది. సుమిత్ర అత్తయ్య బోసినోటితో అంది: "ఏమిటే అమ్మాయ్! అలా పరుగెత్తుకొచ్చావ్! భయపడ్డావా?"

మీరా లేదన్నట్లు గబగబా తలూపింది. ఆవిడ దొడ్లోకి వెళ్ళిపోయింది.

మీరా ఒక్కంగలో సుమిత్ర దగ్గరకొచ్చి చెయ్యి పట్టుకొంటూ, "ఆవిడ పళ్ళు......."

"రాత్రిళ్ళు వుండవు" అంటూ నవ్వి," ఆవిడకి పళ్ళు సలుపులొచ్చి తీయించేసుకొంది. ఎన్నాళ్ళో కాలేదులే ఈ మధ్యే కట్టించుకొంది అవి రాత్రి పడుకొన్నప్పుడు తీసేసిందిలా వుంది. ఆ చీకట్లో చూసి భయపడి—నన్నుకూడా హడలగొట్టేశావ్" అంది సుమిత్ర.

సుమిత్రని వాళ్ళ వదిన పిలిస్తే వెళ్ళిపోయింది. మీరాకి ఆ గదిలోకి వెళ్ళాలంటేనే ఏదో భయంగా వుంది. అప్పుడే అటొచ్చిన కాంతమ్మ "అప్పుడే లేచేవేం, పడుకో" అంది.

"టైమెంతయింది?" ఆవలిస్తూ అడిగింది.

"నాలుగవుతుంది" అని కాంతమ్మ వెళ్ళిపోయింది.

* * *

సుమిత్ర పెళ్ళి ఎ గొడవలూ లేకుండా బాగానే జరిగిపోయింది

అసలు ఇంత ఇదిగా సుమిత్ర పెళ్ళి చేస్తారని ఆ చుట్టుపక్కల వాళ్ళు ఎవరూ అనుకోలేదు ఎ గుళ్ళో పెళ్ళిలాగానో అయ్యిందనిపించేస్తారను “నేవాళ్ళు మగ పెళ్ళివాళ్ళ తరఫువాళ్ళు ముప్పైమందే వచ్చేరు. వచ్చినవాళ్ళుకూడా ఏ పేచీలూ పెట్టలేదు. ఇటు వీళ్ళతరపు వాళ్ళయితేనేం ఊళ్ళోవాళ్ళయితేనేం—మొత్తం రెండు వందలమంది దాకా అయేరు. ఉదయం పదిగంటలకి పెళ్లైతే రాత్రి భోజనాలు చేసి వెళ్ళిపోయారు.

“సుమిత్ర అదృష్టవంతురాలు” అనుకొన్నారంతా.

“నేను చెప్పలేదుటమ్మా! సుమిత్ర తండ్రి పోలిక. తండ్రిని పోలిన ఆడపిల్ల అదృష్టవంతురాలవుతుంది.బంగారంలాటి సంబంధం వస్తుందని?” అంది మంగమ్మగారు.

* * *

ఈ పూట సుందరితో వెళ్ళకుండా ఎలా తప్పించుకోవాలా అని ఉపాయాలు వెదుకుతోంది అరుణ. ఆ డాన్సు ప్రోగ్రాములన్నా నాటకాలన్నా అరుణకి అంత ఇష్టం వుండదు. సినిమాకి రమ్మంటే రోజూ రమ్మన్నా వస్తుంది. మొదట సినిమాకనే అడిగింది అరుణని. అదివరకు రెండుమూడు సార్లు వెళ్ళింది. ఒద్దు బాబోయ్! ఎప్పుడూ సుందరితో సినిమాకి రాకూడదని లెంపలు వాయించుకొంది. సుందరి సినిమాలో తనకి బాగా నచ్చిన సన్నివేశం వచ్చినప్పుడు—కడుపుబ్బ నవ్వించే హాస్య సన్నివేశం వచ్చినప్పుడు అరుణ వీపు పగలగొట్టేది. లేకపోతే తొడమీద చరిచేది. నవ్వు ఆపుకోలేనప్పుడు గట్టిగా నవ్వటం—దానికి పూతంగా పక్కనున్న వాళ్ళని ఒక్క చరుపు వేయడం సుందరికి అలవాటు. అందుకే సుందరి స్నేహితులు సుందరితో సినిమాకిగాని ఏ ప్రోగ్రాముకి కాని వెళ్తే సుందరి పక్కన కూర్చోవటానికి భయపడి, వాళ్ళల్లో వాళ్ళు సుందరి పక్కన నువ్వంటే నువ్వని దెబ్బలాడుకొంటారు.

అందుకే అరుణ సినిమాకి రానంది. కుసుమకి రవీంద్ర భారతిలో జరిగే ప్రోగ్రాముకి ఎవరో కొనుక్కొన్న టిక్కట్లు — వాళ్ళు వెళ్ళలేదుట ఈవిడకి ఇచ్చేరు. కుసుమకి ఉదయం నించీ తలనొప్పి, ఒళ్ళు నొప్పులతో బాధపడ్తోంది. అందుకని అరుణనీ సుందరినీ వెళ్ళరమ్మంది. వెళ్ళనంటే వదినగారికి కోపం వస్తుందేమోనని భయం.

వెళ్ళి అన్నగారితో మొరపెట్టుకొని, “నువు కాళీగానే వున్నావుగా? నువు తీసుకెళ్ళన్నయ్యా!” వేడుకొంది.

“అంటే! ఆ దెబ్బలేవో నన్నే తినమనా?” అన్నాడతను.

“నిన్నెందుకు కొడుతుంది? మగవాడివి కదా! జాగ్రత్తగానే వుంటుందిలే” అంది అరుణ. ఎలాగయినా తను తప్పించుకోవాలని చూస్తోంది.

“అలా అనకు. పొద్దున్న చెప్తోందిగా! వాళ్ళమ్మ ఏడాదిక్రితంవరకూ రోజూ ఉదయంపూట ఒక మినపసున్ని వుండ తప్పనిసరి తినిపించేదని, మినుము తింటే ఇనుపకడ్డీలా వుంటారనేదనీ....”

“ఆఁ, నిన్నేం చెయ్యలేదులే! బాబ్బాబూ తీసుకెళుదూ!” బ్రతిమాలుకుంది అరుణ.

“నువ్వుకూడా తలనొప్పి అని పడుకో! దుప్పటి ముసుగెట్టి గట్టిగా మూలుగు—రాత్రికి అన్నం మానేయ్, నేను హోటలుకెళ్ళి మంచి టిఫినుతెచ్చి పెడతాను. అంతేగాని నన్ను ఆవిడతో వెళ్ళి. ఆ దెబ్బలు తినమంటే మాత్రం నావల్ల కాదు. రేపు నేను మూడువంతులు బొంబాయి వెళ్ళాల్సొస్తుంది. ఈ పూట ఈవిడతో వెళ్ళేనంటే — ఆ దెబ్బలకి—రేపు లేవలేను” భయం నటించేడు శేఖరం.

“తలనొప్పి లేందే ఎంతసేపని పడుకునుండను?” విసుగ్గా, కోపంగా అంది.

"ఏదేనా మంచి నవల చదువుకొంటూ కూర్చో! గది తలుపు లోపల ఘడియపెట్టుకో! ఈ పూటకి జడ వేసుకోవడం మానేయ్" అన్నాడు.

అన్నగారి సలహాలు వినడానికి 'బాగానే' వున్నాయి. అవి ఆచరించటం తనవల్ల కాదు. ఉ హరుమంటూ ఇవతలకి వచ్చేసింది అరుణ.

ఇంక ఈ పూట తప్పించుకోవటానికి మార్గం లేదని దిగులుగా కూర్చున్న సమయంలో మీరా వచ్చింది. అరుణ మీరాకి తన అవస్థ అంతా చెప్పి, "సుందరి తయారవగానే 'మీరు ఎక్కడికేనా వెళ్తున్నారా? నేను వెళ్తా మరి' అని వెళ్ళిపోకు, అలా చేశావంటే ఆ అమ్మాయికి నిన్ను అంటగడతాను జాగ్రత్త!" గట్టిగా హెచ్చరించింది.

"ఇలాగే సుందరితోకూడా గట్టిగా అను. వెనక్కి తిరిగి చూడకుండా పరుగెడ్తుంది" అంది మీరా.

"పాపం పరుగెత్తలేదుగా! అందుకే బెదిరించలేదు భయపడిపోతుందని" చాలా సానుభూతిగా అంది అరుణ. ఇద్దరూ నవ్వుకున్నారు.

"ఆఁ! ఇప్పుడు చెప్పు. సుమిత్ర పెళ్ళి ఎలా జరిగింది. పెళ్ళికొడుకు ఎలా వుంటాడు? మంచి వాళ్ళేనా?" అడిగింది అరుణ. ఇప్పుడు అరుణకి ధైర్యంగా వుంది.

"పెళ్ళికేం చక్కగా జరిగింది. పెళ్ళికొడుకు బాగానే వుంటాడు. వాళ్ళంతా మంచివాళ్ళేట."

"సుమిత్ర ఇక్కడే వుందా?"

"ఒకరోజు వుండి వెళ్ళిపోయింది. వచ్చిన చుట్టాలు మాత్రం వున్నారు. పదహారు రోజుల పండక్కి వస్తుందిట సుమిత్ర. తను వచ్చేవరకూ వాళ్ళుంటార్ట."

"ఇన్ని రోజులా ఏకంగా! ఎవరు బాబూ వాళ్ళు! చాలా దగ్గరవాళ్ళా?"

"ఎంతోమంది కారులే ముగ్గురున్నారు. వాళ్ళే ముప్ఫైమంది పెట్టులా వున్నారు. ఇద్దరు బామ్మలవుతారు. ఒకావిడేమో అత్తయ్య—" నవ్వింది.

"ఏం నవ్వుతున్నావ్" అడిగింది అరుణ.

మీరా ఆరోజు ఆవిణ్ణి చూసి తను దెయ్యం అనుకోవటం అంతా వివరంగా చెప్పింది. అరుణకి నవ్వీ నవ్వీ కడుపు నొప్పి వచ్చింది. నవ్వావుకొంటూ అంది; "ఇంకా నయం కర్ర తీసుకొని నెత్తిమీద రెండేసేవుకాదు."

"భయంతో నోట మాట రాందే! ఆవిడ ముందుకి కదుల్తున్నట్టుగా అయి ఎలాగో మంచం మీంచి ఒక్క ఉరుకు ఉరికి బైటికి పరుగెత్తేను."

సుందరి అప్పటికి రెండుసార్లు వచ్చి చూసి వెళ్ళింది. ఇంక టైము దగ్గర పడుతోందని మళ్ళీ వచ్చింది. అరుణ మీరాతో తీరిగ్గా కబుర్లుచెప్తోంది. అసలు వెళ్ళాలని ధ్యాస వున్నట్లేలేదు.

"టైమెంతయిందీ!" అంటూ అక్కడే టేబుల్‌మీద వున్న వాచీ చూసింది.

అరుణ "అయిదు అయింది" అంది.

సుందరి కాస్సేపు కూర్చుని వెళ్ళిపోయింది. వెళ్ళిన పావుగంటకి మళ్ళీ వచ్చింది. అరుణా! ఎన్నింటికి బయలుదేరాలి!" అంది.

"ఆరింటికి బయలుదేరితే చాలు" తల పట్టుకొంటూ చాలా నీరసంగా అంది.

"ఏం, అలా వున్నావు. ఒంట్లో బాగుండలేదా?" మీరా అడిగింది.

"తలనొప్పి—కళ్ళు మండుతున్నాయి."

"పోనీ వెళ్ళడం మానేద్దాం" అంది సుందరి. అరుణా, మీరా తేలిగ్గా వూపిరి పీల్చుకోబోయేంతలో అంతలో సుందరి మీరాకేసి తిరిగి, "పోనీ మీరు రాకూడదూ!...."

సుందరి మాట పూర్తి కాకుండానే మీరా అదిరిపడింది "నేనా?" అంది.

"మీరే! సర్దాగా వెళ్దాం రండి" అంది. ఆరోజు ఆ ప్రోగ్రాంకి వెళ్ళాలని సుందరికి చాలా కుతూహలంగా వుంది.

"మా అమ్మకి చెప్పిరాలేదు. ఖంగారుపడ్తుంది. ఆవిడ అసలే ఖంగారు మనిషి" అంది మీరా, రాలేనందుకు బాధపడ్తున్నట్లుగా.

"ప్లీడరుగారమ్మాయి వాళ్ళు వెళ్తున్నారుట" అరుణకేసి తిరుగుతూ అంది సుందరి.

ఏనుగంత బలం వచ్చింది అరుణకి. "ఇంకేం వాళ్ళతో వెళ్ళు!" అంది.

"సర్దాగా నువ్వూ రా! వాళ్ళంతా నాకు కొత్త. ఇంకా వాళ్ళ అన్నయ్య, మావయ్య— ఇంకా ఎవరేవరో వస్తార్ట."

"నాకూ రావాలనే వుంది—ఈ తలనొప్పి చంపేస్తోంది" కణతలు నొక్కుకొంటూ చాలా బాధగా అంది అరుణ.

సుందరి వెళ్ళిపోయింది.

కాస్సేపయినాక మీరాకూడా వెళ్ళిపోయింది.

అరుణ కిందకి దిగడానికి భయపడింది—వదినగారు సుందరితో వెళ్ళనందుకు ఏదైనా అంటుందేమోనని.

శేఖరం బయటకెళ్తూ అరుణ గదిలోకి వచ్చేడు. అతని వాచీ ఆగిపోయింది. టేబుల్‌దగర కెళ్ళి అరుణ వాచీ చూసి టైము పెట్టుకొంటూ అడిగాడు "ఏం, వెళ్ళలేదేం! తలనొప్పని పడుకొన్నావా?"

"పడుకోలేదు—తలనొప్పని చెప్పేను"

"వదిలిపెట్టిందా అలా అంటే!" అన్నాడు వాచీకి 'కీ' ఇస్తూ.

"ఏదో తంటాలు పడ్డాను. నువ్వయితే ఏం సహాయం చేయవు—సమయానికి మీరా వచ్చింది—ఒకదానికొకటి అన్నీ కలసి వచ్చేయి."

"ఎలాగయితే నేం? మొత్తానికి నేను చెప్పిందే చేశావు."

"నువ్వు చెప్పావని ఏం చేయలేదు. మీరా నేను ఆలోచించుకొన్నాం."

శేఖరం మాట్లాడలేదు.

"అన్నయ్యా! మొన్న మీరా వాళ్ళంటున్న పక్కవాటా వాళ్ళమ్మాయికి పెళ్ళయిందట" అంటూ మీరా చెప్పింది చెప్పుకొచ్చింది అరుణ.

మీరా చెప్తోంటే పక్కగదిలోనే వున్న అతనికీ వినపడింది—నవ్వుకొన్నాడుకూడా. ఇప్పుడు అరుణ నవ్వుతూ చెప్తోంటే అతనికీ నవ్వొచ్చింది. అతను నవ్వు దాచుకొనే ప్రయత్నంలో వాచీ చెవిదగ్గర పట్టుకుంటూ అన్నాడు "గొప్ప పనిచేసింది. రేపు నన్నుకూడా ఏ భూతాన్నో అనుకొంటుందేమో!"

"ఛ! పిన్నెందు కనుకుంటుంది?"

"గుర్తుంచుకో! ఫలానా రోజున అన్నానని—నువ్వే వచ్చి చెప్తావ్!"

"ఏమిటి, అంత ఇదిగా చెప్తున్నావు?....అలా అనిపించేలా చేస్తావేమిటి?" అంది అరుణ.

"నాకేం పని అలా చేయడానికి" చేతికి వాచీ పెట్టుకొంటూ అన్నాడు శేఖరం.

"ఏమోలే!—నీ వరస చూస్తే అలాగే వుంది."

శేఖరం ఏదో అనబోయి మళ్ళీ పూరుకొన్నాడు.

తర్వాత శేఖరం వెళ్ళిపోయేడు. అరుణ గదిలోనే వుండిపోయింది.

రాత్రి శేఖరం పడుకోబోయేముందు అరుణ గదిలోకి వచ్చేడు.

(సశేషం)

# మంత్రిగారి మాతృభూమి

## యం. గుంపస్వామి

"గోబేక్ టువ విలేజెస్" అని గాంధీతాత అన్నారు కాబట్టి ఓ విలేజి కథలోకి పోదాం.

అదో దిక్కుమాలి వూరు. ఆ వూరికో పేరుంది, గాని దాని పేరుకంటె తన పేరే ముందుకు రావాలని ఓ మహా పురుషుడు కంకణం కట్టుకొని "అప్పలనాయుడొలస" అనే పేరు తేవడానికి తన పర్సుతోపాటు ప్రెసిడెంటుగా తన పవర్సుకూడా ఉపయోగించి ఆ వూరిని తన సొంతం చేసుకున్నాడు.

ఒక్క పేరు సొంతం చేసుకుంటె ఏ చిక్కూ లేదు, పోరంబోకుగా పడివున్న స్థలాలు పొలాలతోపాటు అవసరానికి భార్యల్నికూడా ఉపయోగించుకొనే అపర ధర్మరాజుల్ని, హరిశ్చంద్రుల్ని, వాళ్ళ 'పేణాల్ని'కూడా సొంతం చేసుకున్నాడు అప్పలనాయుడు.

ఒకప్పుడు అప్పలనాయుడు మిద్దె ఇంట్లో వుంటుండేవాడు. మిగతా వాళ్ళలో కొందరికి పెంకుటిళ్ళుకూడా వుండేవి. కాని అప్పలనాయుడు కండలు పెంచేక అవన్నీ పూరిండ్లయిపోయి అతానిది మాత్రం మరో ఎల్.ఐ.సి. బిల్డింగై పోయింది!

ఆ వూర్లో ఒక్క అప్పలనాయుడు తప్ప మిగతావాళ్ళంతా 'కూలి ముండాకొడుకులు' కాబట్టి వాళ్ళందరి దగ్గర చెమట వాసన కొడుతుందిగాని, అప్పలనాయుడు దగ్గర మాత్రం మరికొళందు సెంటువాసన గుప్పుమంటుంది. ఏ 'కోకైనా' సెంటు వాసన కొట్టిందంటె అది అప్పలనాయుడు కింద నలిగిందన్న మాటే!

ఆ మధ్యనైతే సిల్కు లాల్చీలో వుండే అప్పలనాయుడు ఈ మధ్య ఖద్దరుపై పడ్డాడు. టోపీ లేదుగాని....వుంటే, పాతికేండ్ల జైలు జీవితాన్ననుభవించిన నికార్సైన రాజకీయ ఖైదీలా వుంటాడు. పూర్వం నెత్తిమీద గంతం లాంటి పిలక మూతిమీద గడ్డిలా పెరిగిన మీసము వుండేవి. అవన్నీ పోయి చాలారోజులైందనుకోండి. మరో విశేష మేమిటంటె, ఈ మధ్య అప్పలనాయుడు తన సంతకం తనే చేసేయడం నేర్చుకోవడంచేత, మిగతావాళ్ళు అలా చేసుకోడానికి వీల్లేకుండా ప్రతీదానికి శుక్రాచార్యుడిలా అడ్డు తగులుతుండేవాడు.

ఆ వూరికి ఉత్తరాన ఓ చెఱువుంది. దానికో గట్టుంది. ఆ గట్టు ప్రక్క ఓ ఇల్లుంది. అది శిధిలావస్థలో వుంది. అందులో సత్యం అనే రిటైర్డ్ టీచరు తన ఆఖరు దశను గడుపుతున్నాడు. సత్యానికి తన మాతృభూమిపై 'ది ఎన్డ్' అనిపించేద్దామనే కోరిక తప్ప మరేదీ లేదు. అందుకే ఎక్కడో రాలిపోవడం ఇష్టంలేక స్వగ్రామంలో రాలిపోదామని అప్పలనాయుడొలస వచ్చాడు.

పదిహేనేళ్ళ క్రితం ఊరిలోకి రావాలంటే గోర్జిగుండా నడిచిరావాలి. వర్షంపడితే మోకాలులోతు బురదలో భరతనాట్యం చేస్తూ నడవాలి. 'నీటి దీపాలు' ఇంకా రాని కారణాన చీకటి పడగానే నిద్రపోయేవారు. అవసరాలకు డబ్బు చాలకపోతె, రక్తం అమ్మితే పదిహేను రూపాయలిస్తారని, కుటుంబ నియంత్రణ చేసుకొంటే ఎనభై రూపాయిలిస్తారని తెలిసి ఆ వూరి 'పెజానీకం' అప్పలనాయుడు దగ్గిర అప్పులుచేసి సొంత పొలమనేది సెంటుకూడా లేకుండా పోవడం మామూలైపోయింది.

అవన్నీ ఇప్పటికీ అలాగే వున్నాయిగాని, ఆ వూరిపేరు మాత్రం అప్పలనాయుడు దొలసగా మారిపోవడం సత్యానికి ఆశ్చర్యం కలిగించింది.

ఆ వూర్లో ఆడుకోడానికో జూదశాలుంది. తాగడానికో గవర్నమెంటు సారాయి దుకాణముంది. తిక్క రేగితె తగ్గించుకోటానికో తవిటమ్మ కంపెనీ వుంది చేతులు జోడించి

పాపాన్ని తుడిచేసుకోడానికో గుడి వుంది కాని చేతలు వారి రాతలు మార్చుకోడానికో బడి మాత్రం లేదు!

అదే వుంటే సత్యం మాష్టారుగా మరో ఊళ్ళో ఎందుకు పన్జేస్తాడు? ఆ వూరిలో కాస్తంత చదువుకోవాలనే యావవున్న కుర్రాళ్ళు గొంతుల వరకు బురదలోదిగి ఆకలి నార్పడానికో కప్ప చల్దొన్నంతో అఆ లకోసం అవురావురుమంటూ ఐదు మైళ్ళ చేరువలోనున్న స్కూలు కెందుకెళతారు? అప్పుడప్పుడు వర్షం వస్తై జ్వరం గిరం వచ్చి ఒగన్నాధాచారి మంటి మాత్రలు మింగి ఆరోగ్యం క్షీణించి అర్ధాయుష్షులోనే హరీమని ఎందుకంటారు??




ఇవన్నీ మెడకాయమీద తలకాయున్న ఎ తంత్రీ ఆలోచించలేదు చివరకు ఆ వూరికి తంత్రి కాకపోయినా రంకు మొగుడులా చెలామణీ అవుతున్న అప్పలనాయుడూ ఆలోచించలేదు

కాని ఎవ్వడికీ ఏమీ కాని సత్యం మాష్టారు మాత్రం రాత్రీ పగలూ ఆలోచించేడు

అలా ఆలోచిస్తూ చెఱువు గట్టుమీద యోగ ముద్రతో కూర్చున్నట్టున్న సత్యాన్నిచూ నీటికెళ్ళిన ఆతివలు పిచ్చిపంతులు పరమాత్మలో కలిసిపోనాడేటో! అనుకున్నారు మిగిలిన పెజానికం బుద్ధిమారి బుద్ధుడై పోనాడేటో అనుకున్నారు.

కాని అప్పలనాయుడు మాత్రం ఆ వూరి కంతటికీ తెలివైనవాడు కాబట్టి అలా అనుకోలేదు రెండరటిపళ్ళు గ్లాసుడు మజ్జిగ తీసుకెళ్ళి ఏటిమేట్రూ! నిరాఆరదీచ్చ సేత్తన్నావట! ఏటికత అని అడిగాడు

అప్పుడే కళ్ళు తెరిచిన సత్యం పక్షికి భాషుంది చెట్టుకి భాషుంది కాని ఇక్కడి మనుష్యులకు భాష రాకపోవడం విడ్డూరం తక్షణమే ఓ బడి కట్టించాలి అప్పు తీసుకున్న పత్రాలమీద ఎంతమంది తమ సంతకాలు పెట్టగలుగుతున్నారు? రాజులు పోయారు రాజముద్రికల వ్యవహారాలూ పోవాలి! కనీసం

# విద్యుచ్ఛక్తి రంగంలో ముందడుగు

విద్యుదుత్పాదన రంగంలో ఆంధ్రప్రదేశ్ అగ్రగామిగా వున్నది. మన ప్రధాన మంత్రి 1978 నవంబరులో రామగుండం సూపర్ థర్మల్ విద్యుత్కేంద్రానికి శంకుస్థాపన చేయడం రాష్ట్రంలో విద్యుదుత్పాదన రంగంలో ఒక ముఖ్యమైన ఘట్టం. ఈ కేంద్రానికి 2100 మెగావాట్ల ఉత్పాదక శక్తి ఉంది.

మన రాష్ట్రంలో 1978-79 ప్రారంభంలో విద్యుదుత్పాదక శక్తి 1563 మెగావాట్లు కాగా 1979 మధ్యకాలానికి యిది 1888 మెగావాట్లకు పెరుగుతుంది. గ్రామాలకు విద్యుచ్ఛక్తి అందించే విషయంలో గ్రామీణ విద్యుదీకరణ సంస్థ తన సహాయాన్ని కొనసాగిస్తున్నది. ఈ సంస్థ మన రాష్ట్రంలో ఇంతవరకూ 213 పథకాలను మంజూరు చేసింది. వీటికోసం రు. 70.83 కోట్లు రుణసహాయం అందజేసింది.

డి జి స పౌ సం శా

45/78—79



చాకలి పద్దయినా ఎవడిది వాడు వ్రాసుకోడానికి నేచుకోవాలి" అన్నాడు సత్యం.

దానికి అప్పలనాయుడు ఆ వూరు అదిరిపోయేలా, ప్రక్కనున్న చెఱువు కదిలిపోయేలా పెద్దగా నవ్వాడు. "ఏటి మేస్త్రూ!....సాకలి పద్దా!-అసలెవుడొంటిమీదైనా బట్టున్నాదేటి?" అన్నాడు వెకిలిగా.

సత్యంను ఎవరో కొరడాతో కొట్టినట్లనిపించింది.

సహనంగా "మన ఊర్లో బడి లేక పిల్లలు చాలా బాధలు పడుతున్నారు. నేటి బాలలేకదా రేపటి పౌరులు. కాబట్టి బడి కట్టించునాయుడూ" అని అర్థించాడు సత్యం.

"ఏటీ! బడా! దేనికి? (సదువుకొని నన్నునగ దొక్కడానికా?) ఈ వూరి లుండేది పశువులు. కాబట్టి పశువులాస్పత్రి కట్టమను..... తెల్లారే సర్కి నెక్కపోతే .... నీ సెప్పిచ్చుకొక్కట్టు!" అన్నాడు అప్పలనాయుడు.

సత్యం నెత్తిన సమ్మెట దెబ్బ పడినట్లయింది. "ఏమిటీ? ఈ వూరిలో వుండేది పశువులా? వీళ్ళు మనుషుల్లా కనపడ్డంలేదూ? ఈ ఊరిలో పెద్దవని చెప్పాను. నీ సాయం అవసరంలేకుండా నెల రోజుల్లో బడి లేపగలను" అన్నాడు సత్యం దృఢంగా.

ఉన్నట్టుండి అప్పలనాయుడు అనుచరుల్లో కుడిభుజం టపీమని క్రిందపడి పూనకం వచ్చిన వాడిలా కొట్టుకోవడం మొదలుపెట్టేసరికి అది చూస్తున్న 'పెజానీకం' భయపడిపోయారు.

"సూసినారా, .... ఈ పంతులు మాటకు పట్టిన గతి!....మనూరికి సదు నబ్బదు! నాకేటి నోటు? సదువురాక మానేసినానేటి? మరి మీరంతా నాకు మొక్కడంనేదూ....బుర్రుండాలి గాని, బడితో పనేటి? ఈ పిచ్చి పంతులు మాటింటె సెడిపోతారుగాని....ఎల్లి మీ పనులు సూసుకోండెహె!" అని చుట్టూ మూగిన 'పెజానీకాన్ని' విదిలిస్తూ అప్పలనాయుడు తన ఇంద్రభవనంలోకి గానాబజానా నిమిత్తం ఆనాటి సభచాలిస్తూ వెళ్ళిపోయాడు.

"అవును మనదద్ది సెప్పిందే కరకట్టు" అనుకొని అప్పలనాయుడొలన 'పెజానీక'మంతా చెల్లాచెదురై పోయారు.

అప్పలనాయుడు ఆ వూర్లో అందరికీ వరసౌతాడు. ఆ వరస అతనికో వరంలాంటిది. పైగా మాట చేయనివని నోటు చేస్తుందనే నగ్న సత్యాన్ని ప్రతీ ఐదేళ్ళకూ జరిగే ప్రెసిడెంటు ఎలక్షన్లో తెలిసి, గెలిచిన 'రాజకీయపు బుర్ర' అతనిది.

సత్యం టౌనెళ్ళాడు. పల్లెకు పశ్చిమాన వనికిమాలిన భూమిపై బడి కట్టేందుకు స్థలం, కలెక్టరుద్వారా సంపాదించాడు సత్యం.

ఆ కాగితం చూసిన అప్పలనాయుడు "కాయితమైతె తెచ్చుకున్నావుగాని, ఆ స్థలం నాది. ఈ కాయితమంత సులువుగా రాదు మేస్త్రూ! అత్తసొమ్ము అల్లుడు దారపోసినట్టుందీ యవ్వారం? నా ఊరుమీద, నా భూమ్మీద కన్నేసిన ఆ కలకటేరు ఏమై పోతాడో కానుకోనేకపోనాడు! ఎల్లుండి రేపీపాటికి ఆడ్ని 'జమ'నేసీడంగాని, అండమానం దీవాలకి జెండా ఎత్తించేదంగాని సెయ్యింపకపోతే, నాపేరు అప్పలనాయుడే కాదు!" అని తొడ చరిచి, మీసం లేదు కాబట్టి జుత్తు నులిపి, అనుకున్నది సాధించడానికి అప్పలనాయుడు హైదరాబాద్ వెళ్ళాడు.

ఆ వూరి చుట్టూ మరో మూడు పల్లెలున్నాయి. అందులో ఎవరికీ నోరులేని కారణాన అవి అప్పలనాయుడొలసకన్నా హీనంగా, దీనంగా వున్నాయి.

మంచి ముహూర్తాన సత్యం మళ్ళీ టౌనెళ్ళాడు. అవసరమైన అధికారుల్ని కలుసుకున్నాడు. "కనీసం నాలుగూళ్ళ కొకటైనా బడి వుండాలని పట్టుపట్టి స్థలం తనకు ప్రభుత్వం శాంక్షన్ చేసిందని,అవసరమైతె తల తాకట్టు పెట్టయినా బడి కడతానని" భగీరథ ప్రయత్నం చేసి మొత్తంమీద ఎలాగైతే నేమి సాధించాడు.

నాలుగు పల్లెలు కలిసేచోట బడికట్టి "పిల్లల భవిష్యత్తుకు బంగారు బాట వేసే ప్రయత్నంచెయ్యండ"ని విడివిడిగా ఒక్కొక్క ఊరుని, ఊరు పెద్దని కలసి బ్రతిమలాడాడు సత్యం.

అంతవరకూ ఆకలేస్తే తినడం, నిద్రవస్తే పడుకోవడం తప్ప వేరే ఏమీ తెలీని ఆ మూడూళ్ళ పెద్దలు మూడో నేత్రం తెరిచారు. "అవును వుండాల్సిందే" అని ముక్తకంఠంతో ఒప్పుకొని తలా ఏదో సహాయం చేస్తామని పద్యాలు పాడుతూ బాసలుచేశారు.

ఆ రోజు కప్పులేని నాలుగ్గోడల మధ్య నున్న గదిలో చుక్కల్ని చూస్తూ....భవిష్యత్తు నాలోచిస్తూ హాయిగా నిద్రాదేవి ఒడిలో ఒరిగాడు సత్యం.

అప్పలనాయుడు వెళ్ళిన కార్యం 'పండు' చేసుకొని పండ్ల గంపతో ఊర్లో పడ్డాడు. కుడిభుజం ఎడమభుజాలుగా పేరుపడ్డ పోలి నాయుడు, తవిటి నాయుడులు చెప్పిన మాటలకు అప్పలనాయుడు నోట్లోని చుట్ట జారి క్రింద పడింది. ఎడమకన్ను ఎడమభుజం అదిరాయి. పెరట్లోని కోడెగిత్త రంకెవేసి పలుగు తెంపి పరుగు తీసింది. దాని కాలిక్రింద ఓ గుడ్డి గవరయ్య నలిగి శవాలిలిష్టులో జమ అయి పోయాడు. విధివశాత్తూ చనిపోయిన గుడ్డోడి చావుకు, సత్యం మాష్టారి బడే కారణమని అప్పలనాయుడు చేసిన ప్రచారం మూఢులపై బాగా పనిచేసింది.

సత్యాన్ని పిలిపించిన అప్పలనాయుడు "ఏటిమేట్రూః నాను రెండు పూట లూరిలో నేపోయేసరికి ఇంత కత నడిపేవాః నాలుగు పూటలైతె నా పెల్లాంసేతే సీఃసీః అనిపించేద్దు వన్న మాట. పల్ల కూరుకోడం సేతకాకపోతే... తద్దినం మంత్రాలు నాలుగు నేర్చుకో....మా వూర్లో బోల్డంతపని. అంతేగాని, నా మాట కాదని ఎదురు తిరిగినావో....జమ అయిపో గలవుః ఈ నాలుగూళ్ళకు నాయకుడ్ని. నాతోని మంచిగున్నావనుకో .... ఆరు పదులు నిండి పోగానే సట్టిపూజ, నూరేలు నిండిపోగానే పెద్ద కర్మ పద్ధతి పెకారం ఓరాలేకుండా జరిపించే తాను. నేదనుకో....కాకులుకూడా సీకేసిన ముద్ద ముట్టుకోనివ్వనుః" అంటూ మరో చుట్ట వెలిగించాడు.

సత్యం ఎప్పటికీ లొంగక పోయేసరికి "పోనీ గవరమెంటోలు బడికోసం సీకిచ్చిన జాగాతో మరో పదెకరాల మడిసెక్క సీ సొంతమైపోద్ది. ఇప్పుడూ....అనుః" అన్నాడు సగంలో ఆరిన చుట్టను మరోమారు వెలిగిస్తూ.

కాని అప్పుడూ సత్యం 'ఊ' అనలేదు. తను మాటలవాడు కాడు. చేతలవాడు. అందుకే చరచరా అక్కడనుండి వెళ్ళిపోయాడు.

అప్పలనాయుడు నిప్పు తొక్కిన కోతై పోయాడు. ఏ ధైర్యంతో సత్యం తనకు ఎదురు తిరుగుతున్నాడా అని ఓసారి తన పరిసరాల చుట్టూ దుర్భిణీవేసి చూశాడు. ప్రక్క మూడూళ్ళ పెద్దలు కనిపించారు. "మూర్కపు నంజాకొడుకులు" అనుకుని 'అరిజంట'ని రమ్మని కబురుపంపాడు.

నిమిషాలమీద రెక్కలుకట్టుకొని ముగ్గురూ అప్పలనాయుడు ముంగిట వాలి "మేంసేసిన అపరాదమేటి మాప్రోః" అన్నారు వణకుతూ.

'మొన్నటి ఎలచ్చన్లో సొమ్ము తీసుకొని ఎదురు పచ్చానికి ఓటు వేయించావని' ఒకడ్ని, 'సీ కూతురు కులం తక్కువోడి పక్కన తొంగుంటె సీకొల్లుమండి అడ్డక్కడే కూసీ సేసేవని' ఒకడ్ని, రామాలయం కడతానని సెప్పి దండిన సొమ్ములో సగంతీసి, సీ ఇల్లు కట్టుకున్నావని' ఒకడ్ని భయపెట్టేడు అప్పలనాయుడు.

"బాబ్బాబు మా కిప్పుడేటి దారిః" అన్నారు కోరస్‌గా వాళ్ళు.

అప్పలనాయుడు "రండి కూకోండి, సెప్తాను" అని రమ్ము సీసాల కార్కులూడ దీసి, ఆ ముగ్గురి నోళ్ళకూ బిరడాలు బిగించాడు. అంతేకాదు. "సంగంలో మనకోపేరూ, పెత్తేకతా రావాలంటే .... మానూళ్ళ మద్దె గాంధీతాత ఇగ్గరం కట్టి, ఏ మినిట్టరు సేతో ఓపినింగు సేయించేత్తే..... మన పేరులు గుప్పుమని పోతాయిః అపుడు నేను రాజు నువు మంతిరిః! అన్నట్టు పధకం బ్రహ్మాండంగా తయారుచేశాడు అప్పలనాయుడు.

తాగివోళ్ళంతా సత్యహరిశ్చంద్రులై ఒకే మాటపై నిలబడి, బడి కట్టాల్సిన స్థలంలో ఓ మహాత్ముడి విగ్రహం మూడు వారాలు తిర క్కుండానే కట్టించి, సభలు జరిపించి, చప్పట్లు మోగించి తమ దేశభక్తిని చాటుకున్నారు.

పాపం 'పెజానీకం' పశువుల్లాంటోలు కాబట్టి ఆ దుష్ట చతుష్టయం చేసిన పనులకల్లా తలాతోక ఊపేశారు.

ఇన్నాళ్ళూ దేశానికి, తమ ఊరికి, తమ ప్రజలకు సేవచేసిన సందర్భంగా అప్పల నాయుడు ఎం.ఎల్.ఎ. అయ్యాడు. అంతేకాదు సంతకం వచ్చినవాడు కాబట్టి మంత్రికూడా అయ్యాడు.

మంత్రిగారి మాతృభూమిపై పాపం సత్యా నికి తావులేదు! 

# మానవ జీవితంలో జంతువులు

మానవులకీ జంతువులకీ అవినాభావ సంబంధం వుంది. మానవుడుకూడా ఒకప్పటి జంతువేనంటారు శాస్త్రజ్ఞులు. మానవుని జీవితా లతో జంతువులకి సన్నిహితత్వం వుంది. సంభాషణల్లో జంతువులు చోటు చేసుకొని చమత్కారాన్ని కలిగిస్తాయి — భావస్ఫూర్తి నిస్తాయి—హాస్యాన్ని జనింపచేస్తాయి.

మోసాలు చేసేవాడ్ని, నమ్మకద్రోహినీ 'నక్క' అని అంటాం. "గుంటనక్కలా కాచుక్కూర్చున్నాడు" అనే ప్రయోగంకూడా వుంది. సాధుస్వభావం గలవాడికి 'గోవు' అనీ, వ్యక్తిత్వం లేకుండా గుడ్డిగా అనుకరించేవాడికి 'గొర్రె' అనీ, ఎవర్నీ లక్ష్యపెట్టకుండా ఇష్టం వచ్చినట్టు తిరిగేవాడికి "అచ్చోసిన ఆంబోతు" అనీ ముద్దుపేర్లు పెట్టుకుంటాం. ఎటు అనుకూ లంగా వుంటే అటు చేరే తత్వంగల అవకాశ వాదిని 'గోడమీద పిల్లి' అనో 'ఊసరవెల్లి' అనో పిలుస్తాం. హంస నడకలూ, మీన నేత్రాలూ స్త్రీ జాతికి వరాలు.

చిలకా గోరింకల్లా జీవించే దంపతులు ఈ కాలంలో అడుగడుగునా కనిపిస్తారు. మనకి కోర్టు 'పక్షులకి' కొరతలేదు. రాజకీయ నాయ కుల 'చిలక పలుకులు' అందరికీ తెలుసు. కొన్ని కొన్ని సందర్భాల్లో జలగల్లా పట్టు కొంటేగానీ పనులు కావు. 'కోతి' చేష్టలకీ, 'కాకి' గోలకీ విద్యార్థుల్లో చాలామందికి పెట్టింది పేరు. కొందరి స్వరం 'కోకిలారావం' అయితే మరికొందరిది 'గార్దభస్వరం' మరి! విశ్వాసానికి 'కుక్క'ని చెప్పుకోవల్సిందే. ఎవ రెన్ని ఉపన్యాసాలు చేసినా మన ప్రణాళికలూ, మన విధానాలూ మాత్రం 'నత్తనడక'నే వరి స్తాయి. చిత్తశుద్ధి లేని "కొంగ జపం" స్వాములు మన మధ్యనే జీవిస్తున్నారు. స్వార్థం కోసం ఇతరుల్ని బలిగావించే 'రాబందులు' మనకి దర్శనమిస్తూనే వుంటాయి. 'కప్ప దాటులు వెయ్యడం, 'పేను'కి పెత్తనం ఇవ్వడం తగదని మనకి తెలుసు.

నిత్యజీవితంలో మనం వాడే సామెతల్ని పరిశీలించండి:—(1) కాకిపిల్ల కాకికి ముద్దు (2) పులినిచూచి నక్క వాతలు పెట్టుకున్నట్టు (3) దున్నపోతుమీద వాన (4) మొరిగే కుక్క కరవదు (5) గుర్రం గుడ్డిదయినా దాణా తప్పదు (6) ఏనుగు చచ్చినా బతికినా ఒకటే విలువ (7) పిచ్చుకమీద బ్రహ్మాస్త్రం (8) పిల్లికి ఎలుక సాక్ష్యం (9) పంది పన్నీరుని మెచ్చు తుందా (10) కాకి ముక్కుకి దొండపండు.

ఈ విధంగా జంతువులు మానవ జీవితంలో చోటు చేసుకొని మీరు మానవత్వం నుంచి పశుత్వంలోకి దిగజారకండి సుమా అని హెచ్చరిక చేస్తూంటాయి.

—ధ్వా. నా. శాస్త్రి

# యథాప్రజా-తథారాజా

## బలివాడ కాంతారావు

సిగ్నల్ వాలలేదు. రైలు ఆగింది. రెండు వైపుల నించీ మనుషులు దాడిచేసారు. తలపై కమలాపండ్ల బుట్టలతో అమ్మడానికి పరుగెత్తుతూ కదలుతున్నారు.

రైల్లో వున్న మనుషులు తలోలా వ్యాఖ్యానించారు

"వీళ్ళకోసమే రైలాపినట్లుంది"

"ఈ చుట్టుపట్ల కమలాలు తెగకాసి కుళ్ళిపోతుంటే యెలాగో అమ్మకేంచేస్తారు?"

"ప్రతిరైలూ ఆపమని ఆ స్టేషనుమాస్టరుకు లంచం కట్టిసుంటారు."

ఇంతలో రెండుప్రక్కలా పళ్ళమ్మేవాళ్ళని తరిమే పోలీసులను చూడగానే

"ఇదేదో పెద్ద రాకెట్‌లా వుందే" అని ఒక ప్రయాణికు డంటే

"అధార్టీ చూపిస్తున్నారు అంతే"

ఇంకోకాయన సన్నంగా పొడుగ్గావున్నాడు. కళ్ళీ లాల్చీ వేసుకున్నాడు. రిమ్‌లెస్ కళ్ళద్దాలు మాటాడితే సర్దుకుంటున్నాడు. అతని దృష్టి పళ్ళపై లేదు. ఆ పళ్ళవాళ్ళ దగ్గర ఒక్కొక్క కమలా పండుని దండుకుని, అమ్ముకోండని విడిచిపెడ్తున్న ఒక హెడ్ కానిస్టేబుల్ మీద వుంది.

ఆ హెడ్‌కానిస్టేబుల్ ఒక చేతిలో లాటీ వుంది. ఇంకోచేతిలో సంచివుంది. లాటీ తిప్పకుండా ఒక్కొక్క కమలాపండూ పడగానే సంచి నిండుతోంది. హెడ్డుకు బొద్దుమీసాలున్నాయ్. చెమటలు పోస్తున్నా ఫాలభాగంలో మూడు ముడతలు కనిపిస్తున్నాయి.

"ఇది దోపిడీ—నిలువు దోపిడి—అధికార దుర్వినియోగం!" ఇలా అరచిన సన్నని మనిషి గొంతుక అందరికీ వినిపించింది. హెడ్డు తన గురించే అతను అలా అంటున్నాడని ఒకసారి ఆ గుండ్రని కళ్ళు నిలబెట్టిచూసాడు. ఆ సన్నని ప్రయాణీకునికి, యెర్రటోపీ యెరుపు కళ్ళంటే భయంలేదన్నట్లు యింకా అరుస్తున్నాడు

అతను యింత అరచినా, యింతమంది కళ్ళ తనమీద వున్నా హెడ్డు తనపని తను చూసుకుంటూ తిరిగి వచ్చేసరికి యీ సన్నని మనిషి పళ్ళబేరంలో వున్నట్లు గమనించాడు.

"బుట్ట ఎంత?"

"పదిహేను రూపాయలు బాబూ."

"ఇచ్చే ధర చెప్పు."

"రెండు తగ్గించి పదమూడు చేసుకోండి"

"ఆ పది కొట్టే? మూడురూపాయలిస్తాను"

"కాశ్మీర్ సుందరి బుగ్గల్లా వున్న—యీ నాగపూర్ సంత్రాలకు తమరు విలువ కట్టలేరు" అని వెళిపోతుంటే—

"పోనీ నాలుగు చేసుకో"

"వెధవా—ఆ బాబు దోపిడీ యెరగని అధికారిరా! ఇచ్చెయ్" అని హెడ్డు గసిరాడు. గసిరి వూరుకున్నాడా? ఆ బుట్టలో వున్న పెద్ద కమలాపండును తీసుకుని సంచిలో వేసుకున్నాడు.

రిమ్‌లెస్ కళ్ళద్దాల వెనుక వున్న కళ్ళు మండిపోయాయ్. ఇంతలో రైలు ఈలవేసింది.

"తే "

"పదికి తక్కువ లేదు."

"ఐదిస్తాను."

"మీ వూర్లో యీ బుట్టడు పళ్ళు ఖరీదు పాతిక—"

"ఇంకో అర్ధరూపాయి తీసుకో "

"అరిచ్చేండి."

రైలు మెల్లగా కదులుతోంది. ఇంకా బేరం తెగలేదు. రైలుతోపాటు కదులుతూ "డబ్బులు తియ్యండి—ఇదండి బుట్ట"

"ఇద—ఐదున్నర "

బుట్ట రైలెక్కింది కుర్రాడు ఐదున్నర అందుకుని మెట్లుదిగిపోయాడు. రైలు కదిలి పోయింది.

ఆ రెండో తరగతి కంపార్టుమెంటులో అందరికళ్ళు అతనిమీదే వున్నాయ్—ఒక్కరి కళ్ళు తప్పించి: ఆ ఒక్కడూ హెడ్ కాని స్టేబుల్ కమల్‌నాథ్ తివారీ' పళ్ళబుట్ట కొన్న వాడు వేణుగోపాలన్.

అందరూ చొగ్గా కొట్టేసావంటున్నారు. ఒక పండు తీసి తినడానికి వేణుగోపాలన్‌కు చేతులు రావటంలేదు. తన వూరు తీసుక వెళ్ళవచ్చు. ఇంట్లో పిల్లలూ పెళ్ళం మూడురోజులపాటు తింటారు. ఇక్కడ ఒక్కడు తిన్నట్లు కాదు. తనచుట్టూ పిల్లలున్నారు. పిల్లల తల్లులున్నారు. ముసలివాళ్ళున్నారు. పళ్ళు యిస్తే యెవరికి వద్దు?

భద్రంగా దాచుకోబోతుంటే, ఒక మూల కూర్చొని పండుమీద పండు వలుచుకు తింటున్న హెడ్డు తివారీ గొంతుక వినిపించింది.

"పళ్ళు నాణ్యం చూడండి-లెఖ్ఖపెట్టుకోండి"

"పోపోస్-అప్పణంగా వచ్చాయి కదా-తెగ ఆరగిస్తున్నాడు. వీడు చెప్పితే తను లెఖ్ఖపెట్టు కోవడం యేమిటి!" అనుకుని వేణుగోపాలన్ వూరుకుంటే స్టేషను వచ్చింది. ఆ చిన్నస్టేషను దగ్గర రైలు ఆగిపోయింది. అటునించి రైలు వస్తోందన్నట్లు అటు సిగ్నల్ వాలివుంది.



ఎవరో రైల్లో వాడే ప్రశ్నించాడు—

"ఏమండీ—ఐదున్నరకు ఆరు డజన్లేనా కిట్టాయా?"

"ఏమో?"

"అతన్ని యెవ్వరూ దోపిడి చెయ్యలేరు!" అంటూ హెడ్డు అనగానే—ఈ వేళాకోళం సహించలేక,

"నేను తెలివితక్కువవాణ్ని కాను" అన్నాడు వేణుగోపాలన్.

"నేను అంతమాట వాడలేదుసార్! ఆ బుట్ట పాముల పుట్టలావుంది. ఏమో—లోపల ఎన్ని పాములున్నాయో? నా కెందుకులెండి" అంటూ యింకో పండు-అరసుగ్గిన పండు చేతినిండుగా వున్న పండు వలిచి తింటున్నాడు. ఆ పండు తన బుట్టనించి తీసుకున్నదే. అంత పెద్దపండు తను తినవలసింది. వాడు ఆరగిస్తున్నాడు.

"పోనీ లెఖ్ఖపెట్టండి" అంటూ యెవరో సలహా యివ్వటంవలన వేణుగోపాలన్ బుట్ట సీటుమీదకు దించాడు. నలుగురి కళ్లూ బుట్ట మీదే వున్నాయ్. ఒక్కసారి పెదాలు గట్టిగా కరిచిపట్టుకున్నారు. కొందరు నవ్వు నాపుకున్నా వేణుగోపాలన్ కోపాన్ని ఆపుకోలేక

"మోసం-దగా-దోపిడీ" అని అరిచాడు. హెడ్డు తీసిన తేనుపు పకపక నవ్వినట్లుంది.

"బుట్ట పెద్దదే "

"అడుగున సగం గడ్డి"

"గడ్డిమీద సగం కుళ్ళిన పళ్ళు."

"మంచివి మీద నున్నయ్. వాటి ఖరీదు రెండు మూడు రూపాయిల కన్నా మించి వుండదు."

"మోసం దగా "

చుట్టూ మనుషులు మూగిపోయారు.

"ఇలాంటి మోసం అనే యీ పోలీసుల్ని పంపించారు."

"ఎవడో పెద్ద పోలీసు ఆఫీసరు యీయన లాగే మోసపోయివుంటాడు. అందుకే, అసలు డ్యూటీలు తప్పించి యిక్కడికి పోలీసుల్ని పంపించాడు."

"పోలీసు ఆఫీసరుకు కొనేఖర్మ యెందుకు? ఏ మినిష్టరు చప్రాసీయో, దగాపడి వుంటాడు. వాడు మినిష్టరుతో చెప్పి పోలీసు బందోబస్తు చెయ్యించి వుంటాడు."

"మనలాంటి ప్రయాణీకులే కంప్లయింటు యిస్తే, పోలీసుల్ని వాళ్ళని తరమడానికి పంపించి వుండకూడదా?"

"అధికారుల్లో అంత నిజాయితీ వుంటే— దేశం యెందుకిలా తగలబడుతుంది?"

"యథారాజా—తథాప్రజా"

"యథాప్రజా—తథారాజా..." అని హెడ్ అనగానే అందరికీ కోపం వచ్చి అతనివేపు కొరకొరా చూసారు. హెడ్డు పట్టించుకోకుండా యింకో పండు సంచిలోనించి తీసాడు.

"అప్పణంగా వచ్చాయి కదా. ఎన్నయినా తింటాడు" అని గొణిగాడొకడు. జవాబు చెప్ప కుండా ఆ పండు తినేసి చేతులు కడుక్కుని మీసా లొకసారి తడుముకుని, తుడుచుకుని మళ్ళీ కూర్చున్నాడు.

"వెధవ రైలు యింకా కదలదు!"

"అటువేపు నించి వచ్చే రైలు డిరైల్ అయిందేమో?"

"ప్రక్క స్టేషను పెద్దది. అక్కడ రైలాగ నివ్వండి కంప్లయింట్ రాద్దాం"

"ఏమని?"

"ఎవడికి అధికారం యిస్తే, వాడు సరిగ్గా చేస్తేనా?"

"ఎవడా వాడు?"

"ఈ స్టేషను మాష్టరు—ఈ రైలింజను డ్రైవరు—గార్డు."

"అదిగో ఆ పోలీసులు "

"తివ్వలాగితే డొంకంతా కదులుతుంది. ఏది సవ్యంగా పోతోంది? ఎవడిదగ్గర ఆనెష్టీ గూడు కట్టుకుని కూర్చుంది?"

"మా తిండి, మా గుడ్డ, మా చదువు, మా వుద్యోగం, మా యిల్లు, మా నిద్ర, మా ప్రేమ, ఒకటేమిటి మా గురించి అన్నీ యీ రోజుల్లో అధికారం వున్నవాడి చేతుల్లోనే వుంది" అని ఒకడంటే—

హెడ్ ఒక ప్రశ్న వేసాడు.

"మీ ముడ్డీ అధికారే కడగాలా?"

అందరికీ కోపంవచ్చి కళ్ళు నిలబెట్టి అతని వేపు చూస్తే హెడ్‌కి నవ్వొచ్చింది. లంచాలు తిన్నవాడు యీ గుంపుమీద బ్రహ్మాస్త్రంలా యింత పెద్ద ప్రశ్న వెయ్యటం నచ్చలేదు వాళ్ళకి. హెడ్డు నిల్చున్నాడు.



"నాది ముప్పయ్యేళ్ళ సార్వీసు. అధికారం అంటే దెయ్యం. అది మోసినోడి బాధ మీకేం తెలుసు?"

"బాధే-కమలాపళ్ళు కొనకుండా తినొచ్చు." అన్నాడు వేణుగోపాలన్.

"చెప్పండి—మీలో యెందరికి అధికారం లేదో?"

"మాకే వుంటే - అన్యాయాలు జరగకుండా చూసేవాళ్ళం! అన్యాయం అని తెలిసి, అన్యాయాన్ని యెంకరేజ్ చేసి, నాలాంటి మంచి వాళ్ళని మోసంచేసి, అధికారం దుర్వినియోగం చేస్తున్నావు" అరిచాడు వేణుగోపాలన్.

"మేమంతా చట్టంకి కట్టుబడి బ్రతికేవాళ్లం. అందుకే అధికారులు మమ్మల్ని రక్షిస్తారని వెళ్తే మమ్మల్ని వారు భక్షిస్తున్నారు" అన్నా డింకొకడు మెల్లగా.

"అయితే మీరంతా అబద్ధం చెప్తున్నా" వన్నాడు హెడ్డు.

"అది చేతనైతే, నీలానే కమలాపళ్ళు తినే వాళ్ళం."

"మీకు అధికారం లేదనకండి. మీకు ఓటు న్నంత కాలం అధికారంవుంది. ఈ ఓటు మీకు నచ్చే అధికారం యెన్నుకునే వోటు. మీమీద దెయ్యంలా కూర్చుంటుంది. దెయ్యం యేం కోరుతుంది? తే-తే- కుంభం పొయ్యి అని కోరుకుంటుంది. అధికార దెయ్యం కోరేది, డబ్బూ, తాగుడూ, ముండే కాదు. దెయ్యం మనిషిని-మాటా, నడతా, జీవితవిధానం-అన్నిటి లోనూ చెడుదారులను పట్టిస్తుంది. ఆ దెయ్యం, ఆ మినిష్టర్ని, పోలీసుని, ఆఫీసర్ని, స్టేషను మాష్టరినీ, యీ హెడ్ కానిస్టేబుల్‌నీ ఆ కళ్ళద్దాల మనిషినీ, మీ అందరినీ ఆవరించింది. రాజకీయాల్లోనూ, ఉద్యోగుల్లోనూ, విద్యార్థుల లోనూ యిక్కడా అక్కడా కాదు ప్రతిచోటా వుంది, ఆ దెయ్యం."

"అయితే బతకడ మెలా?" ప్రశ్నించా డొక ముసలాయన.

"నేనేం చేసాను చెప్పండి?"

"లంచం తిన్నావు."

"నా పై అధికారిని ధిక్కరించినందుకు ఆమాత్రం తృప్తివద్దా? లంచం తిని మేలు చేసానా? కీడు చేసానా?" అన్నాడు హెడ్.

"అమ్ముకున్నోడికి మేలు చేసావు— నాకు కీడు చేసావు" అన్నాడు వేణుగోపాలన్.

"అమ్ముకునేవాళ్ళు అంతమంది—వాళ్ళకు ఆ పూటకు రెక్కాడితే డొక్కాడుతుంది. మీరు రెక్కాడక పోయినా డొక్క కోసం నిల్వించుకున్నారు. ప్రపంచంనిండా మోసం, దగా, కీడు, పాపం—వుంది. లేదన్నవాడు కళ్ల మూసుకుని మాటాడు తున్నాడు. అధికారం వున్నవాళ్ళంతా యెంచుకోడానికి యేం మిగిలింది? మాటాడరేం? చెప్పండి."

ఎవరూ మాటాడలేదు. రైలు ఈలవేసింది.

"ఏది తక్కువ పాపమైతే దాన్నే అధికారి యెంచుకుంటాడు. దాన్నే న్యాయం అంటాడు. యథాప్రజా—తథారాజా" అంటూ హెడ్డు మెల్లగా కదులుతున్న రైలుబండి నించి దిగి పోయాడు.

# గ్రామీణులకు గృహవసతి

ఆంధ్రప్రదేశ్‌లో గ్రామీణ గృహనిర్మాణ పథకానికి ప్రాధాన్యత యిస్తున్నారు. ఈ ఆర్థిక సంవత్సరంలో (1978 - 79) ప్రతి జిల్లాలోనూ, ఒక ప్రయోగాత్మక గృహ నిర్మాణ కార్యక్రమాన్ని అమలు జరుపుతారు.

గృహ నిర్మాణ - పట్టణాభివృద్ధి సంస్థల సాధారణ భీమా సంస్థ, జీవిత భీమా సంస్థలవంటి వివిధ ప్రజాహిత సంస్థల నుండి గరిష్ట స్థాయిలో రుణ సహాయం సేకరించేందుకు కృషి జరుగుతున్నది. గ్రామ ప్రాంతాలలో 50 వేలు, పట్టణ ప్రాంతాలలో మరొక 50 వేల శాశ్వత గృహాలను నిర్మించే కార్యక్రమం త్వరలో ఆరంభమౌతుంది.

బలహీన వర్గాలలో వివిధ తరగతులకు చెందిన ప్రజల అవసరాలను, ప్రాధాన్యతలను దృష్టిలో వుంచుకొని గృహాల నమూనాలను రూపొందిస్తారు.

**డి.జి.స.పౌ.సం.శా.**

46/78-79






కొత్త సినిమా రిలీజయింది. మా ఆవిడ ఉదయం నుంచీ ఒకటే హడావుడి పడిపోయింది. సినిమా వచ్చిన రోజే చూసెయ్యాలి. చాలా మందిలా ఆమెకి అదొక గొప్ప. సాయంత్రం ఆరు గంటల ఆటకు వెళ్ళిపోవాలనే ఆరాటం ఒకచోట నిలవకుండా, కూర్చోకుండా ఏదోపని చేస్తూ పిల్లల్ని కసురుకుంటూ తిరిగేస్తూంది ఇల్లంతా

నిన్ననే మా మరదళ్ళు నలుగురు ఎక్కెడెక్కడ వున్నవారూ కట్టకట్టుకుని అక్కను చూడాలని చుట్టరికానికి వచ్చారు. అందులో ఒక మరదలు బీహార్‌నుంచి, ఇంకొక మరదలు ఒరిస్సానుంచి, ఓ మరదలు మధ్యప్రదేశ్‌నుంచీ, వచ్చారేమో' తెలుగు సినిమా చూడాలని కుతూహలపడుతున్నారు. 'బావగారూ టిక్కెట్లు దొరుకుతాయా?' అని ఒకామె అడిగితే, 'తొందరగా ఆఫీసునుంచి వచ్చెయ్యండి బావగారూ!' అని మరొక మరదలంది. 'మీరు వెళ్ళి రారాదూ'' అన్నాను మా ఆవిడతో నెమ్మదిగా. దానికావిడ బుంగమూతి పెట్టి అలుక ప్రకటించింది. 'పొన్లెండి మా వాళ్ళంటేనే మీకు అలుసు. మీరు లేకుండా నే నెప్పుడన్నా సినిమా చూశానేమిటి? మానేస్తాం లెండి. టిక్కెట్లు తియ్యలేం బాబూ!' అని.

'సరే వచ్చేస్తాలే. సాయంత్రం ఐదు గంటలయ్యేసరికి తెమిలిపొండి' అని చెప్పి ఆఫీసుకి ఆవాళ అరగంట లేటుగా వెళ్ళి అరగంట ముందుగా ఇంటికి వచ్చేశాను. మా ఆవిడ, మరదళ్ళు అందాలపోటీకి వెళ్ళేవాళ్ళలా తయారయి వున్నారు. కాఫీ టిఫిను ఆదరాబాదరా అయ్యిందనిపించి పదండి అని వీధివరండాలోకి వచ్చాను

మా ఆవిడ బస్ చార్జీలకు సినిమా టిక్కెట్లకు ఇవిగో డబ్బులు అని నా జేబులో కొన్ని రూపాయల కాయితాలు కూరింది.

ఇంటికి తాళంపెట్టి బస్‌స్టాప్ వైపు నడక ప్రారంభించాము. మా మరదళ్ళు గలగల నవ్వుతూ మాట్లాడుతూ నాతో నడుస్తూంటే, నేను డిగ్నిటీతో, సీరియస్‌గా, హుందాగా, వుండటానికి ప్రయత్నిస్తున్నాను.

తల రేపుకొందని, ముఖాన్ని అద్దిన పౌడరు తుడిచేసుకుంటుందనీ, మా అమ్మాయిని సన్నగా మొట్టి మందలిస్తూంది మా ఆవిడ. నాకు చిరాకేసింది. అక్కడ మా పిల్లల ముఖాలెవరు చూస్తారు? అన్ని ఊళ్లలో సంగతి నాకు తెలియదు కాని మా విశాఖపట్నంలో మట్టుకు కొత్త సినిమా రిలీజు అయిన రోజే చూసెయ్యాలనే యావ చాలామందికి వుంది. సినిమా

బాగుంటుందా, బాగుండదా అనే విషయం ఎవరూ ఆలోచించరు. ఒకసారి చూసెయ్యాలి, అదీ మొట్టమొదటిరోజు చూసెయ్యటం మరీ గొప్ప. సినిమా బాగుందంటేఎన్నిసార్లు చూస్తే అంత గొప్ప కొందరికి.

కొంచం దూరంలో నా వెనక్కి నడుస్తున్న మా ఆవిడ అరిచినట్టు చెబుతోంది 'ఏమండోయ్ డబ్బు జాగ్రత్త టిక్కెట్లు దొరక్కపోతే బ్లాకునన్నా కొనెయ్యండి' అని.

'ఆఁ మహా జాగ్రత్తయిన మనిషివి చెప్పొచ్చావు' కసురుకున్నాను ఆవిడమీద.

బస్‌కోసం నిరీక్షిస్తూ క్షణమో యుగంలా గడుపుతూ బస్ స్టాపులో నిల్చున్నాం. క్షణానికో సారి చేతులకున్న గడియారాల్లో టైమ్ చూసు కుంటున్నారు మరదళ్ళు. నాకూ అలా బస్ కోసం వెయిట్ చెయ్యటం చిరాగ్గానే వుంది. టైము ఆరు గంటలయ్యింది.

పదమూడో నెంబరు బస్సు కిటకిటలాడే జనంతో వచ్చి ఆగింది. ఆ బస్సులో పడాలే కాని అది ఏరోప్లైనులా పరిగెత్తుంది. మా మరదళ్ళకి కూడా బస్సు ఎక్కటంలో మాంచి తర్ఫీదు వున్నట్లుంది. ఆ జనంలో దూరి పోయారు. మా ఆవిడా పిల్లలూ ఎక్కేశారు. తర్వాత నేనూ ఎక్కాను. బస్సెక్కాక మా వాళ్ళెక్కడ వున్నారో నాకు కనుపించలేదు. అస్సలు వాళ్ళెక్కడ వున్నారో చూసే అవకాశమే లేదు. మా ఆవిడ ముందే చెప్పింది 'ఎవరి టిక్కెట్టు వాళ్ళం కొనేసుకుంటాం బస్సు రష్‌గా వుంటుంది మీ టిక్కెట్టు మాత్రమే కొనుక్కోండి' అని.

గజం పట్టుకు వేళ్ళాడుతున్నాను ముందు వెనుక నిల్చున్న జనం ఎటు తోస్తే అటు జరుగుతూ.

నా ముందు నాకు దగ్గరగా నా వైపే తిరిగి నిల్చున్నాడు ఒక సూటు వ్యక్తి. ఖరీదయిన సూటులో ఘరానా వ్యక్తిలా వున్నాడు. సెంటు వాసన గుబాళిస్తూంది. బస్సు గాలితో పోటీ పడుతూ పరిగెడుతూంది. మేం చూడబోయే సినిమా గురించి ఆలోచిస్తున్నాను.

నా చెంప ఛెళ్ళుమంది, జేబులో చెయ్యిపెట్టి డబ్బు లాగేసినట్లయింది.

ఇంచుమించు రెండూ ఒకేసారి జరిగాయేమో. 'కండక్టరుగారూ చూడండి నా జేబు కొట్టేశాడు దొంగ వెధవ' అని నా కాలరు పట్టుకున్నాడు సూటు వ్యక్తి.

నేను ఎంతో నిజాయితీగా మెసులుకుంటూ ఆఫీసులో మంచిపేరున్న నేను దొంగవెధవనా? దిమ్మెరపోయాను. ఎవరి డబ్బు ఎవరు తీశారు. ఎవరు దొంగవెధవ. నా కంతా అయోమయంగా వుంది. అప్రయత్నంగా నా జేబుమీదికి నా చెయ్యి వెళ్ళిందో మళ్ళీ నా చెంప ఛెళ్ళుమంది. ముఖం జుమాల్ మంది. కళ్ళు చీకట్లు కమ్మినట్లయాయి.

దొంగ రాస్కెల్ దింపండి క్రిందకు. బస్సులో కలకలం. నా వళ్ళు హూనమయిపోతూంది.నా చెంపలు కందిపోతున్నాయి. నేనేమో చెప్పాలనుకుంటున్నాను. నన్నెవరూ మాట్లాడనివ్వటం లేదు. 'నేను దొంగను కాదు.' అనే నా మాట ఎవరూ వినిపించుకునేట్టు లేరు. ఇంత గందరగోళం జరుగుతూంటే నా భార్యా మరదళ్ళు ఎందుకు జోక్యం పెట్టుకోలేదో నాకు అర్థంకావడం లేదు. నేను సిగ్గుతో చచ్చిపోతున్నాను.

సూటు వ్యక్తి చకచకా రూపాయల కాయితాలు లెక్కెట్టుకుంటున్నాడు అంత రష్‌లోనూ.

నేను దొంగను కాను అని అరవబోయినా నా నోరు అతని చేతిలో మూతబడింది. ఎవరో నా మెడమీద చెయ్యించి ముందుకి తోశారు. బస్సాగింది. నన్ను క్రిందికి తోసేశాడు. నా జేబులోని డబ్బు కొట్టేసి నా చెంప ఛెళ్ళుమనిపించి నన్ను దొంగ వెధవను చేసి బస్సు దింపాడా? ఎంత దారుణం! కలో వాస్తవమో తెలియని పరిస్థితి క్షణం. ఇది కల అయితే బాగుండుననిపించింది మళ్ళీ కాని ముఖమంతా మంటగా, నొప్పిగా, పచ్చిగా వుంది. మెడ జవలు సలుపుతున్నాయి. నన్ను దింపిన బస్సు రయ్యిన దూసుకు పోయింది. వెధవబస్సు. కసిగా తిట్టుకున్నాను.




బస్సులో వుండి ఏ రకంగానూ ఆదుకోని నా భార్యా మరదళ్ళమీద కోపంతో జగదాంబ సినిమాహాలు వైపు నడిచాను

మా పరాలమంతా అక్కడ నా కోసమే చూస్తూ నిల్చున్నారు నా చెంపలు వాచి ముఖం వుబ్బివుంది కాబోలు మా ఆవిడ నన్ను చూస్తూనే 'అదేమిటండీ ముఖమలా వుంది? మీరెక్కడ దిగిపోయారు? ఇంతాలశ్యం చేశారేమిటి? ఇవ్వాళ ఇహ టిక్కెట్టు దొరకటం సినిమా చూడటం పట్టిదే' అంది. సినిమా చూడటం పడదేమో అనే బాధ నేను ఆలస్యం చేశాననే కోపం మిళితమై ధ్వనించాయి గొంతులో మరదళ్ళు నిరుత్సాహంగా కాస్త విసుగ్గ మాశారు నా వైపు

నాకు గొంతునిండా కోపం వచ్చింది వళ్లు మండిపోయింది. 'నువ్వెక్కడ చచ్చావ్?' అన్నాను గొంతు చించుకుని అరిచినట్టు.

"అదేమిటండీ అలా కోపగించుకుంటారు? ఆ బస్సులో ఏ మనిషి ఎక్కడ వున్నారో చూసే అవకాశముందా? మేమంతా ముందున వున్నాం మీరు వెనకున్నారాయె అందులో ఎవడో దొంగ వెధవ ఎక్కి ఎవరి డబ్బులో కొట్టేశాడు కూడాను. అయినా మీ రెందుకు ముందు 'స్టాపు'లో దిగిపోయారు? వెళ్ళి టిక్కెట్ల సంగతి చూడండి" అంది మా ఆవిడ.

బావగారికి కోపం వచ్చిందిలా వుందే! అక్క ముఖమెర్రగా వుంది. వాళ్ళ అక్కతో గుసగుసలాడుతూంది మా మరదలు.

అసలు జరిగిన విషయం ఎలా ఏమని ప్రారంభించి ఎలా ముగించాలో తెలియక 'వెధవ సినిమా పదండి పోదాం' అన్నాను నేను.

"అదేమిటండీ అలా అంటారు! ఇంత దాకా వచ్చాక, ఇంటలో ఏమొచ్చిందంటీ ముఖమలా తేనెటీగలు కుట్టినట్టు కందవెట్టుకుంటారు?' నింద నిష్ఠూరం మాట సాగదీసింది మా ఆవిడ.

నాకు నేను మహా తెలివయినవాణ్ణనీ, నన్నెవరూ సులువుగా మోసగించలేరనీ నమ్మకం సరిగ్గా నాలుగురోజుల క్రితమే, మా ఆవిడ నాకు తెలియకుండా ఇంటి ఖర్చుల కిచ్చిన డబ్బుల్లో మిగుల్చుకుని, ఫారెన్ నైలక్సు చీరకని ఇన్‌స్టాల్‌మెంటు బేసిస్‌లో చేరి నెలకు పదిరూపాయలు చొప్పున కట్టి డెబ్బయి రూపాయలు మోసపోయిందని తెలిసింది ఆ ఎణ్ణి పడ చీవాట్లేశాను.

"మీ ఆడవాళ్ళంతా ఇంతే· బుద్ధులుండవు. మధ్య మహ తెలివయినవాళ్ళలా పోజులు కొడతారు'' అని ఆరోజంతా ఆమెను సాధించాను.

"వాడెంతగా నమ్మించాడో మీకు తెలియదు లెండి. నేను ఒక్కదాన్నే కట్టేనేమిటి? కావాలంటే అడగండి మన వీధిలో ఎంతమంది కట్టేరో? కలెక్టరాఫీసు గుమాస్తాగారి భార్య శారదమ్మగారికి రెండు ఇనిస్టాలుమెంట్సుకే చీర వచ్చింది. పార్వతమ్మకి వచ్చింది మంచి చీర, నలభై రూపాయలకి" అని ఇంకా ఆమె ఏమో చెప్పబోతుంటే 'అస్సలు నువ్వు నన్ను మోసం చెయ్యాలని చూశావు కదే' అని మండిపడ్డాను.

'చెబితే మీరు వప్పుతారుటండీ. ఎప్పుడన్నా వందరూపాయలు చీరకివ్వటానికి సాహసించారా?' ధైర్యం చిక్కబట్టుకుని అడిగేసింది. నాకు రోషం వచ్చి రెండు తగలనిచ్చాను.

"నీ బాబుని పెద్ద కట్నమిచ్చి ఏ ఐ ఏ.ఎస్ ఆఫీసరుకో ఇవ్వమనలేకపోయావా? కొనేవాడు. నైలక్సు చీరలు, కారుల్లో తిరిగేదానవు. రెండువేల కట్నంతో ఈ ముష్టివెధవ నెందుకు పెళ్ళాడావు? వంద రూపాయల చీర కట్టే ముఖమా నీది? నువ్వే అదృష్టవంతురాలివయితే ఈసరికెప్పుడో ప్రమోషను వచ్చేది నాతో చేసేవాళ్ళంతా తాశీల్దారులూ, రివెన్యూ ఇన్‌స్పెక్టర్లూ, డిప్యూటీ తాసీల్దార్లు అయిపోతే నేను ఓ దరిద్రగొట్టుని కట్టుకోవడం వలన ఆ గుమాస్తా వుద్యోగంలోనే గాడిద చాకిరీ చేస్తూ వుండిపోయాను. ఈ ఇరుకిల్లు చాలీ చాలని తిండీ బట్టా ఇదంతా నాకెలా ప్రాప్తించిందనుకున్నావు! నీవలన మోసపోతానేమో! మగవాడ్ని అడిగి చెయ్యాలి ఏ పని అయినా అనే జ్ఞానం వుండొద్దూ? ఆడపెత్తనం మంగలి బాజా అన్నారందుకే. ఈసారెప్పుడన్నా, గిన్నెలు, చీరలూ అని అడ్డమయిన వెధవల్ని నమ్మి డబ్బు కట్టు, డొక్క చీల్చేస్తాను ఇప్పుడు తెలుసుకున్నాను ఇంటి ఖర్చులకని నా దగ్గర డబ్బులు గుంజి దాచగల జాణవని. ఈసారి ఎప్పుడన్నా ఇలాటి వెర్రి వెధవ పనులు చేశావా! చూడు నీ బాబు దగ్గరకు పంపించేస్తాను' అని వార్నింగిచ్చాను.

అప్పటికి మామగారుపోయి నాలుగేళ్ళయింది లెండి. నేను ఎన్ని మాటలన్నా ఆమె కిమ్మనలేదు. గుడ్ల నీరు కుక్కుకుంటూ మౌనం వహించింది. ఆ విషయం అక్కడితో వదలలేదు నేను. నిన్న మరదళ్ళతో మా ఆవిడ తెలివితక్కువగా మోసపోయిందని ఆ కథ చిలవలు పలవలు అల్లి చెప్పి మా ఆవిడని చిన్నబుచ్చాను. మా ఆవిడకు వుడుకుమోత్తన మొచ్చిందిలా వుంది. "మీరెప్పుడన్నా మోస పోతే తెలుస్తుంది నన్ను సాధించటం కాదు" అంది వుక్రోషంగా ఆమె శాపం తగిలిందేమో జరిగిన మోసం తలుచుకుంటూ ఆ ఆశ్చర్యం నుంచి తేరుకోలేకపోతున్నాను. నా జేబులో డబ్బులు తీసి నన్ను దొంగ వెధవా అని చెంప దెబ్బకొట్టి, నా జేబులోంచి తీసిన డబ్బులు అణాపైసలతో లెక్కెట్టేసుకొని నీ జేబులో డబ్బులెన్ని వున్నాయో చెప్పు అని దబాయించి, నా డబ్బులు యితనే తీశాడు అని నేను చెప్పబోయేంతలో నా నోరు మూసి అస్సలు నన్ను మాట్లాడకుండా బస్సు దింపివేసిన అతను మామూలు మనిషా! అందరి దృష్టిలో ఖరీదయిన సూటులో వున్న అతను పెద్దమనిషి. సాధారణ దుస్తుల్లో వున్న నేను దొంగను.

"టిక్కెట్టు తియ్యరా? అలా చూస్తారేమిటండీ!" అంది మా ఆవిడ మళ్ళీ.

"వెధవ సినిమా వెర్రి, పద ఇంటికి" అన్నాను అస్సలు విషయం ఎలా చెప్పటమో తెలియక మాట నమిలేస్తూ. రేపీ విషయం ఆఫీసులో తెలిస్తే అందరూ తన్ను ఎగతాళి చేస్తారు. ఎలా? ఇక్కడితో ఈ క్షణంలో నా జీవితం ముగిసిపోతే బాగుండుననిపించింది. ఆఫీసువాళ్ళు ఎందుకు నవ్వరూ! అందులోనూ శర్మ మరీ సంతోషంగా పగలబడి నవ్వుతాడు నీకీ శాస్తి కావాలిలే అని కసిగా నవ్వుతాడు. ఓసారి శర్మ ఐదు రూపాయల కాయితం దాచేసి అతన్ని ఏడిపించాను.

అవ్వాళ శర్మ ఆదరా బాదరా ఆఫీసుకు ఆలస్యంగా వచ్చాడు. చిరునవ్వుతో విష్‌చేసి ఆలస్యానికి కారణం అడిగాను. 'మా ఆవిడ

పూరికెళ్ళింది వంట అయ్యేసరికి ఆలస్యమైంది' అన్నాడు శర్మ.

"హోటల్‌కి పోలేకపోయేవుటయ్యా" అని నేనంటే, నా ప్రక్కనే కూర్చున్న వెంక టేశం 'అయ్యో రెండు రూపాయలు పెట్టి హోటలు కెళతాడుటోయ్! కావాలంటే భోజనం మానేస్తాడు కాని' అన్నాడు. అందరూ ఘొల్లున నవ్వారు,

శర్మ ముఖం చిన్నబోవటం నేను గమనిం చాను. 'రా కూర్చో ఏం వండుకున్నావు?' అన్నాను నవ్వేస్తూ.

అతను జవాబివ్వలేదు. సీరియస్‌గా సీటులో కూర్చుంటూ జేబులోంచి రుమాలుతీసి ముక్కు తుడుచుకున్నాడు అతనికి ఎప్పుడూ జలుబే అదొక జబ్బు. దానినుంచి ఎప్పుడూ అతను చిరచిరలాడుతూ వుంటాడు. అతను రుమాలు జేబులోంచి తీసేప్పుడు అతని జేబులోంచి ఐదు రూపాయల కాయితం జారి దిగువున పడింది. అది నా కంట పడింది. నెమ్మదిగా వ్రాస్తూన్న కాయితం జారవిడిచి ఆ కాయితం తీసే నెపంతో ఐదు రూపాయల కాయితం తీసి డ్రాయరు మీదున్న పత్రిక మధ్య దాచి ఏమీ తెలియనట్లు నా పని నేను చూసుకోవటం మొదలుపెట్టేను.

శర్మ బాత్‌రూం కెళ్ళినప్పుడీ విషయం నా కో గుమస్తాలకి చెప్పి ఆట పట్టిద్దాం అని ప్లాను వేశాను. మరో అరగంట తర్వాత శర్మ చూసుకున్నాడు జేబు. అందులో ఐదు రూపా యల కాయితం కనిపించక కంగారుపడటం మొదలు పెట్టేడు.

అప్పుడు ఎంతగా ఆనందించాం! 'అమ్మో ఐదు రూపాయలే!' అని ఒకడంటే 'అంత డబ్బు నువ్వు ఆఫీసుకు తేవటం ఆశ్చర్యంగా వుంది. వుత్తదే తెచ్చి వుండవు' అని మరొ కరు. బాత్‌రూమ్‌కి వెళ్ళి పంట్లాంవిప్పి సరిగ్గా చూసుకోవయ్యా అని నేనన్నాను. పాపం శర్మ నిజంగా అలా చూసుకుని వచ్చి నవ్వు తూన్న మా అందరి వైపు చూసి 'ఎవరికన్నా దొరికిందా?' అడిగాడు.

'దొరికితే ఇంతసేపా! సరే నీ ఐదు రూపా యలూ వెతికి యిస్తే మా అందరికీ, పోనీ నాకు వెంకటేశానికి టీ యిప్పిస్తావా?' అడి గాను. శర్మ లోభి. ఎప్పుడూ తను ఆఫీసులో, కాఫీ, టీ లాటివి తీసుకోడు. ఎవరికీ ఇప్పించడు.

"సరే యిస్తాను. వెతికివ్వండి" అన్నాడు కూర్చీ సీట్లో కూర్చుంటూ మేమెవరమో తీశా మనే నమ్మకం రావటంతో నిబ్బరంగా.

పత్రికలో కాయితం ఒక్కొక్కటే తిర గెయ్యి అన్నాను నేను. శర్మ అలానే చేశాడు. అందరూ విరగబడి నవ్వారు. ఐదు రూపాయల కాయితం దొరికిన శర్మ 'టీ'లు తను వద్దన్నా తెప్పించాడు. 'నువ్వూ ఓ కప్పు తాగవయ్యా! ఐదు రూపాయల కాయితం కోసం వెతికి అలసిపోయావు" అన్నాను నేను. అయినా శర్మ 'టీ' తాగలేదు. రోజుమొత్తంలో శర్మను తను ఏదో వేళప్పుడు ఎగతాళిచేసి అందరూ నవ్వుతూంటే బుజాలెగరేసి తనూ నవ్వుతాడు. ఆ శర్మ యివ్వాళ విషయం తెలిస్తే ఎంతగా నవ్వుతాడు! అయినా ఈ విషయం నేను గుట్టుగా వుంచాలి. ఎవ్వరితో చెప్పకూడదు. బస్సు దిగి వస్తుంటే దారిలో డబ్బు జారి పోయిందని చెప్పాలి అని నేను అనుకునేం తలో మా నాలుగేళ్ళ రెండవ అబ్బాయి అన్నాడు.

"అమ్మా! నాన్ననేమో బస్సులోవాళ్ళు కొత్తాలే" అని.

"ఛీ వెధవ నోరు ముయ్యి" అన్నాను.

మా మరదళ్ళకి అర్థమయిపోయింది. పెద వుల మధ్య నవ్వు బిగబడుతూ "బావా! డబ్బు పోయిందా?" అడిగారు.

ఏమని చెప్పను? వెధవ పదమూడో నంబరు బస్సు ఇహ జన్మలో ఎక్కకూడదు అనుకున్నాను.



# విద్యాలయంలో మానవత్వపు పూజారి

బెహరా సాహితి

మీరెప్పుడైనా "ఈశ్వరపురం" వెళ్ళారూ?

ఆంధ్రలో అదో మారుమూల కుగ్రామం. అంతా కలిపి ఆరువందల గడప. ఊరికి పడమటగా కొద్దిదూరంలో సవతిపిల్లలా మాలగూడెం. తల్లిమనసులా చల్లని కోనేరు వూరి మధ్యగా. కోనేరు నానుకుని గంభీరంగా ఆకాశంవైపు చూస్తూ గుడిగోపురం. అందులో అందమైన వేణుగోపాలుడు. ఆయనగారి కిరుప్రక్కలా సత్య, రుక్మిణీను. మూడు అడుగుల ముచ్చటైన విగ్రహం. చేతిలో వేణువు, ముఖంలో చిరునవ్వు, చిరునవ్వులో చిలిపిదనం వసుపుపచ్చని పట్టుపంచ, ధగధగలాడే కళ్ళు. నిలువెత్తు దీపపు సెమ్మల్లో జ్యోతులు అతగాడి అందాన్ని మైమరచి చూస్తూ, నిశ్చలంగా వుండిపోయాయి. ఆయనగారి వంటిని పొళ్ళనగలు దీపపువెలుగులో మరింత జిగేలు మంటున్నాయి.

"రోజురోజుకీ నీ సౌందర్యం క్రొత్త సొగసులు చేర్చుకుంటోందయ్యా స్వామీ. ఈ భువనమోహన సౌందర్యం నాకోసమేనా? ఈ చిన్న గుడిలో నా కోసమా యిలా వుండిపోయావు?"

స్వామి మెడలో తులసిమాల వేస్తూ, చిరునవ్వుతో అడిగాడు కృష్ణమాచారి.

అదే సమయంలో, గుడినానుకునేవున్న ఓ చిన్న పెంకుటింటి వసారాలో, ఊసూరుమని నిట్టూరుస్తూ ఓ చిన్నది అనుకుంది. "ఈ అందమంతా ఎవరికోసం? నాకు నేనే ఆనందించుకోనా?" అని.

"అమ్మడూ! దీపం పెట్టావుకావేం? అబ్బాయి స్నానమయి, దీపారాధనకి వెళ్ళినట్టున్నాడు" మెత్తని మందలింపు ముసలమ్మ మాటల్లో

"ఆ! పెడతా మామ్మా!" అపరాధం చేసినట్టు అనిపించి, చటుక్కున లోపలికెళ్ళింది అనసూయ, ఆ చిన్నది

"ఆ పెట్టమ్మా పెట్టు, పొద్దువాలిపోయింది. పాపంలా చీకట్లు ముసురుకోకముందే" ముసలమ్మ గొణుగుడు మరి వినపడలేదా చిన్నదానికి. కాని ఎందుకో ఉలిక్కిపడింది. అన్యమనస్కంగానే గూట్లోవున్న కిరసనాయిలు దీపం అందుకుని వెలిగించింది. వత్తి కాస్త పెద్దదిచేసింది. చటుక్కున పైభాగమంతా మసిబారిపోయింది. వత్తి క్రిందకి దించింది. వెలగనా, మాననా అన్నట్లు తటపటాయిస్తోంది దీపం. 'హూ కిరసనాయిలు లేనట్టుంది' లేచి వంటింటివేపుగా వెళ్ళింది అనసూయ.

"ఏవిటమ్మా ఆలస్యం?" వసారాలో కూలబడినట్టుంది ముసలమ్మ, లోపలికో కేకవేసింది.

"బుడ్డీలో నూనె అయిపోయింది మామ్మా! పోసి తెస్తున్నా."

"అయ్యో! పొద్దుండగానే చూసుకోరుటమ్మా!"

"అన్నీ ఈవిడికే కావాలి" విసుగ్గా అను ఏంది అనసూయ.

గుళ్ళో గంట వినిపించింది. ముసలమ్మ మెల్లగాలేచి గుమ్మం దిగింది. గుడిలోకి దారి తీసింది.

గుడి ఆవరణ అంతా కలిసి వందగజాలు. ఊరికి మధ్యగా, ముద్దులొలుకుతూ వుంటుంది. గర్భగుడికి ముందు కాస్తంత వసారా. వెనగ్గా ఓ చిన్న గన్నేరు చెట్టు, చుట్టూ తులసిచెట్టూ వున్నాయి.



ఆవరణంతా శుభ్రంగా తుడిచి, నీళ్ళుచల్లి, ముగ్గులు పెట్టివుంటుంది ఎప్పుడూను. గోపురంలో పావురాళ్ళ కాపురం, ధ్వజస్తంభం మీద వాలే పేరు తెలియని పిట్టలు. కృష్ణమాచారి మధ్యాహ్నంపూట చల్లే నూకలుకోసం వచ్చే పిచుకలు, వీటి చిన్నిచిన్ని శబ్దాలుతప్ప, మరే అలికిడీ వినిపించదక్కడ. మంద్రస్థాయిలో కృష్ణమాచారి పాడు భక్తిగీతాలు, ఉచ్ఛ స్వరంతో అతనుచ్చరించే మంత్రాలు, ఈ పిట్టల కలకలలు తప్పించి, ఎప్పుడూ నిశ్శబ్దంగా వున్నట్టే వుంటుందా ఆవరణంతా. గుడి గోడలకి, గోపురానికి వున్న తెల్లసున్నం, మరింత ధవళమై ప్రశాంతతని వెలారుస్తున్నట్టే వుంటుంది.

గోడలకి మధ్యమధ్య గీసిన ఎర్రనిగీతలు మహాగంభీరంగా కనిపిస్తాయి. ఎంతో చిన్న ఆలయమే అయినా, ముఖద్వారం దాటి లోపలి కడుగు పెట్టగానే మనకి తెలియకుండానే, ఏదో గంభీరము, ప్రశాంతము, విశాలము అయిన ప్రపంచంలోకి అడుగు పెట్టినట్లుగా వుంటుంది. ఒక్కసారి చల్లగా అయిపోతుంది మనసంతా.

మౌనం పాటించవలసిందని, విన్నపాలు, హెచ్చరికలు అక్కడ రాసిలేవు. అయినా, హఠాత్తుగా నోళ్ళు మూతబడిపోతాయి.

అజ్ఞాతంగా ఎవరో, "ఎందుకు వృధా మాటలు! ఇటు చూడరాదూ, కళ్ళు, మనసు విప్పుకుని" అన్నట్లు వుంటుంది. ఎదురుగా దేదీప్యమానంగా వెలుగుతూ వేణుగోపాలుడు. కాని అక్కడ మాత్రం మహాసందడి సుమండీ. చేయెత్తు దీపపుసెమ్మెల్లో వెలుగులుచిమ్మే జ్యోతులు. ఆ వెలుగుల్లో మరింత నల్లగా మెరుస్తూ కొంటెగా నవ్వే గోపాలుడు. తళతళలాడే నగలు, కలకలలాడే పూవులు. మితిమీరిన భక్తి పరవశతతో మంత్రాలు చదువుతూ కృష్ణమాచారి. మళ్ళా ఆ గర్భగుడిలో....అదో ప్రపంచం.

భక్తిగా నమస్కరించింది ముసలమ్మ. కృష్ణమాచారి ఓ చూపు ఇటు చూసి, మళ్ళా అటు తిరిగి అందుకున్నాడు "ఓం ముకుందా నమః" అంటూ. గర్భగుడికెదురుగా, ధ్వజ

స్థంభానికి చుట్టూ కట్టిన సిమెంటుగట్టుకి చేర్లబడి కూచుండిపోయింది ముసలమ్మ.

"చీకట్లు ముసురుకోకముందే దీపం వెలిగించాలని తెలియదూ పిల్లదానికి" కాస్త విసుగ్గా అనుకుంది లోపల్లోపల, "హూ! ఏం పిల్లో! అదేం వాలకమో! అత్తగారుంటే అదో దారి. అత్త, మామ లేని కాపరం, అయితేనేం. ఎన్నిజన్మల పుణ్యమో కృష్ణమాచారి పెళ్ళాం అయింది" ముసలమ్మ, కళ్ళు చిట్లించి, లోపలికి చూసింది. హారతి యిస్తున్నాడు కృష్ణమాచారి. హారతి వెలుగులో వేణుగోపాలుడిని చూడలేదు ముసలమ్మ. శాంత, గంభీరమైన చిరునవ్వుతో నిశ్చలంగా నిలబడ్డ పూజారి ముఖమే కొత్తగా చూస్తున్న దానిలా చూస్తోంది. మూడుపదుల వయసు లేదు నాయనకి. మూడుకాళ్ళ ముసలాడికి పుట్టని వైరాగ్యం, యిప్పుడే పుట్టింది. మడి పంచె, జారుముడి, పట్టెనామం, పరమ భాగవతోత్తముడిలా వుంటాడు. పన్నిద్దరాళ్వారులలో ఎవరో ఈ చిట్టితండ్రి? ముసలమ్మ కళ్ళు చెమ్మగిల్లాయి. ఇంతలో పట్టుచీరల రెపరెపలు, గాజుల గలగలలు, నవ్వుల కిలకిలలు. గుమ్మందాటి రెండడుగులు వేయగానే, మౌనంగా, వినయంగా తలదించి, ముందుకు నడిచారు.

"ఎవరూ? నువ్వా ధనమ్మా! ఏమిటీ? ఓహో! కొత్తకోడలా! అప్పుడే కాపరానికొచ్చిందన్నమాట. బాగుందమ్మా! బాగుంది. దైవదర్శనానికి తీసుకొచ్చావన్నమాట. మంచిపని చేశావు. ఏదీ ఇలా రావే పిల్లా! మళ్ళీ ఏటికి నీలాంటి కొడుకు నివ్వమని కృష్ణుడికి దణ్ణం పెట్టుకో!"

ముసి, ముసి నవ్వులు నవ్వింది కోడలు. అత్తగారూ నవ్వింది చిన్నగా. అంతలోనే ఏదో గుర్తువచ్చినట్లు గుళ్ళోకోసారి చూసి, ముసలమ్మ పక్కనే చతికిలబడుతూ రహస్యంగా అడిగింది.

"ఏం గౌరంపిన్నీ మనవడాలు నీకు ముని మనవడ్ని ఇచ్చేదుందా లేదా? మూడేళ్ళు కావస్తోంది పెళ్ళయి?"

"ఏమో ఓల్లీ! ఆ చక్రధరుడికి ఇంకా దయ కలగలేదు. మునిమనవడ్ని ఎత్తుకుంటేగాని ఈ జీవుడికి మోక్షం లేదు మరి" బోసినోటితో నిండుగా నవ్వింది

కుతూహలంగా చూస్తున్న కోడలితో, "ఆ పూజారిగారి మామ్మ ఈవిడ పూజారిగారికి తల్లీ, తండ్రీ కూడా పోయారు. ఆయనొక్కడే కొడుకు. ఈ అవ్వగారే సాయం, ఆచిన్న వాళ్ళిద్దరికీను." అంటూ పరిచయ వాక్యాలు పలికింది అత్తగారు.

"ఏం సాయంలే, ముసిలిముండను, నేనూ ఓ సాయవే" దీర్ఘంగా నిట్టూర్చింది. నిట్టూర్పులో నిష్ఠూరం ధ్వనించి,కుతూహలం రేగింది అత్తగారిలో.

"ఏం పిన్నీ, అనసూయమ్మ సఖ్యంగానే వుంటుందా?" ఆరా తీసే ధోరణిచూసి, ముసలమ్మకి మండింది

"నా కోడలికి కోడలుగాని, నా కొ్కడలు కాదుగా, అందువల్ల సఖ్యంగానే వుంటుంది" అంది, కొత్తకోడలివేపు సాభిప్రాయంగా చూస్తూ. చురుక్కుమంది ఆ ఇద్దరికీను. ధనమ్మగారికీ, కోడలికీ మధ్య అప్పుడే రవరవలకి నాంది పడిందని వూళ్లో ఆడంగులంతా చెవులు కొరుక్కోడమే అందుకు కారణం చటుక్కున లేచి, "అమ్మాయ్ దా, అదిగో వారి చేతికియ్యి అరటిపళ్ళు, కొబ్బరికాయాను" అంటూ గర్భగుడిలోంచి బయటికొస్తున్న, కృష్ణమాచారితో నవ్వుతూ చెప్పింది "అబ్బాయి పేర అష్టోత్తరం చేయించండి" అని.

"అలాగేనమ్మా" సౌమ్యంగా, చిరునవ్వుతో చెప్పి, లోనికి వెళ్లాడు. కళ్లెత్తి ఎవరినీ కూడా చూడడు. ఆ ముఖంలో ఆ చిరునవ్వు ఎప్పుడూ ఒక్కలాగే వుంది చిన్నవాడైనా, చెయ్యెత్తి దణ్ణం పెట్టాలని వుంటుంది. ధనమ్మ లోపలే అనుకుంది.

'నడకలో నెమ్మది, మాటలో సౌమ్యత, ముఖంలో శాంతం, ఓ మహర్షిలా వున్నాడు. ఇంత చిన్నవయసులో అంత పెద్దతనం ఎలా అబ్బిందో' కొత్త కోడలికి ఆశ్చర్యంగా అన్పిం

చింది. అతడు తీర్థ, ప్రసాదాలు అందిస్తుంటే చూసింది. అతగాడు కళ్ళెత్తలేదు. అలాగని ముఖం దించుకునీ లేడు, ఆ చూపులు....అవి ఎటో వున్నాయి.

*  *  *

"అనసూయమ్మా! ఇలా రద్దూ ఓమారు!" ముసలావిడ కేకకి త్రుళ్ళిపడింది అనసూయ. నూతి వళ్ళెం దగ్గర బాల్చీలో బట్టలు జాడిస్తున్నది. తలెత్తి ఓమారు అటువేపు పిట్టగోడ దగ్గర నిలబడ్డ శాస్త్రీని చూసి, రెప్పలు టపటప లాడించింది. చిన్నగా నవ్వి, గాలిలోకి ఓ ముద్దు విసిరి, పక్కకి తప్పుకుంది చెట్ల చాటుకి....ఆ శాస్త్రి. గుడికి ఉత్తరంవేపున పూజారికి గల చిన్న పెంకుటిల్లు తప్ప మరి ఆ వీధిన యిళ్ళు లేవు. అర ఫర్లాంగు దూరంలో పెరట్లోవున్న నూతి దగ్గర్నుంచి, ధనమ్మగారి పెరడు కనిపిస్తూ వుంటుంది. అసలు కృష్ణమాచారివున్న యిల్లు దేవాలయంలో ఓ భాగమే అని చెప్పవచ్చు. గుడిగంటలూ, కృష్ణమాచారి పూజా తప్ప,అనసూయకి రోజల్లా మరోమాటా పలుకూ వినిపించదు. అంతా నిశ్శబ్దం. దానికి ప్రశాంతత అని పేరు పెట్టుకోవచ్చనుకోండి నచ్చినవాళ్ళు! కాని అనసూయకి నిశ్శబ్దం నచ్చదు. పరిసరాల్లోనే కాక వడకలోనూ కృష్ణమాచారి 'నిశ్శబ్దా'న్ని భరించడం అనసూయ తరం కాలేదు. 'మరందుకే ధనమ్మగారి రెండోకొడుకు తనలో సృష్టిస్తున్న సంచలనంతో, యీ ముని ఆశ్రమంలాంటి కొంపలోగల నీరస, నిర్జీవ, నిరర్థకమైన బ్రతుకుని ఎలాగో వెళ్ళదీస్తోంది.'

విసురుగా బాల్చీ తీసుకుని, గబగబ కాళ్ళు చప్పుడుచేస్తూ నడిచివస్తున్న అనసూయను, బుగ్గమీద చేయించుకుని, చురచుర చూస్తూ నిలబడి వుంది ముసలమ్మ. గతుక్కుమంది అనసూయ.

'వంటింట్లోంచి పిలిచింది. ఇంతలోనే పెరట్లో కేప్పుడొచ్చి పడిందో? అతన్ని.... అతన్నిగాని చూడలేదుకదా!' ఎదురుగా చూసింది.

"అనసూయమ్మా!"



## 'బుడుగు ఏశ్వరయ్య బట్టల దుకానం!'

టాంకు బండిమీద ఓ పసికూన గట్టిగా ఏడుస్తున్నాడు. అతని ఏడుపు విని చుట్టూ పది మంది పోగయారు. ఆ గుంపులోంచి ఓ మధ్య వయస్కురాలు ఆ పసివాడి దగ్గరకు వచ్చి "ఏడవకు నాన్నా ఏడవకు - తప్పిపోయావా?" అని అడిగింది. ఆ పసికూన ఏడుపు ఆపి తనను ఆప్యాయంగా పలకరించిన మధ్య వయస్కురాలికేసి, చుట్టూమూగిన జనంకేసి ఓ చూపు పారేసి - మరింతగా జనం పోగవనిచ్చి........ అప్పుడు గట్టిగా అరుస్తూ ఇలా అన్నాడు.

"అవును, నేను తప్పిపోయాను. బుడుగు ఏశ్వరయ్య మా నాన్న. ఆయనకి బట్టల దుకానం ఆబిడ్సులోని జి. పి. ఓ. ఆఫీసుకు ఎడంప్రక్క మూడవ సందులో ఉంది. ఆ దుకాణంలో పురుషులకు కావలసిన అన్ని రకముల షర్టులూ సూటింగులూ, స్త్రీలకు అన్ని రకములైన నూలు పట్టుచీరలూ సరసమైన ధరలకు దొరుకుతాయి. ఇంతెందుకు పిన్నల నించి పెద్దలవరకు కావలసిన దుస్తులన్నీ ఈ సిటీలోని అన్ని వస్త్రషాపులలో కన్నా తక్కువ ధరలో మేలురకంవి లభ్యమవుతాయి. అక్కడకు చేర్చండి నన్ను!"

— నాని

ఆగింది.

"నీ మొగుడి తాతముత్తాతల దగ్గర్నుంచి, ఈ కృష్ణపరమాత్మకి పూజారిత్వం నెరుపుతున్నారు," ఎందుకు చెప్తుందో అర్థంకాలేదు.

"ఈ దేవాలయమే వాళ్ళ ప్రపంచం అందులోనే ఒదిగిపోయారు నీ అత్తగారి, అత్తగార్లు కూడాను, ఇలా చూడు "

"ఊ " బాల్చీ చేతిలోనే పట్టుకుని, ఎందుకో అధైర్యంగా చూసింది.

"నీ పేరు నీకు తెలుసుకదూ"

ముసలమ్మ చూపు, కంఠం తనలోని చైతన్యాన్ని పటకారుతో నొక్కి, వూపిరాడకుండా చేస్తున్నట్టయింది.

"ఈ పేరంటే ఈ నాటికి నువ్వు పెట్టుకున్నావుగాని, ఆ పేరుకే పెద్దరికం తెచ్చారు ఈ వంశంలోని కోడళ్ళు. నువ్వు కళంకం తేకు సుమా'"ముఖం త్రిప్పుకుని ముసలమ్మ,విసవిస నడిచింది వంటింటివేపు స్థాణువైపోయింది అనసూయ.అలా ఎంతసేపు నిలబడిందో తెలియదు. చివరకి తనమీద తనకే జాలి కలిగింది.

"మామ్మా' సాయంత్రం స్వామివారికి చక్రపొంగలి చేసిపెట్టాలి. అనసూయేదీ' చెప్పు తనతో." కృష్ణమాచారి వేదాంత గ్రంథాలమధ్య నుంచి, మామ్మకి గుర్తుచేశాడు ఆ కంఠంవిన్న అనసూయలో కోపం బుస్సున పొంగింది ఆ రాతికి పెట్టిన నైవేద్యంలాగే వుంది, తన యౌవనమూను. ఆయనెంత ఆరగించాడో, ఈయనా అంతే అనుభవించాడు

ఆరగించే దేవుడికే నైవేద్యం పెట్టాలన్నది అనసూయ అభిమతం.

ర ర ర

సాయంత్రం ఆరు అయేసరికి కృష్ణమాచారి ఆరు నూరైనా, స్నానం కానిచ్చి, మడిబట్టలతో ముఖాన నామాలతో, గొంతెత్తి శ్లోకాలు చదువుకుంటూ, కృష్ణ విగ్రహానికి అలంకరణలు చేస్తూ వుంటాడు. పూజ చేయించేందుకు ఎవరేనా వస్తూ వుంటారు. శ్రద్ధగా, భక్తిగా అర్చన చేసి అపురూపంగా తీర్థ ప్రసాదాలనందిస్తాడు. వారూ వెళ్లాకా, రాత్రి తొమ్మిదిదాకా ధ్యానంలో గడుపుతాడు. ముసలమ్మకూడా నిశ్శబ్దంగా ఆ గుడిలోనే ఓ మూల ఒదిగి భగవత్సంకీర్తనం చేస్తూ వుంటుంది. ఇద్దరూ కలిసి, ఇంట్లోకి నడుస్తారు, కృష్ణమాచారి గుడి తలుపులు తాళం వేసుకుని, మామ్మ చేయి పట్టుకుని నడిపిస్తుండగా. అనసూయ కాపురానికి వచ్చిన తరువాత ఏనాడూ ఈ కార్యక్రమం తప్పడం జరగలేదు

ర ర ర

హారతి యిచ్చి, పళ్ళెం కిందపెట్టి ఇవతల గుమ్మంలో కాలుపెడుతూనే "మామ్మా!" అన్నాడు కృష్ణమాచారి.

ధ్వజస్థంభాని కానుకుని కూచున్న ముసలమ్మ వణుకుతోంది.

"జ్వరం తిగిలినట్టుందిరా నాయనా'"

"అయ్యో! పద లోపలికి. మంచు పడుతోందికూడాను," జబ్బ పట్టుకుని లేవదీసి, ఆసరా యిచ్చి, నడిపించాడు

గడియారం ఒక్కటి కొట్టింది ఆలయం మెట్లు దిగి, తన యింటి మెట్లెక్కుతూనే "అనసూ మామ్మకి చూడు జ " అతని మాటలు నోట్లోనే వుండిపోయాయి తన యింట్లోంచి బయటకు వస్తోన్న వ్యక్తినిచూసి, ఆశ్చర్యంతో ఆగాడు. కళ్ళు పెద్దవి చేసింది ముసలమ్మ. జ్వరం మాట మరిచింది నిటారుగా నిలబడింది. పూజారి యింటి పై మెట్టుమీద అతను, క్రింద మెట్టుమీద కృష్ణమాచారి అతను వెలవెలపోయాడు ఏదో చెప్పబోయాడు తెడబడుతూ "మందు మందు కస్తూరి మాత్రలు వున్నాయేమో అమ్మ తెమ్మంటే" పూజారి కళ్ళలోంచి తెల్లని ఐరావతమేదో తన మీద దూకబోతునట్టు, మంచు శిఖరాలు కూలి పడబోతున్నట్టూ, పాల సముద్రంలో ఈతరాక మునిగిపోతున్నట్టు ఏమిటో ఏమిటో అర్థంకాని భయం ఒళ్ళంతా గడ్డకట్టించింది

అప్రయత్నంగా ముసలమ్మ అనేసింది.

"ఓరి అప్రాచ్యుడా!"

"మామ్మా!" కృష్ణమాచారి సన్నగా ఒణికాడ.

ఏడుపు ముంచుకొచ్చింది ముసలమ్మకి.






అంతలో గుమ్మందగ్గరకొచ్చి నిలబడింది అనసూయ. చెదిరినజుట్టు, చెరిగినబొట్టు. విస్మయంగా చూచాడు కృష్ణమాచారి. ఆ వ్యక్తి గబగబ తప్పించుకుంటూ పరుగులా నడిచాడు ముఖం దించుకుని.పరిస్థితి అర్థమైన అనసూయ నిర్జీవప్రతిమలా నిలబడింది ముసలమ్మకంత శక్తి ఎలా వచ్చిందో, గబగబ మిగిలిన ఆ నాలుగు మెట్లూ శరవేగంతో ఎక్కేసింది. గది మధ్యగా వేళ్ళాడదీసిన లాంతరు గుప్పు గుప్పుమంది.

"పాపాత్ములారా!" అంటూ ముసలమ్మ అనసూయ జడను మొదట్లో పట్టుకుని, ఒక్క గుంజుగుంజింది.

"ఎప్పుడో కనిపెట్టేనే నీ విషయం. ఇంతకి తెగిస్తావని అనుకోలేదు. పాపీ! ఒసే భ్రష్టా! ఎన్ని జన్మల పాపయో నీ రూపాన ఈ నాడు తటస్థపడింది మాకు. నిన్ను కన్నతల్లి ఎలాటిదో నీ తండ్రి ఎటు "

"మామ్మా!" ఆవేశంతో వణికిపోతున్న ముసలమ్మని రెండుచేతులతోనూ పట్టుకుని, శాంతపరిచే ప్రయత్నంచేసాడు, వీపుమీద రాస్తూ.

"నా తండ్రిని ఈ చిన్నతండ్రిని పరమభాగవతోత్తముడు కదే అయ్యో ఎంత పిశాచివే " ముసలమ్మకి ఏడుపుతో మాట పెగలటంలేదు.

భయం, శోకం, పశ్చాత్తాపం...అనసూయకి మరి నిలబడే శక్తి లేకపోయింది. నిశ్చలంగా ఇటే చూస్తున్న కృష్ణమాచారి కళ్ళలో సాక్షాత్తు వేణుగోపాలుడే చిరునవ్వుతూ కనిపించాడు

అతని ముఖంమీద లాంతరు వెలుగు మరింత ప్రకాశమానంగా కనిపించింది. ముఖం మీద నామాలు త్రిశూలంలా కనిపించాయి. అతని కళ్ళలో కనిపించే విస్మయం, ఆమెని నిలువునా క్రుంగదీసింది. అప్పుడే, తనని పట్టిన దెయ్యం వదిలివెళ్ళిందని తెల్సుకున్న దానిలా, గజగజ వణికింది.

"భయమెందుకు అనసూయా?" దగ్గరగా రాబోయాడు.

చటుక్కున వెనకడుగు వేసింది.

"పాపిష్ఠిదాన్ని తాకకురా నాయనా!" ముసలమ్మ అరిచింది.

"నువ్వు పడుకుందుగాని పద మామ్మా!" నడిపించుకు వెళ్ళాడు. కుప్పలా అక్కడే కూలి, కుళ్ళి, కుళ్ళి ఏడవసాగింది అనసూయ.

ముసలమ్మ తిట్లు, గొణుగుడు, మూలుగు

వరసగా వినిపిస్తూనేవున్నాయి అనసూయకి. కృష్ణమాచారి మాట, పలుకులేదు.

గడియారం పదకొండు గంటలు కొట్టింది.

"మామ్మా!" కృష్ణమాచారి గొంతు మృదువుగా వినపడింది.

"ఊ!"

"చిన్నప్పుడు .... అదే .... ఓసారి నాకు వల్లమాలిన జ్వరం వచ్చింది! జ్ఞాపకముందా?"

"ఎప్పుడూ...."

"అదే మామ్మా! తాతయ్య పోయాక...."

"ఆ .... ఆ .... జ్ఞాపకముంది. మూణ్ణెల్లు మంచంలో పడి .... మాయదారి రోగం.... నీ ప్రాణాలు పీల్చి పిప్పిచేసింది కాదూ...."

"మరే!"

"అదెందుకు గుర్తుకొచ్చిందిరా నాయనా!"

"మరేం లేదూ! చేదుగా, ఘాటుగా కషాయాలూ, మాత్రలూ నూరిపోసేవారు కదూ నువ్వు, అమ్మాను."

"ఆ." నీరసంగా ముసలమ్మ గొంతు. అందులో జ్ఞాపకాల బరువు.

"చాటుగా మాటుగా బెల్లం డబ్బాదగ్గర చేరేవాడ్ని. కాస్తంత వూరగాయముక్క దక్కించుకుని చప్పరించేవాడ్ని, గుర్తుందీ?"

"మరే! మరే!" హాసరేఖ, వేదనాభరితమైన ముడుతలమధ్య, సన్నగా పాకింది.

"అమ్మ, నువ్వు మందలించేవారు ఔనా."

వంగి, ముసలమ్మ తలమీద చేత్తో రాస్తూ, తలగడ సరిచేస్తూ, అడిగాడు.

"కాక....కటికపత్యం చెయ్యాలని మీనాన్న ఆదేశం.నువ్వు... మరి....అయినా చిన్నవాడివి. అంత కటికపత్యం నీవల్ల నవుతుందా? నోరు వూరుకునేది కాదు చిన్నముండకి." వంగిన మనవడి బుగ్గలు పుణికింది.

"పాపం! ఎన్ని కోరికలు, కలలు! కటికపత్యం ఆ పిచ్చిది... అనసూయకి మాత్రం సాధ్యమా మామ్మా!"

"ఏవిటీ?" వింటున్న అనసూయకీ, ముసలమ్మకీకూడా వెర్రిచూపు పడింది.

కృష్ణమాచారి చెప్పుకుపోయాడు.

"నా పొరపాటూ ఇప్పుడే తెలిసింది మామ్మా! ధర్మార్థ కామ, మోక్షాలలో, మోక్షాన్ని చివరికే చేర్చారు. సంసారమంటూ ఏర్పరచుకున్నాకా, ఓ యెద్దు మరీ ముందుగా గమ్యం చేరుకుందామని గంతువేస్తే, మరో యెద్దు ఏం చేయగలదూ? కూలబడదూ! దాని కాళ్ళ శక్తికూడా చూడాలిగా! దాని కాళ్ళకీ అటువంటి శక్తినిచ్చే ప్రయత్నమే చేయక పోవడం నా తప్పే, కాదంటావా మామ్మా!"

"అయితేమాత్రం...."

"మామ్మా! ఆకలి బాధకి ఓర్చుకోలేక వ్యాసులంతటివారు కాశిని శపించబోయాడు."

"ఏమైనా నీలాంటి పుణ్యాత్ముడ్ని...."

"మహామునీశ్వరుడు గౌతములవారి సాహచర్యంలో అన్నాళ్ళుగడిపిన అహల్యాదేవి...."

"నీ ముందు నేను మాటాడలేనురా నాయనా! కాని నా కడుపు మండిపోతోంది."

"ఇంద. చల్లని యీ మజ్జిగ తాగు!" అంటూ లేచివెళ్ళాడు. మళ్ళీ వచ్చి పక్కనే కూచుని "తప్పుచేసిన బిడ్డని తన్ని తగిలెయ్యావు కదా! తల్లి మనసు తెలీదూ! కృష్ణమాచారి మామ్మ అంటే సామాన్యమయిన ఆడదనుకుంటుందా ప్రపంచం! అందరిలాంటి దానివి నువ్వూ అయితే....ఈ కృష్ణమాచారికి మామ్మవెలా అవుతావు? ఆలోచించు." చిన్నపిల్లని బుజ్జగించినట్టు బుజ్జగించాడు. తెల్లవార్లూ ఏదో చెపుతూనే వున్నాడు. నెమ్మదిగా, మృదువుగా బోధనలు చేస్తూనే వున్నాడు. ముందు గదిలో గోడకి జేర్లబడి శూన్యమైన చూపులతో నిస్త్రాణంగా కూర్చుని వుంది అనసూయ రాత్రి తెల్లవార్లూ.

తెలతెలవారుతుండగా, తల కొద్దిగా పక్కకి వాలింది. కళ్ళు అరమూతలు పడుతున్నాయి అప్పుడే.

"అనసూయా?" వంగి, భుజంమీద చేయి వేస్తూ పిల్చాడు.

ఉలిక్కిపడింది. ఎవరూ? ఎవ....ఓ....ఎర్రబడ్డ కళ్ళెత్తి, అయోమయంగా చూసింది.

గౌతముడా? .... గౌతమమహర్షా .... అబ్బే ....కాదు కాదు....ఆ కళ్ళల్లో ఎంత కరుణ! కణ్వమహర్షిలా వున్నాడు. □

మినీ కథ:

# అడ్వెంచర్

అడ్వెంచర్సన్నా, ఆపదలో వున్న అందమైన ఆడపిల్లలను ఆదుకోవటమన్నా అప్రావుకు అంతులేని సరదా. మహా సరదా. అందుకే ఆ సరదాకుపోయి, అప్పుడప్పుడు ముప్పు తెచ్చిపెట్టుకోవటం కూడా ఓ హాబీయే.

ఆ రోజు ఆదివారం. ఏం చేయాలో తోచలేదు. మామూలుగా అయితే రోడ్డుమీద చక్కర్లు కొడుతూ యేవేవో అడ్వెంచర్సులోనో మునిగి తేలుతుండేవాడు. కాని యీ ఆదివారం వుదయంపూట ఆ అవకాశాలంతగా కనుపించలేదు.

కాని అంతమాత్రానికే క్రుంగిపోయే మనస్తత్వం కాదు అప్రావుది. పట్టువదలని విక్రమార్కుడేలిన దేశంలో పుట్టిన ఓటరు అప్రావు. ఫాదరాఫ్ ది నేషన్ దగ్గర్నుంచి పుచ్చుకున్న సహన ముందతడిలో. అంతెందుకు వున్నపాటున అప్రావును అమాంతం ఏ మాంసం కొట్టుకో తీసుకెళ్ళి కోస్తే, ఓ యాభై కిలోల మాంసం, పావుకిలో తెలివి, అరకిలో ధైర్యం, పాతిక్కిలోల ఓపిక, యాభై కిలోల దయాగుణం, జేబులో ఓ యాభై పైసల నాణెం తప్పకుండా కనిపిస్తాయి.

పైగా క్రితం రాత్రి చూసిన సినిమాలో రిక్షా లాగే హీరోను, రైలుబండి నడిపే....ఛ ఛ....కారు నడిపే హీరోయిను అమాంతం వాటేసుకుని లవ్వాడటం చూసిం దగ్గర్నుంచి అప్రావు వొళ్ళు కోడి శరీరంలా ఒకటే వెచ్చబడి పోవటం మొదలయ్యింది.

సిటీలో అటూ యిటూ తిరిగి, చెయ్యాల్సిన అడ్వెంచర్సేమీ కనిపించకపోతే, "లెటజ్ ట్రై అవర్ లక్" అనుకుని సిటీ పొలిమేరల్లోని కొచ్చాడు.

ఓ కొండరాయిమీద కూర్చుని, గలగల పారుతున్న కాలువనూ, గబ గబా పరుగెత్తుతున్న ట్రాఫిక్‌ను చూస్తూ కూర్చుండిపోయాడలా యెంతసేపో!

"హెల్ప్....హెల్ప్...రక్షించండి....రక్షించండి" అన్న కేకతో వులిక్కిపడి ఆలోచనల్లోంచి తేరుకుని యీ లోకంలోని కొచ్చాడు అప్రావు. కాలువ నడి ప్రవాహంలో కొట్టుకుపోతూ ప్రాణభయంతో అరుస్తుందో పిట్ట.చిలకో, కాకో, పిచుకో కాదు. అమ్మాయి. అసలు సిసలైన అమ్మాయి.

అప్పారావులోని సిక్త్ సెన్స్ చకచకా పన్జేసింది. "లే, లే....అవకాశం వుపయోగించుకో, నీ అడ్వెంచర్‌తో ఆమె ప్రాణాల్ని రక్షించు" అంది అప్రావు అంతరాత్మ.

"జై....అప్రావుకీ జై....ఓం" అంటూ యింకేమీ ఆలోచించకుండా కాలువలోనికి దూకేశాడు అప్రావు. బుడుంగున మునిగా డొక్కసారి. అప్పుడతనికి తెలిసొచ్చింది మొదటిసారిగా తనకు యీదటం రాదని.

—మునీర్

# ఒక అత్తయ్య కథ

వసుంధర

నేను అత్తయ్య ఇంటికి వెళ్ళి ఓ వారంరోజులుండి వచ్చాను. ఆ వారం రోజులూ అత్తయ్య నన్ను పూచికపుల్లకూడా ముట్టుకోనివ్వకుండా చాలా అభిమానంగా చూసింది. పనిలో ఏదైనా సాయం చేయనివ్వమని అడిగితే "చూడమ్మా—రేపు పెళ్ళై అత్తారింటికి వెడితే ఎలాగూ తప్పదు నీకు. ఏదో అభిమానంగా వచ్చావ్—అంతే చాలు నాకు. నువ్వు మాత్రం కాళీగా వున్నావ్ కనుకనా — రాత్రింబవళ్ళు చదువుకుంటూ నాలుగురోజులు విశ్రాంతి కొచ్చావ్" అంటూ అవీ యివీ చెప్పి పని చేయనిచ్చేది కాదు.

అత్తయ్య అభిమానానికి నేనాశ్చర్యపడ్డాను. అత్తయ్య కాడ పిల్లలులేరు. ఇద్దరు మగపిల్లలూ పెళ్ళై దూరంగా ఎక్కడో ఉద్యోగాలూ, సంసారాలూ చేసుకుంటున్నారు. మొగుడు అంటే నా మావయ్య - మూడు నాలుగేళ్ళలో రిటైరవుతాడనుకుంటాను డబ్బుకేం లోటులేదు. భూములున్నాయి బ్యాంకు డిపాజిట్లున్నాయి. నెలజీతముంది. అత్తయ్య మొగుడి పై సంపాదన చెప్పుకోదగ్గదని మా ఇంట్లో చెప్పుకుంటూ వుంటారు ఆడపిల్లలపైనున్న అభిమానంవల్ల అప్పుడప్పుడు అత్తయ్య బంధువుల ఇంట్లో పిల్లలని తనింటికి రప్పించుకుని నాలుగురోజులుంచుకుని పంపించేస్తూంటుంది. మా నాన్నగారావిడకు కడగొట్టు తమ్ముడు. అదివరలో అత్తయ్యింటికి నేను చాలాసార్లు వెళ్ళినప్పటికీ విడిగా ఒక్కతినీ వెళ్ళడం ఇదే ప్రథమం.

అక్కడ నేనుండగానే మా చిన్నత్తయ్య కూడా వచ్చింది. చిన్నత్తయ్యకు ఇద్దరాడపిల్లల తర్వాత ఒక మగపిల్లవాడు. ఆవిడ కాడపిల్లల మోజా ట్టేలేదు సరిగదా—ఈ ఆడ సంతతో వేగలేక చస్తున్నానని విసుక్కుంటూంటుంది. మాటమాటకీ ఆవిడ ఆడపుట్టుకను హీనపరచడంవల్ల నాకావిడంటే సదభిప్రాయంలేదు. అత్తయ్య మాత్రం చిన్నత్తయ్యతో అభిమానంగా మాట్లాడి ఎంతో గౌరవం చూపింది. చిన్నత్తయ్యనుకూడా ఆవిడ ఏ పనీ చేయనివ్వలేదు

నేను వెళ్ళిన రోజున వచ్చిన చిన్నత్తయ్య ఆరో రోజున వెళ్ళిపోయింది. చిన్నత్తయ్య వెళ్ళిపోగానే అత్తయ్య నా వంక చూసి— "అమ్మయ్య—వెళ్ళింది మహాతల్లి!" అంది.

చిత్రంగా అత్తయ్యవంక చూశాను.

"చూడమ్మా — నువ్వయితే కాలేజీలో చదువుకుంటున్న పిల్లవు తర్వాత కాపురానికి వెళ్ళాల్సినదానివి ఏం సుఖపడ్డా నెలవుల్లోనూ, పెళ్ళికి ముందూ మాత్రమే! అయినా చదువు మనిషిని ఆర్పేస్తుంది. అందుకని నువ్వు సరదా పడుతున్నా పనిచేయవద్దన్నాను కానీ దానికే మొచ్చింది? ఏదో మాటవరసకి—నువ్వెందుకే నేనున్నాగా అంటాంకానీ అలాగన్నానుకదా అని ఓ పత్రిక పుచ్చుకుని మంచమెక్కి కూర్చోవాలా? ఎప్పుడొచ్చినా ఇంతే అది నేనేమైనా దాని పనిమనిషిననుకుంటుందో ఏమోమరి— ఏం చూసుకునో అ మిడిసిపాటు నా ఆస్తిలో సగముండదు వాళ్ళదంతా కలిసి ఈ నాలుగు రోజులూ చాకిరీ చేసిచేసి నా రెక్కలు ముక్కలయ్యాయనుకో "

నాకు గుర్తున్నంతవరకూ చిన్నత్తయ్య అత్తయ్యకు సాయపడ్డానికే ప్రయత్నించింది. అత్తయ్య పని చేయొద్దంటే — ఉత్తినే కూర్చుంటే నాకు తోచదే అనికూడా అంది. అలాగైతే పత్రికలు చదువుకోమని తనే చిన్నత్తయ్యకు సలహా ఇచ్చింది.

చిన్నత్తయ్యకు అత్తయ్యపట్ల గల గౌరవానికి కారణం లేకపోలేదు. పెద్దకూతురుకు పెళ్ళీడొస్తోంది. అత్తయ్య వితరణపట్ల ఇంట్లో

అందరికీ గౌరవభావముంది. చూసీచూడకా తన బంధువులకు ఆవిడ చాలా ఆర్థిక సహాయాలు చేస్తూంటుంది. చిన్నత్తయ్య ఆర్థిక పరిస్థితి చెప్పుకోదగ్గది కాదు. అందుకని ఆవిడ ఏ పరిస్థితుల్లోనూ తన అక్కను కించపర్చడానికి సాహసించదు.

కానీ జరగవలసింది జరగనే జరిగింది. చిన్నత్తయ్య ప్రవర్తనకు అత్తయ్యకోపం వచ్చింది. అత్తయ్య చిన్నత్తయ్య గురించి నాకింకా చాలా నేరాలు చెప్పింది. ఒకటి కాదు, రెండు కాదు—చిన్నత్తయ్య వెళ్ళిందగ్గర్నుంచి నేను ప్రయాణమయేవరకూ ఒకదాని వెనుక ఒకటిగా నేరాలలా పుట్టుకొస్తూనే వున్నాయి. అవన్నీ వింటూంటే నాకు చిన్నత్తయ్యపట్ల చాలా అసహ్యం పుట్టుకొచ్చింది.

ఆ తర్వాత రెండు సంవత్సరాలకి—నేను బియ్యే ఫైనలియర్ చదువుతూండగా — చిన్నత్తయ్య పెద్దకూతురికి మా ఇంట్లో పెళ్ళి



చూపులు ఏర్పాటు చేయబడ్డాయి. కారణం వేరే ఏమీ లేదు. వరుడిది మా ఊరు. అతనికి పెళ్ళి చూపులకు వెళ్ళడానిక్కూడా సెలవు దొరకడం లేదుట (ఈ రోజుల్లో ప్రయాణపు ఖర్చులు భరించలేక మగపెళ్ళివారు చెప్పే సాకుల్లో ఇదొకటని మా ఇంట్లో లోపాయికారీగా అనుకుంటూంటారు).

అనుకున్నకంటే రెండురోజులు ముందుగానే చిన్నత్తయ్య కుటుంబం మా యింటికి వచ్చేసింది. ఓ గంట తేడాలో అత్తయ్యకూడా దిగింది. వరుడి కుటుంబానికి అత్తయ్య బాగా తెలుసునట. ఈ సంబంధం స్థిరపర్చడంలో అవిడ చాలా పెద్ద పాత్ర వహించాల్సి వుందని చిన్నత్తయ్య తేల్చేసింది. అత్తయ్య సంతోషంగా అంగీకరించడమేకాక—తన పాత్రను సమర్థవంతంగా నిర్వహించింది. అవిడ మాట మీదనే పెళ్ళి సంబంధం స్థిరపడింది. కట్నం ఎనిమిదివేలు.

పెళ్ళివారి ముందు అత్తయ్య చిన్నత్తయ్య గుణగుణాలు పొగిడి—పెళ్ళి కూతురు అన్ని గుణాలూ తల్లిదగ్గర పుణికి పుచ్చుకున్నదని చెప్పింది. అవిడ నోటంట నేను విన్న చిన్నత్తయ్య గుణాలు చాలా చాలా గొప్పవి. అవి విన్న ఎవరికైనా చిన్నత్తయ్యమీద అపారమైన గౌరవభావం కలుగుతుంది. అయితే చిన్నత్తయ్య గురించి అత్తయ్య కెటువంటి భావాలున్నాయో నాకు తెలుసును కాబట్టి—ఆవిడ మాటలు విన్నప్పుడు నాకు చిన్నత్తయ్యమీద కాక అత్తయ్యమీదనే గౌరవభావం పెరిగింది.

ఒకపెళ్ళి జరిపించడంకోసం అత్తయ్య తనకు నచ్చని వ్యక్తిని పొగుడుతోంది. అందుకు ఎంతటి విశాల హృదయముండాలి?

పెళ్ళివారు వెళ్ళిపోయాక చిన్నత్తయ్య అత్తయ్య చేయి పట్టుకుని—"అక్కయ్యా—నువ్వు అక్కవుకాదే దేవతవు! కానీ వాళ్ళు కట్నం ఎనిమిదివేలంటే చటుక్కున ఊ అనేయమన్నావు. బేరం చేయనివ్వలేదు. మేము అయిదువేలదాకా ప్రిపేరయి వున్నాం. అప్పైనా అప్పుచేయక తప్పదు...." అని ఇంకా ఏదో అనబోతూండగా

"చాల్లేవే—నాకు మాత్రం బాధ్యతలేదా? నీ కూతురికి నేను పరాయిదాన్నా? నాకు ఆడపిల్లల్లేరు గాబట్టి నీ కూతురే నా కూతురనుకుంటాను. నీకేం డబ్బుబాధ లేదు. అవసరమైనంతా నేను సర్దుతాను. తీర్చగలిగింది తీరుద్దురుగాని...." అనేసిందత్తయ్య.

నీ ఋణం చర్మంతో చెప్పులు కుట్టించి ఇచ్చినా తీరదంది అత్తయ్య. నిజమే ననిపించింది నాకు.

పెళ్ళికి అయిదువేలుసాయంచేసిందత్తయ్య. ఘనంగా జరిగిపోయింది వివాహం. పెళ్ళిలో అనుకున్నంత పెత్తనం లభించలేదత్తయ్యకు. గౌరవమర్యాదలకు లోటు జరక్కపోయినా—అన్నీ తనన్నట్లు జరగనందుకు అత్తయ్యకోపం వచ్చింది. ఆవిడ కోపం నా కంత న్యాయంగా తోచలేదు. ఆవిడిచ్చిన సలహాలు ప్రాక్టికబుల్ కావు. అందువల్ల పెళ్ళి చెడిపోయే ప్రమాదంకూడా వుంది.

పెళ్ళైపోయాక అత్తయ్యా చిన్నత్తయ్యా మాటామాటా అనుకున్నారు! పెద్ద పోట్లాటైంది. ఇంట్లో చాలామంది అత్తయ్యకే నచ్చజెప్పడానికి ప్రయత్నించారు. అత్తయ్య త్వరగా మూటాముల్లే కట్టుకుని— "నా అయిదువేలూ నాకు త్వరగా అందేలా చూడు—" అని వెళ్ళిపోయింది.

అత్తయ్యంటే నాకు కాస్త అసహ్యం వేసినా జాలికూడా కలిగింది. ఆవిడవల్ల అంత సహాయం పొందిన వారావిడ్ని మాటలతో ఒప్పించడానికి ప్రయత్నించాల్సింది.

"ఏరుదాటేక బోడి మల్లయ్య—" అంది అత్తయ్య వెళ్ళేముందు. ఆ మాటల్లో నిజంలేకపోలేదు. పెళ్ళికి ముందు అత్తయ్యేలాంటి మాట చెప్పినా మారాడకుండా గంగిరెద్దులా తలూపేది చిన్నత్తయ్య. పెళ్ళి జరిగే సమయానికి అత్తయ్య మాటలు చేదైపోయి విసుక్కోవడం ఆరంభించింది. విసుక్కోకుండా సౌమ్యంగా మాట్లాడి వుంటే బాగుండేది?

అయితే అత్తయ్యా, చిన్నత్తయ్యా విడిపోవడం జరగలేదు. చిన్నత్తయ్య కూతుర్ని,




అల్లుళ్ళో అత్తయ్యా ఓ పండక్కి ఆహ్వానించి బట్టలు పెట్టి పంపించింది. వాళ్ళు వెళ్ళేక చిన్నత్తయ్య కూతురి ప్రవర్తన గురించి—"మా కాలంలో ఇలాంటివి ఎరుగమమ్మా—పట్టపగలే మొగుణ్ణి రాసుకు తిరగడాలూ, రాత్రి తొమ్మిది కాకుండా గదిలోకెళ్ళి తలుపేసుకోవడాలూ-" అంటూ విమర్శించింది.

చిన్నత్తయ్య కూతురు నాకు రాసిన ఉత్తరంలో — తనను తల్లికంటె ఆప్యాయంగా ఆదరించిన అత్తయ్య గురించిన పొగడ్తలే ఎక్కువగా వున్నాయి—"ఇవేమీ పూర్వకాలపు రోజులు కాదమ్రా—మొగుణ్ణి అంటిపెట్టుకు తిరక్కపోతే—త్వరలోనే చేయిదాటిపోతాడు" అనేదట. తనకెంతో సిగ్గుగా వున్నా అత్తయ్య గురించి ఎప్పుడూ మొగుడి పరిసరాల్లోనే మెలగవలిసొచ్చిందట.

అత్తయ్య ప్రవర్తన గురించి వ్యాఖ్యానిస్తూ అన్నయ్యోసారి నాతో—"అత్తయ్యకు అధికార దాహముంది. ప్రతిపనికీ తన పెత్తనం కావాలంటుంది. పెత్తనం ఇస్తే ఎంత సాయమైనా చేస్తుంది. లేకపోతే మాత్రం నానా మాటలూ అంటుంది" అన్నాడు.

అందులో నాకు నిజం కనిపించలేదు. అదే నిజమైతే ఆవిడ ఆదరించిన మనుషుల్ని వాళ్ళు వెళ్ళేక ఎందుకు దుయ్యపడుతుంది? అవతలి వారి ప్రవర్తనలోనే ఏదో లోపముండి వుండాలి? నాకు తెలిసినంతవరకూ చిన్నత్తయ్యకు మాట్లాడడం చేతకాదు. ఎదుటివారిని గాయపరిచేలా మాట్లాడడం ఆవిడకు అనుకోని అలవాటు. ఈ అలవాటు ఆవిడ పెద్దకూతురికి కూడా కొంత సంక్రమించింది. నేనునన్నాంటే పెద్దవాళ్ళతో మాట్లాడేటప్పుడు — వాళ్ళన్నదానికి ఔననడం తప్ప వాదించను. నా అభిప్రాయాలు నాలోనే దాచుకుంటాను. అందుకే అత్తయ్యకూ నాకూ ఎప్పుడూ ఏ గొడవా రాదు. రాలేదు—అని నా నమ్మకం.

అందుకే—"ఎదురుగా ఒకమాట చాటుగా మరో మాట అనడం పూర్వకాలపు ఆడవాళ్ళ లక్షణం" అని పెద్దన్నయ్య చెప్పిన మాట కూడా నాకు నచ్చుబాటుకాలేదు.

నేను పెళ్ళై కాపురానికి వెళ్ళేక మరో కొత్త విషయం తెలుసుకున్నాను. నేనుండేది మా ఆయన ఆఫీసు నానుకునే వున్న కాలనీలో. అది తెలుగుదేశం కాకపోయినా అక్కడ

తెలుగువాళ్ళు చాలామంది వున్నారు. తీరుబడి బాగానే వున్నమూలాన—ఆడవాళ్ళం రోజూ ఎవరి వీలునుబట్టి వాళ్ళు ఎక్కడో అక్కడ కలుసుకుంటూండేవాళ్ళం.

అంతవరకూ నా చదువేమిటో నేనేమిటో మూలాన ఆడవాళ్ళ సమావేశాలెలా వుంటాయో నాకంత బాగా తెలియదు. ఒక నెలరోజుల్లోనే ఈ సమావేశానికి సంబంధించిన ఒక చిత్రమైన విశేషాన్ని కనుగొన్నాను.

ఉదాహరణకు పద్మావతిని తీసుకోండి. ఆవిడింటికి విశాలాక్షి వస్తుంది. ఇద్దరూ కలిసి నాలుగిళ్ళ కవతలున్న కామాక్షమ్మ లోపాల్ని గురించి చర్చిస్తారు. ఆ చర్చ వింటున్నంతసేపూ పద్మావతివీ, విశాలాక్షివీ ఒకటే అభిప్రాయలనీ కామాక్షమ్మ చాలా చెడ్డదనీ తోస్తుంది. విశాలాక్షి వెళ్ళిపోయిన కాసేపటికి సుందరి వస్తుంది. ఆమె, పద్మావతి కలిసి విశాలాక్షి లోపాలను చర్చిస్తారు. అప్పుడు పద్మావతివీ సుందరివీ ఒకటే అభిప్రాయాలనీ — విశాలాక్షి చాలా చెడ్డదనీ తోస్తుంది. అదయ్యేక కామాక్షమ్మ వస్తుంది. అప్పుడు పద్మావతివీ కామాక్షమ్మవీ ఒకటే అభిప్రాయాలు.

కొద్ది రోజులు గడిచేసరికి నాకు మతిపోయినట్లయింది. 'వీరిలో ఎవరికి ఎవరు శత్రువులు? ఏ ఇద్దరివి ఏకాభిప్రాయాలు?

పై ప్రశ్నలకు జవాబు తెలయకపోయినా నలుగురాడవాళ్ళు కలిసినప్పుడు—ఆ చుట్టుపక్కల లేని అయిదో ఆడదానిమీద నేరాలు చెప్పుకోవడం ఆ సమావేశంలో ముఖ్యాంశమని నాకు బాగా అర్థమైంది.

ఒకసారి యధాలాపంగా శ్రీవారికీ విషయం చెప్పి అభిప్రాయమడిగాను. ఆయన చాలా ఆశ్చర్యంగా నావంక చూసి—"ఇదివరలో ఎన్నడూ మహిళామణుల సమావేశాలు చూడలేదా నువ్వు? మా ఇంట్లో మా అమ్మ దగ్గర చాలా జరుగుతూండేవి. అక్కడా ఇలాగే వుండేది. ఇదేమీ నాకు కొత్తకాదు" అనేశారు.

నా మనసు కాస్త చివుక్కుమంది. ఆయన ఆడవాళ్ళని అవమానించినట్లు ఫీలయ్యాను-

"అయితే ఇది స్త్రీలకే ప్రత్యేకమంటారా?"

"అబ్బే—నా అభిప్రాయమదికాదు. ఇలా నేరాలు చెప్పుకోవడం పనిలేనివాళ్ళు చేసేపని. గవర్నమెంటాపీసుల్లో ఉద్యోగులుకూడా ఈ పని చేస్తుంటారు"

"ఎందుకని?"

"ఏమో?"

"నాకు తెలుసు. ప్రతి మనిషికీ ఎదుటివారి మీద కొన్ని అభిప్రాయాలుంటాయి. అవకాశమొచ్చినపుడు వాటిని ప్రకటిస్తూంటాడు. ఎదుటి మనిషిలోని లోపాల్ని గుర్తించే అలవాటు మనిషికి చాలామంచిది. అది తన్ను సంస్కరించుకునేందుకు పనికి వస్తుంది"

శ్రీవారు గట్టిగా నవ్వి అక్కణ్ణించి లేచి వెళ్ళారు. ఆయనలా ఎందుకు చేశాడో నాకర్థం కాలేదు. నేనూ లేచివెళ్ళి వారిని అనుసరించాను. ఆయన అలమారాలోంచి ఓ అయిదు నిముషాలు వెతికి ఓ బైండు పుస్తకాన్ని బైటకుతీసి నాకందించి- "చూడు" అన్నారు.

నేను చూశాను. ఆ పుస్తకంలో ప్రతిపేజీలోనూ ఒకదాని ప్రక్క ఒకటిగా న్యూసు పేపర్ కటింగ్సున్నాయి. ఒకే వ్యక్తికి సంబంధించిన పరస్పర విరుద్ధమైన వార్తలున్నాయి వాటిలో.

పార్టీ ఒక అభ్యర్థిని సూచించినంత మాత్రాన సభ్యులందరూ ఆ వ్యక్తిని సమర్థించాలని లేదు. ఎవరి అంతరాత్మ ప్రబోధం ప్రకారం వారు ఓటు చేయవచ్చు—అని ఇందిరాగాంధీ సంజీవరెడ్డిని అధ్యక్షునిగా ఎన్నుకునే విషయంలో అన్న వార్త వుంది. ఆ పక్కనే— పార్టీకి క్రమశిక్షణ అవసరం, రాజభరణాలు రద్దుచేయటం విషయంలో పార్టీ ఆజ్ఞనుల్లంఘించిన సభ్యులపై క్రమశిక్షణ చర్య తీసుకోబడుతుంది—అని ఇందిరాగాంధీ అన్న వార్త వుంది.

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత దేశాన్ని కాంగ్రెస్ ఎంత ఉన్నతస్థానానికి తీసుకుని పోబోతోందో—ప్రస్తుత ఆర్థిక విధానాలు దేశాన్నెలా ముందుకు నడిపించ నున్నాయో— దేశాన్ని ముందుకు నడిపించగలిగినది కాంగ్రెస్

పార్టీ ఒక్కటే ఎలా అవుతుందో ఒక వార్తలో వివరిస్తున్నాడు మొరార్జీ దేశాయ్. ముప్పై ఏళ్లగా కాంగ్రెస్ విధానాలు దేశాన్నెలా అధోగతికి తీసుకుపోయాయో—అది సవరించ వలసిన అవసరం ఎంతగా వున్నదో వివరిస్తున్నాడు మొరార్జీ దేశాయ్—పక్కవార్తలో.

ఎమర్జన్సీవల్ల దేశానికి కలిగిన లాభాల గురించి ఒక వార్తలో వివరించిన జగజీవన్ రామ్ పక్క వార్తల్లో ఎమర్జన్సీని, ఇందిరా గాంధీని ఖండిస్తున్నాడు.

ఇందిరాయే ఇండియా అని ఒక వార్తలోనూ, కాంగ్రెసు నాయకురాలిగా ఇందిర తగదని పక్క వార్తలలోనూ అంటున్నాడు బారువా.

పాకిస్తాన్ విషయంలో తీవ్రమైన ఖరిని పాటించాలనే వాజ్‌పాయ్ తనకుతానై పాకిస్తాన్ వెళ్లి రావడం పక్కపక్క వార్తలలో వివరించి వుంది.

ఒకటికాదు, రెండుకాదు—అలాంటి జంట వార్తలు కొన్ని వందలున్నాయి పుస్తకంలో!

"ఇవన్నీ చదివితే నీకేమనిపిస్తోంది?"

నేను మాట్లాడలేదు జవాబు ఆయనే ఇవ్వబోతున్నట్లు ముఖంచూసి గ్రహించాను.

"రాజకీయాల్లోనూ, క్రీడారంగంలోనూ,నిత్యకృత్యాల్లోనూ ఈ ఆరోపణలు చాలా ముఖ్యమైనవి—ఫిజికల్ ఫిట్‌నెస్ ట్రయినింగ్‌లాంటివి. ఇవి మనిషిని అలర్ట్‌గా వుంచుతాయి. ఒక పక్షం వాడింకో పక్షాన్ని నిందించాడంటే—ఆ రెండో పక్షంలో లోపాలున్నాయని కాదు. నిందించినవాడు రెండో పక్షానికి చెందడని అర్థం. ఏ రంగంలోనైనా ఈ ఆరోపణలు మనిషి అభిప్రాయాలు తెలుసుకుందుకు పనికిరావు. రాజకీయాల్లో అయితే వీటినిబట్టి మనిషి ఏ పార్టీకి చెందుతాడో, ఏ పార్టీకి చెందడో తెలుసుకోవచ్చు. అలాగే మీ ఆడవాళ్ళ సమావేశాల్లో ఒక మనిషి గురించి చెడ్డగా చెప్పుకుంటున్నారంటే ఆ మనిషి చెడ్డదని కాదు, ఆమె అప్పటికి అక్కడ లేదని అర్థం"

శ్రీవారు చెప్పనిదింకో విషయంకూడా నాకు అర్థమైంది. తన గొప్పతనాన్ని పెంచుకుందుకూ ఎదుటివాడి గొప్పతనాన్ని దించడానికీ కూడా మనిషి ఈ ఆరోపణల నుపయోగిస్తాడు. అత్తయ్య అందర్నీ ఆదరించినా తను ఎటువంటి వాళ్ళ నాదరించగలిగిందో, తనది ఎంత విశాలహృదయమో తెలియజేయడం కోసమే ఈ ఆరోపణలు చేసేదనిపించింది నాకు. ఎదుట సేవలు చేసీ, పరోక్షణలో ఆరోపణలుచేసీ—అందరివద్దనూ అత్తయ్య మంచిపేరు సంపాదించాలనుకుంటోంది. అయితే అత్తయ్యలాంటి వాళ్ళు దేశం నిండా అన్ని రంగాల్లోనూ వున్నారు. వాళ్ళందర్నీ అత్తయ్యలనే పిలిస్తే- అలాంటి ఎందరిలోనో ఒక అత్తయ్య కథ మాత్రమే ఇది!

ఈ సత్యం గ్రహించాక అత్తయ్య మా పిన్నిదగ్గర నా గురించి చాలా చెడ్డగా అన్నదని ఆ తర్వాత ఎప్పుడో తెలిసినపుడు నేనాశ్చర్యపడనూలేదు, బాధపడనూలేదు. □

---

ఒక లావుపాటావిడ బక్కపాటి మొగుణ్ణి కొట్టింది. ఆయనకి పౌరుషం ఎక్కువ. నిజంగా కొట్టావా? వేళాకోళానికా?'' అనడిగాడు.

"నిజంగానే కొట్టాను. ఏం చేస్తారు?'' మళ్లా మీదకొచ్చింది.

"అయితే పర్లేదు. వేళాకోళాలు మన దగ్గర పనిచెయ్యవ్'' అని బైటికిపోయి సినిమాకెళ్ళి రాత్రికి యింటికి చేరాడు. లావుపాటావిడ వదల్లేదు. "ఏమిటీ మధ్యాహ్నం కూశారు. వేళాకోళంగా కొట్టాననుకోండి. ఏం చెయ్యగలరు '' అంది జుట్టుపట్టుకుని.

"నిజంగా కొడితే చంపేద్దును'' అన్నాడాయన విడిపించుకుని.

—సోమిన శివరామప్రసాద్, రాజమండ్రి

# డైరీలో ఒకపేజీ — శ్యామలా విహారి

నులకమంచం వెనకాల పసుపు ముద్దలూ నీళ్ళుచూసి, ఆ పైన అన్నంలో విరిగిన పాలూ-చూసినప్పటి ఖడ్గతిక్కన మనస్సులా వుంది రాఘవరావ్ మనస్సు.

ఒక్క క్షణంలో ఒక్క మాటతో తన గాలి తీసేసింది రాధ. ఆ సమయంలో ఆమె చూసిన చూపు మాత్రం?—కత్తి వాదరలా వుంది.

ఉదయం—

రాధ స్నానం చేస్తున్నదికదా అనే ధీమాతోనూ, లలిత వంటింట్లో తన పనిలో నిమగ్నమై వుందనే ధైర్యంతోనూ రాధ గదిలోకెళ్ళి టేబుల్ మీదున్న పుస్తకాలన్నీ వెతుకుతున్నాడు తను.

“నా డైరీ కావాలా బావా?” గదిలోకి ఎప్పుడొచ్చిందో ఏమో రాధ. ఉలిక్కిపడ్డాడు తను.

మళ్ళీ రాధే, “అది—ఆ పుస్తకాల్లో లేదు. నా సూట్‌కేసులో పెట్టాను రాత్రి” అంటూ గబగబా సూట్‌కేస్ తెరిచి అందులోంచి డైరీ తీసి తన కందిస్తూ చెయ్యిసాచింది.

తన ముఖంలో నెత్తురుచుక్క వుండివుండదనేది ఎవరూ చూసి వర్ణించక్కర్లేకుండానే తనకు తెలిసిపోయింది.

“అఁహఁహఁ డైరీకోసంకాదు. తెల్ల కాగితం కావాల్సి ” అని బక్కెట్లకొద్దీ నీళ్లు నములుతూ బయటపడ్డాడు తను.

తన తల నేలవాలిపోయినా — ఆ పిల్ల చూపుల కొరడాలు మాత్రం తన కళ్ళని ఛెళ్ళుమనిపించినై.

కాళ్ళు శరీరాన్ని హాల్లోకి మోసుకొచ్చినై. తన టేబుల్‌మీది తెల్లకాగితాల దొంతరా, లెటర్‌హెడ్సూ, నోట్‌బుక్సూ—అన్నీ కలిసి కట్టుగా తనకేసి చూసి విరగబడి నవ్వినై.

ఎలా వచ్చి పడ్డాడో ఏమో తెలీదు—‘జెయింట్‌వీల్’ ఎక్కి కళ్ళు తిరిగినవాడు క్రిందికి దిగి భూమ్మీదికి చేరినట్లే ఆఫీసుకి చేరాడు.

అప్పటిదాకా వరండా బయటే ఆడుకుంటున్న ఈదురుగాలి, కిటికీగుండా లోపలికి పరిగెత్తుకొచ్చింది. రాఘవరావ్ టేబుల్‌మీది కాగితాలన్నీ చిందరవందరయినై—అతని ఆలోచనల్లాగానే.

జవాను కొండయ్యకోసం హాలంతా కలయజూశాడు.

రా.రావ్ కోరికల్లాగానే అతనెప్పుడూ రా.రావ్‌కి అందుబాటులో వుండడు. సీట్లోంచి లేచి వెళ్ళి తనే ఆ కాగితాల్ని ఏరుకొచ్చాడు. వాటిని సరిచేసి బరువు పెట్టుండగా అక్కడికొచ్చేడు మేనేజరు.

“వెరీ సారీ మిష్టర్ రావ్. అఫీషియేటింగ్ అరేంజ్‌మెంట్ సుబ్రహ్మణ్యంకే యిమ్మని పై ఆఫీసువాళ్ళు ఖరారు చేశారు. అతనికంటే మీకు పాయింట్ టూ మార్కులు తక్కువట. ఈసారి అదీ కారణం. ఇదిగో కాగితం. అతని పేరున ఆర్డర్స్ తయారుచేయండి.”

మేనేజర్ తన గదిలోకి వెళ్ళిపోయేడు.

రా.రావ్ ఉమ్మి మింగటానికి చాలాసేపు పట్టింది.

ఈలోగా ఈ వార్త ఆఫీసంతా గాలిలా వ్యాపించటం, అప్పటికప్పుడే—బయట మొదలైన వానచినుకుల్లా — సహోద్యోగులంతా రా.రావ్ దగ్గర చేరి ‘సారీ’ల కన్నీళ్ళు వర్షించటం జరిగిపోయినై.

భార్యే మొగుణ్ణి పెళ్ళికొడుకును చేసినట్టు రా.రావ్ సుబ్రహ్మణ్యంకి ఆర్డర్సు కాగితాలు తయారు చేసిచ్చేసరికి లంచ్ టైమయింది.

రాకెట్‌నుంచీ విడిబడిపోయిన వ్యోమనౌకలా పరిసరాల్నుంచి విడిబడిపోయింది—రా.రావ్ మేధస్సు.

'నాలుగేళ్ళ క్రితం, అత్తగారుకూడా పోవడంతో రాధకు తనే గార్డియన్ అయినాడు రా.రావ్. మామగారు మిగిల్చిపోయిన ఇంటిని అద్దెకిచ్చి రాధను తమతో తీసుకొచ్చి కాలేజీలో చేర్పేరు. ఇప్పుడు రాధ బియ్యేస్సీ ఫైనల్‌లో కొచ్చింది.

రాధ చలాకీపిల్ల. నిరంతర సాహిత్య పఠనంలో తనదైని కొన్ని భావాల్ని పెంపొందించుకుంది ఆమె. విద్యార్థులతో కలుపుగోరుగా వుంటూ, ఆటలూ, పిక్‌నిక్‌లకూ వాటికీ వెళ్తూ వుండడం, సాహిత్య సభల్లో ఉపన్యాసాలూ వగైరా—ఆమె హాబీలుగా ఎన్నుకుంది.

ఆర్నెల్ల క్రితం రా.రావ్‌తో అతని భార్య లలిత అన్న మాటలు బాగా అతని బుర్రలో కెక్కినై. "దీని పద్ధతులూ మాటలూ చూస్తుంటే నా కెందుకో భయంగా వుంటోందండీ. దాని చొరవ, చిలిపితనం ఏం ప్రమాదం తెచ్చిపెడతయ్యో ఏమో! నేనూ కాలేజీలో చదివానుగానీ, ఇంతలాలేవు—మా రోజులు" అన్నది లలిత.

ఆ రాత్రి రాధగురించే ఆలోచిస్తుంటే, రా.రావ్‌కి తొలిసారిగా వో ఆలోచన తట్టింది.

రాధకి ప్రతిరోజూ డైరీరాసే అలవాటుంది. ఆ డైరీని చదివితే అన్నీ విశదమైపోతాయి. ఈ ఊహ అతనికి కొత్త వుత్సాహాన్నిచ్చింది.

రాధ ఆ డైరీలో ఏం వ్రాస్తుందసలు?-ఆమెకేమైనా ప్రేమవ్యవహారాలున్నాయా?—లలిత మాటలూ ఈ సందేహాన్నే సూచిస్తున్నయ్.

అప్పట్నుంచీ తను అందుకు ప్రయత్ని



స్తూనే వున్నాడు. కానీ వీలుకావడం లేదు. రాధడైరీ అందినట్లే అంది జారిపోతోంది.

నిన్నసాయంత్రం జరిగిన సంఘటన-రాధ డైరీ చూడాలన్న రా.రావ్ కోర్కెని మరింత తీవ్రతరం చేసి రాత్రల్లా అతనికి పిచ్చెక్కేటం చేసింది.

—నిన్నసాయంత్రం, తను స్నానానికి బావిదగ్గరికి వెళ్ళాడు.

రాధ నూతిగట్టుమీద కూర్చుని మినప్పప్పు కడుగుతోంది.

ఆకాశం అంచున దిగిపోతున్న సూర్యుడి కిరణాలు కన్నెపిల్లతో పరిహాసాలాడు కుంటున్నై.

రాధకేసి పరీక్షగా చూశాడు తను. మందార పువ్వు ముదురు ఎరుపులోని నలుపు ఛాయ. వుంగరాలజుట్టు. ఎర్ర అంచున్న తెలుపు నేత చీరమీద ఎరుపురంగు జాకెట్ వేసుకుంది. పైట కిందికి పడివుంది. మెడకింద జాకెట్ మధ్యలో తనచూపు నిలిచిపోయింది. గుండ్రటి సీడ దోసిలిపట్టిన ఆకాశంలో విస్తరించిం దక్కడ.

రాధ క్రీగంట తనవైపు చూసింది. సన్నగా నవ్వింది. రెండుచేతులూ బక్కెట్‌లో ముంచి కడుక్కొని లేచి నిలబడింది.

"ఏమిటి బావా, బుచ్చిబావగారి మధు సూదనంలా చూస్తున్నావ్. అక్కకంటే అందంగా వున్నానా?" అంటూ పమిట సర్దు కుని కొంగుకు చేతులు తుడుచుకుంటూ ఇంట్లోకి వెళ్ళిపోయింది.

తను సిగ్గుతో కళవళపడ్డాడు.

"అక్కా, బావ నిన్ను పిలుస్తున్నాడే" అని వినిపించిన రాధ మాటలు తన తత్తరపాటుని మరీ ఎక్కువజేసినై.

రాత్రంతా మనసు మనసులో లేదు. ఈ సంఘటనని గురించి రాధ తన డైరీలో ఏమని వ్రాసింది?—ఇదీ తన యిప్పటి ఉత్సుకత. అందుకనే యివ్వాళ పొద్దున రాధ గదిలోకి వెళ్ళాడు. పర్యవసానం—భంగపాటు!

'భంగపాటు' అనుకోగానే రా.రావ్ ఆలోచన అఫీషియేటింగ్ పోస్టుమీదికి మళ్ళింది.

గతంలోనూ ఓసారి ఇలాగే జరిగింది. తనకు రావలసిన పోస్టింగ్ మరెవరికో ఇచ్చారు. హెడ్ ఆఫీస్ మీద దండయాత్ర ప్రకటించి సాధించాడు. ఇంతా చేస్తే తను ఆ పోస్టులో పన్చేసింది ఒక నెల్లాళ్ళు మాత్రమే. ఆ నెలకూ అధికంగా వచ్చే జీతం-నలభై రూపాయలూ-సెక్షన్‌లోనూ, బయటా పార్టీలకు చాల్లేదు. ఉపయోగం లేని శ్రమే మిగిలేది. ఇప్పుడూ జరిగేది అంతే. కోక్లర్క్ శేఖరం యిందాక అన్నాడు. "పీడా పోయిందిలే పోనీవోయ్ రాఘవరావ్. దానివలన దమ్మిడీ ఆదాయమూ లేదు, క్షణం తీరికాలేదు. ఎందుకొచ్చిన యాతన! ఏక్ దిన్‌కా సుల్తాన్ గిరీ" అని. అయినా-తనకా 'ఛాన్స్' పోయిందంటే ఏదో వెలితిగా వుంది మనసులో.

లంచ్ అవర్ అయిపోయింది.

రా.రావ్ ప్రస్తుతంలో కొచ్చాడు.

జీతాలు వచ్చినై.

రా.రావ్‌కి ఆ రోజు జీతాలరోజన్న స్పృహే లేదు. జీతాలకవర్లని తరుముకుంటూ చాలా 'లిస్టులు' వచ్చినై. అవన్నీ పెళ్ళిళ్ళకూ, తద్దినా లకూ చందాలూ, యూనియన్‌లకూ, దేశ నిర్మాణ కార్యక్రమాలకూ సభ్యత్వాలూ— బాపతు. ఆ వెంటనే అప్పుల వాళ్ళూ, వాయిదా పద్ధతిని వస్తువులమ్మిన వాళ్ళూ తయారు.

నరసింహం వచ్చాడు. అతనికి ముప్పై రూపాయలిచ్చాడు రా.రావ్. 'ఇది ఎనిమిదో నెల. ఇంకా ఏడు వాయిదాలున్నై సార్' అంటూ వెళ్ళిపోయాడు నరసింహం. అతని దగ్గర అయిదువందల యాభైకి అతని ఎత్తు స్టీల్ బీరువా కొన్నాడు రా.రావ్. కొనేటప్పుడు వందరూపాయలిచ్చి, మిగిలిన సొమ్ము పదిహేను వాయిదాల్లో తీర్చేట్టు వప్పందం.

తన యింట్లో మధ్యగదిలో గోడకానించి పెట్టిన బీరువా కళ్ళముందు మెదిలింది రా.రావ్‌కి. శేఖరంతోపాటు ఆఫీసులో అందరూ కొంటుంటే తనకూ దాన్ని తీసుకోవాలనిపిం చింది. తీరా తీసుకున్న తర్వాత తనకది ఎంత




పనికిరాని వస్తువో తెలిసింది. అందులో వుంచ దగిన వస్తువే కనిపించలేదు. అతిప్రయత్నంగా ఆలోచించిన తరువాత వో వస్తువు కనిపించింది-అది తన సూటు.

ఈ ఉద్యోగంలో చేరేముందు, అంటే ఇప్పటికి పదేళ్ళక్రితం-తనకు సూటుమీదా, బూటుమీదా తగని మోజుగా వుండేది. ఎంతో పోరుపెట్టీ, నానా తిట్లుతినీ అన్నయ్యచేత 'యస్' అనిపించుకున్నాడు. తీరా వాటిని ఒకటి రెండుసార్లు తొడుక్కోగానే తెలిసింది-తనకవి యెంత అవసరంలేని వస్తువులో....

ఆ రోజుల్లో—తనని సూట్‌లో చూసిన స్నేహితులూ, చుట్టుప్రక్కల వాళ్ళూ "నిరుద్యోగికి సీకెక్కువ' అని అదోలా నవ్వేవాళ్ళు. ఆ తర్వాత ఉద్యోగంలో చేరిన కొత్తల్లో వోసారి తొడుక్కున్నాడు. 'కింది బెత్తు గుమాస్తాగారూ, మీరూ సూటూ బూటేస్తే 'మింగ మెతుకులేదు, మీసాలకు సంపెంగ నూనె' అంటారని సలహా ఇచ్చాడు శేఖరం.

ఆ తర్వాత తనెప్పుడూ దాన్ని తొడగలేదు. ఇప్పుడు బీరువాలో కెక్కించాడు.

బీరువా కొనబోయే ముందు లలిత అననే అంది, 'మనకిప్పుడు బీరువా అక్కర్లేదండీ, అలంకార విద్యార్థిలా అదొకటెందుకు? పాత గుడ్డలూ, పెన్సిళ్ళూ, స్టౌవత్తులూ, దారం రీలూ పెట్టుకోవాల్సిందే' అని. నిజానికి అంతే జరిగింది. కానీ దానికోసం తనెంత తాపత్రయ పడ్డాడు. శేఖరంవాళ్ళూ కొన్నప్పుడు తనేదో కోల్పోతున్నట్టు ఫీలై మరీ చేరేడు ఆ స్కీములో!

సాయంత్రమైంది.

ఆఫీస్ కాగానే ఇంటికి వెళ్ళాలనిపించలేదు రావ్‌కి. హోటల్లో కాఫీ తాగి పేవ్‌మెంట్ మీద నడుస్తుంటే—కాళ్ళు-అప్రయత్నంగా అక్కడికే దారి తీసినై.

నూరేఖాన్ పుస్తకాల షాపు! పాతపుస్తకాల అంగడి. అరగంట గడిచింది. 'కంప్లీట్ వర్క్స్ ఆఫ్ షేక్స్‌పియర్' తీశాడు రావ్. పదిరూపాయలు చెప్పాడు ఖాన్. ఐదు దగ్గర మొదలెట్టేడు రావ్. ఐదున్నర, ఆరు, ఆరున్నర - ఆపైన 'ఏడు' అని పుస్తకం రావ్‌చేతిలో వుంచాడు ఖాన్. ఖాన్ మాటలో వక్రోక్తి పలికిందనిపించింది రావ్‌కి. పుస్తకం తీసికొని

డబ్బులిచ్చాడు. టైము చూసుకున్నాడు. ఆరు న్నరయింది.

పార్క్‌కొచ్చి కూర్చున్నాడు.

జారుడుబండమీద పిల్లలు ఆడుకుంటు న్నారు. రోజ్ గార్డెన్‌లో ఓ పడుచుజంట—కబుర్లు చెప్పుకుంటూ మధ్యమధ్యలో నవ్వు కుంటున్నారు. మరోవైపు ఎవరో వ్యాయామం చేస్తున్నారు. అక్కడక్కడా కూర్చునివున్నారు కొందరు. ఎవరి ధోరణిలో వాళ్ళున్నారు.

చేతిలోవున్న పుస్తకాన్ని తిరగేయసాగేడు రావ్. ఒక్కసారి అంతా తిరగేసి ప్రక్కన పెట్టాడు. వెంటనే, ఇంట్లో అటకమీద జాజి చెక్కల పెట్టెలో వున్న పుస్తకాలన్నీ కళ్ళ ముందు మెదిలేయి. అవన్నీ ఇలా అప్పు డప్పుడూ కొన్న పుస్తకాలే. తన కదొక అల వాటు. మంచి పుస్తకం చూస్తే దాన్నెలాగైనా సరే కొనాలనిపిస్తుంది. ఎన్నోసార్లు ఫ్రెండ్స్ దగ్గర అప్పుచేసికూడా కొన్నాడు.

వోసారిలాగే పాత పుస్తకాల షాపులో 'రెడ్డి సంచిక' కనపడింది. ఆ రోజు తనదగ్గర అసలు డబ్బుల్లేవు. ఆ కొట్టువాడిని మర్నాటి దాకా ఆ పుస్తకాన్ని ఎవరికీ అమ్మవద్దని బ్రతి మాలీ బామాలీ, మర్నాడు వెళ్ళి దాన్ని కొను క్కొచ్చేడు. సాహిత్యంలో తనకేమాత్రం ప్రవేశం లేదు. అయినా అది చాలా అరుదైన పుస్తకమని దాన్నిగురించి శాస్త్రి ఎప్పుడూ చెప్తూ వుండేవాడు. అలా కొన్న ఆ పుస్తకాన్ని ఒక్కసారికూడా చదవలేదు. అదనేకాదు—అసలే పుస్తకమైనా అంతే! ఎన్ని పుస్తకాలు కొన్నా, తనకు వాటిని చదవాలనిపించదు. పేజీలు తిరగేసి తీసికెళ్ళి అటకెక్కించటమే—తను చేసేపని.

వోసారి శాస్త్రి అన్నాడు, "కనబడిన పుస్తక మల్లా సేకరించటమేగానీ చదవవుకదా! ఎందు కింత పిచ్చి" అని.

ఉన్నట్టుండి ఏదో గలభాలాంటిది వినపడే సరికీ ఈ లోకంలో పడ్డాడు రావ్.

తనకు కొద్ది దూరంలో వో జంట—వాళ్ళ ముందు 'అమూల్' బేబీలాంటి పిల్లాడు. ఆ ప్రక్కనే వో ఐస్‌క్రీం అమ్మే కుర్రాడు. ఆ చిన్న పిల్లాడు ఐస్‌కోసం మారాం చేస్తుంటే - తల్లి వాణ్ని విసుక్కుంటోంది. వాడు ఏడుపు మొదలెట్టేడు. 'పిల్లాడి ఏడుపును భరించలేక ఐస్‌వాణ్ని పిలుస్తున్నాడు భర్త. ఆవిడ వారిస్తూ అంది, 'వాడి సంగతి తెలీదు మీకు. వాడికి ఆక్కర్లేదండీ అదసలు. తినడు. కొనిపించి, చివరికి నాకే ఇస్తాడు. నే తినలేను బాబూ ఇప్పుడు' అని. భర్త చివరికి ఐస్ కొననే కొన్నాడు.

సంతోషంతో గంతులేస్తూ ఐస్ అందు కున్నాడు పిల్లాడు. ఒక్కసారి నాలికతో రుచి చూసి—ఆముదం తాగిన మొహంపెట్టి, 'బాగా లేదం'టూ తల్లి చేతికిచ్చేశాడు. ఆవిడ దాన్ని అందుకుంటూ 'చూశారా' అన్నట్టు భర్తకేసి గుర్రుగా చూసింది. అక్కణ్నుంచీ కదిలేరు వాళ్ళు.

రా.రావ్‌కి తన చిన్నతనం గుర్తుకొచ్చింది.

అప్పుడు తనకు పదేళ్ళుంటాయి. అప్పట్లో తనకు తరచూ జ్వరంవస్తూ వుండేది. ఓసారి పండక్కి లడ్డూలు చేసింది అమ్మ. అవి తిన కుండానే తనకు జ్వరం ముంచుకొచ్చింది. లడ్డూ తినాలని ఎంత గొడవచేసినా తిననీయ లేదు అమ్మ. 'నీకోసం దాచాను. జ్వరం తగ్గాక తిందువుగానీ' అని అమ్మ చెప్తే, రెండు లడ్డూలు తీసికుని ఓ చిన్న డబ్బాలో పెట్టి, తన మంచం దగ్గరే వుంచుకున్నాడు ఆ డబ్బాని. ఎవ్వర్నీ ఆ డబ్బా ముట్టుకోనిచ్చేవాడు కాదు. జ్వరం తిన్నగా టైఫాయిడ్‌లోకి దించింది. పది హేను లంఖణాలు చేసి పథ్యం తిన్నాక, డబ్బా మూత తీశాడు. అందులో లడ్లు బూజుపట్టి భద్రంగా వున్నాయి. వుసూరుమంటూ వాటిని అవతల పారేశాడు.

"హల్లో, రాఘవ్."

ఆలోచనల్లోంచి తేరుకుని తల తిప్పేడు రావ్. ఎదురుగా శంకరం. శంకరం ప్రక్కగా అతని భార్య కాబోలు వుంది. శంకరంకేసి చూసి విష్‌చేశాడు.

"బాగున్నావా? చాలా కాలమైంది మనం కలిసి" రావ్ ప్రక్కగా కూర్చుంటూ పరామ

ర్శించేడు శంకరం. రావ్ సన్నగా నవ్వేడు.

"బైదిబై. ఈవిడ శారద. నా శ్రీమతి" శంకరం తన భార్యని పరిచయం చేశాడు. ఆవిడ నమస్కరించింది. రావ్ ప్రతినమస్కారం చేశేడు.

"ఇక్కడే స్టేట్ బ్యాంక్‌లో వర్క్ చేస్తోంది. మా పెళ్ళికి నువ్ రాలేదు; ఆ తర్వాత మనం కలుసుకోనేలేదు" అంటూ చేతిలో హెల్మెట్‌ని పక్కన పెట్టాడు. అతని కటుప్రక్కగా కూర్చుంది శారద.

కబుర్లలో పడ్డారిద్దరూ. సుమారు ఓ అర గంట తర్వాత—శంకరం, శారదా లేచారు. వోసారి రావ్‌నీ, లలితనీ తమ యింటికి రమ్మని చెప్తూ, అడ్రసిచ్చి వెళ్ళిపోయారు.

రావ్ మనస్సు బరువెక్కింది.

తన పెళ్ళికి ముందు సంఘటనలూ, తన వుద్దేశ్యాలూ గుర్తుకొచ్చినై.

అన్నయ్య ఎన్ని సంబంధాలు చెప్పినా తనకు నచ్చలేదు. 'పిల్ల కనీసం గ్రాడ్యుయేట్ అయివుండాలి' అనే తన అభిప్రాయాన్ని విన్నప్పుడు వదిన నవ్వుతూ అంది, "అయితే వుద్యోగం చేయిస్తావన్న మాట!" అని.

తను సమాధానం యివ్వలేదు.

లలిత 'బియ్యే' పాసయ్యింది. పెళ్ళయిన కొత్తల్లో ఆమె చూపులు పేపర్లో వాంటెడ్ కాలమ్స్‌మీద వుండేవి. వోసారి ఏదో బ్యాంక్ వాళ్ళు ఉద్యోగ పోటీ పరీక్షని ప్రకటించారు. తనుకూడా అప్లయ్ చేస్తానంది లలిత. తానే వద్దన్నాడు. అంతేకాదు, 'తన ముందెప్పుడూ వుద్యోగ ప్రసక్తి తేవద్ద'ని ఖచ్చితంగా చెప్పాడు.

శారదనిచూస్తే అనిపిస్తోంది. లలితకుకూడా ఆ అవకాశమిస్తే బాగుండేదని.

పెళ్ళికాకముందు తన వూహల్లో భార్యచేత వుద్యోగం చేయించాలనే వుండేది. తీరా బియ్యే చదివిన లలిత భార్యగా లభించినా, ఉద్యోగం చేయించటానికి ఎందుకో మనస్కరించలేదు.

రా.రావ్ మీద ఏదో పడ్డట్లనిపించి వులిక్కిపడి లేచాడు. టైము చూసుకున్నాడు. ఎనిమిదిన్నర అవుతోంది. నెమ్మదిగా ఇవతలకు

## 'కలియుగ భీముడు'



ఓరోజు నాలుగు రోడ్లు కలిసేచోట ఎత్తుగా నాలుగు బల్లలు పేర్చి, ఓ వ్యక్తి మైకులో 'మీరు భీముడ్ని చూడలేదు, చూడలేరు, చూడబోరు - కాని, కలియుగ భీముడ్ని చూద్దురు రండి. అతను ఓ అరగంటలో నాలుగువందల కోడిగుడ్లు, రెండువందల బాతుగుడ్లు ఇట్టే తినేయగలడు. రండి రండి—చూడండి. అతనితో పోటీపడి గెలిచిన వారికి వెయ్యి రూపాయిలు బహుమానం" అంటూ మైకులో అరుస్తూంటే జనం బిలబిలమంటూ చుట్టూ మూగిపోయారు. ఆలస్యాన్ని భరించలేక కలియుగ భీముడు మైకులో ఎనౌన్స్ చేస్తున్న తన బాసునుద్దేశించి అన్నాడు గదా-"అయ్యా తమరు త్వరగా ఈ కార్యక్రమాన్ని ముగిస్తే నేను ఇంటికిపోయి భోంచెయ్యాలి" అని.

—నాని

వచ్చాడు. లైట్ల వెలుగులో రంగు రంగుల గులాబీలు కళ్ళకు విందుచేస్తున్నాయి. చాలా ముచ్చటగా వున్నాయనిపించింది రావ్‌కు. తప్పని తెలిసినా అరచేతి వెడల్పులోవున్న వో పువ్వుని తుంచి గబగబా అడుగులువేస్తూ రోడ్డు మీదికొచ్చాడు.

కాళ్ళు యింటిముఖం పట్టేయి. రాధను గురించిన బెరుకుదనం మళ్ళీ తలెత్తింది.

చేతిలో పువ్వుతో ఆడుకుంటూ, ఒకొక్క

రేకునూ తుంచుతూ నడక సాగించాడు.

ఇల్లు కనుచూపు దూరంలో వుండగా రావ్ చేతిలో పువ్వు తాలూకు కాడకూడా మిగల్లేదు.

చేతిలోని పుస్తకాన్ని వూపుకుంటూ ఇల్లు చేరేడు.

గుమ్మానికున్న తాళం వెక్కిరించింది రావ్‌ని.

రావ్ మనస్సు పరిపరివిధాలా పోసాగింది.

లలితా రాధ ఎక్కడికి వెళ్ళారన్నది తోచ లేదు. పక్క పోర్షన్‌కేసి భారంగా అడుగులు వేశాడు.

రావ్‌నుచూసి పక్కింటివాళ్ళ పిల్ల తాళం చెవీ, వో కవరూ తెచ్చి రావ్ చేతిలో పెట్టి గిరుక్కున పరిగెత్తుకెళ్ళింది.

రావ్ మనస్సు ఆందోళన పడింది. ఉదయం సంఘటన వెన్ను చరచింది.

రాధ లలితకు ఏం చెప్పిందో ఏమో?—

ఏవేవో ఆలోచనలు ముసురుకున్నై రావ్‌ని. గబగబా తలుపు తెరిచి, లైట్ వేసుకుని కుర్చీలో కూర్చున్నాడు.

చేతిలోని పుస్తకాన్ని టేబుల్‌మీదికి పడేశాడు.

తడబడుతున్న చేతుల్తో కవరు చించి ఆత్రు తగా చదివేడు.

"మీ కోసం చూసి చూసి సినిమాకు వెళ్తున్నాం. 'పలిచీమలు' సినిమా ఈ రోజుతో ఆఖరుట. మీరు భోంచేసేయండి. అన్నీ సిద్ధంగా వుంచాను."

'హమ్మయ్య' అని తేలిగ్గా వూపిరి పీల్చు కున్నాడు రావ్. కవరు టేబుల్‌మీద వుంచుతూ వులిక్కిపడ్డాడు.

టేబుల్‌మీద తన లెటర్‌హెడ్స్ పైగా రాధ డైరీ!

రావ్ గుండె బిగదీసింది.

వణుకుతున్న చేతులతో నెమ్మదిగా డైరీని అందుకున్నాడు.

లేచివెళ్ళి బయట తలుపు గడియ వేసి వచ్చాడు.

మళ్ళీ కుర్చీలో కూర్చుని డైరీలోని పేజీలు తిరగేయటం మొదలెట్టేడు.

డైరీ అంతా—

రాధ తాను చదివిన పుస్తకాల్లోంచి ఎత్తి రాసుకొన్న కొటేషన్లూ, రచయితల పేర్లూ, తను వ్రాసిన కవితలూ; వాటిల్లో రకరకాల కొట్టివేతలూ—కరెక్షన్సూ!

రావ్‌కి ఆశ్చర్యం వేసింది. గబగబా పేజీలు తిరగేసి నిన్నటిరోజు వ్రాసిన పేజీ చూశాడు.

అక్కడ, తననిగురించేమీ లేదు. ఏదో కథకు సంబంధించిన వివరాలు వ్రాసివున్నయ్.

పేజీ తిరగేశాడు. అది ఈరోజు తారీఖుది:

"లోకంలో మనుష్యుల్ని పట్టి పీడిస్తున్న దౌర్భాగ్యం చాలా చిత్రమైంది. ఒక వస్తువు తనకు నిరుపయోగమైందని తెలిసినా, దాన్ని పొందాలనే తపనా, ఆరాటం; అది తనకు లభించినా దాన్ని అనుభవించలేని అశక్తత!"

రావ్ గతుక్కుమన్నాడు.

అద్దంలో తన ప్రతిబింబం చూసుకున్న ట్లయింది.

'అటకెక్కిన పుస్తకాలూ, అలంకార విద్యార్థిలా స్టీలు బీరువా, పాతబడిపోతున్న సూటూ, చివికిపోతున్న లలిత బియ్యే డిగ్రీ, పాడైపోయిన లడ్డూలు, రేకులు తుంచేసిన గులాబీ—' ఇవన్నీ సినిమా రీలులా రావ్ కళ్ళముందు తిరిగి అతన్ని పరిహసిస్తున్నయ్.

వీటన్నిటికీ మధ్యగా రాధ డైరీ అతన్ని చూసి విరగబడి నవ్వుతోంది!!



మినీ కథ

# థాంక్స్

పరుగు పరుగున వచ్చి సిటీ బస్సెక్కాడు సుందరం. బస్సులో అప్పటికే ప్రయాణీకులు నిలబడి వున్నారు. సుందరం వెనకసీటులో పరీక్షగా చూశాడు. అయిదుగురే కూర్చున్నారు. న్యాయంగా ఆరుగురు కూర్చోవలసిన సీట్లలో అయిదుగురు విశాలంగా సర్దుక్కూచున్నారు.

సుందరానికి మండింది. 'మనవాళ్ళకి అసలు పౌరవిజ్ఞానం తెలియదు' తిట్టుకున్నాడు సుందరం.

సుందరం కాస్త ఒంగి జనాంతికంగా, "కాస్త సర్దుకోనండి మాష్టారూ! ఆరుగురం కూర్చోవచ్చు" అన్నాడు.

అయిదుగురూ అతడిని, "హౌరా! నీకు ఎంత తెగింపురా" అన్నట్టు చూచి జరగడం ఇష్టంలేనట్టు ఒకో అంగుళం మేర జరిగి నన్ను కానట్టు వూరుకున్నారు.

సుందరం ఖాళీలో సర్దుకు కూచున్నాడు.

బస్సు కదిలింది.

సుందరం కూచోవడంకంటె నిలబడుంటేనే బాగు అనుకున్నాడు. ప్రక్కనున్న లావుపాటి వ్యక్తి తన బరువైన తొడలు సుందరం మోకాళ్ళ మీదికి వచ్చేలాగా కూర్చుండి మోచేతుల్తో సుందరం డొక్కలో గుచ్చుతూ నిర్లిప్తంగా చూస్తున్నాడు.

స్టేజివచ్చింది. దాదాపు ముగ్గురు మనుషుల పాటి బరువు తూగే భారీ విగ్రహం బస్సెక్కి సుందరం కాళ్ళముందు నిలబడి వుస్సురంటున్నాడు.

సుందరం ఆ విగ్రహాన్నితట్టి, "రండిసార్! కూర్చోండి" అంటూ లేచి సీటు త్యాగంచేశాడు.

భారీ విగ్రహం కొండంత సంతోషంతో అయిదంగుళాల ఖాళీస్థలంలో చతికిలబడ్డాడు.

అయిదుగురిలోనూ చైతన్యం ప్రవహించింది. ముగ్గురికి సరిపడే చోటు రెప్పపాటులో భారీ విగ్రహానికి అమరింది.

సుందరాన్ని కృతజ్ఞతాపూర్వకంగా చూసింది భారీ విగ్రహం. "థాంక్యూ" అన్నాడు సుందరం కొంటెగా-జనాంతికంగా.

—ఎం. వి. వి. సత్యనారాయణ

# పశ్చాత్తాపం ధర

గ్రీక్ భాషలో ఒక సామెత వుంది—'ప్రతీ ఒక్కడూ కొరింథ్ వెల చెల్లించలేడు' అని. దీని వెనుక ఒక కథ వుంది.

కొరింథ్ లూయిస్ ఒక వేశ్యపేరు. ఆమె అద్భుత సౌందర్యవతి. అలాగే చిటారు కొమ్మన మిఠాయి పొట్లంకూడా. గ్రీస్‌దేశం నలుమూలల నుండి ఆమె సౌందర్యం గురించి విని, ఎందరో ధనికులు ఆమె ఇంటికి వచ్చేవారు. తను అడిగినంత యిస్తేనేగాని, ఆమె ఎవరినీ ఇంట్లోకి అడుగుపెట్టనిచ్చేది కాదు. ఆమె అడిగిన వెల చెల్లించటమంటే సామాన్యుడికి తలక్రిందులా తపస్సు చేసినా సాధ్యపడేది కాదు. అందుకే పై సామెత పుట్టింది.

ఒకసారి డిమోస్థనీజ్ అనే ఒక వక్త కొరింథ్ యింటికి వెళ్ళాడు. ఆమె తనలాంటి వాడికి అందుబాటులో వుండదని తెలిసే, తెర వెనుక వున్న కొరింథ్‌ని ఒక కోరిక కోరాడు. ఒక్కసారి ఆమెని కౌగిలించుకొని, దాంతో తృప్తిపడి వెళ్ళిపోతానని అన్నాడు డిమోస్థనీజ్. దానికి కొరింథ పదివేల దీనారాలు వెల కట్టి ఆ డబ్బు ముందుగా యిచ్చి ఆ తర్వాత తనని కౌగిలించుకోవచ్చు నని చెప్పింది.

డిమోస్థనీజ్‌కి కొరింథ్ అహంకారం అర్థమయింది. ఆమె తనకి ఏమాత్రమూ అందుబాటులో లేదని గ్రహించాడు. వెంటనే అతడు, "ఇంత ధరపెట్టి పశ్చాత్తాపాన్ని కొనటానికి నేను సిద్ధంగా లేను!" అన్నాడు.

నక్క-ద్రాక్షపళ్ళ కథని గుర్తుచేస్తున్న ఈ కొరింథ్-డిమోస్థనీజ్ వుదంతం సోషియన్ అనే దార్శనికుడు వ్రాసిన 'ద హార్న్ ఆఫ్ ప్లెంటీ' అనే పుస్తకంలో వుంది.

—సుంకర భాస్కరరావు

# తెల్లని-చీకటి

నాగభైరవ ఆంజనేయులు

ఒక్కసారిగా అంతడబ్బు చేతిలో కొచ్చేటప్పటికి వెచ్చని కోరిక పాపారావ్ మనసులో తచ్చాడింది. నరాలు జివ్వుమన్నాయ్. ఒళ్ళంతా తిమ్మిరెక్కింది. మనసు మత్తుగా మూలింది. వెన్నెముకలో జలదరింపు. గుండెలో పులకరింపు. మనసుని రంజింపజేసే వుత్సాహం. హృదయాన్ని కంపింపజేసే వుద్రేకం.

అస్సలు — పీయూసీ చదివే రోజుల్లో తీర్చుకున్న తన కోరికను గురించి రూమ్మేట్ వర్ణిస్తుంటే పాపారావ్‌కు మనసూరింది. అదే కోరిక పాపారావ్ మనసులోకి చేరి వూరించ సాగింది. నెలనెలా పంపిన రూపాయలకి అణా పైసలతో లెక్కడిగే తండ్రిమూలంగా ఆరేళ్ళ కాలేజీ జీవితంలోనూ ఆ కోరికను తీర్చుకునే అవకాశం కలగలేదు. ఆ మధురమైన కోరికను మనసులోనే పదిలంగా దాచుకున్నాడు పాపారావ్. ఉద్యోగం చిక్కాక నెలనెలా జీతం చేతికి చిక్కుతుందని, తన ఖర్చులకు పోను చాలా డబ్బు మిగులుతుందని, ఆ డబ్బుతో తన కోరికను తీర్చుకోవచ్చని పాపారావ్ చాలా రోజులు కలలుకన్నాడు. అందుకే ఉద్యోగం వచ్చాక చాలా రోజులవరకు బ్రహ్మచారిగానే వుండాలని గట్టిగా తీర్మానించుకున్నాడు.

కాని తనని పచ్చబట్టలలో చూడాలని నాయనమ్మ ప్రాణం కొట్టుకలాడటంవల్లనూ, ఇహలోకంలోనూ పరలోకంలోనూ ఆమె ఆత్మను శాంతింపజేయాలని తన తండ్రి సంకల్పించటం చేతనూ వుద్యోగం రాకుండానే ఓ యింటివాడయాడు పాపారావ్. తండ్రి హోదా వచ్చాకనే పాపారావ్‌కు వుద్యోగమొచ్చింది.

భాగ్యనగరంలో ఎల్డీసీగా చేరిన పాపారావ్ ఆ నగరంలోని చాలామందిలా కుషీగా కులాసాగా కాలం గడిపే భాగ్యానికి మాత్రం నోచుకోలేకపోయాడు. తనకొచ్చే జీతం తన సంతానానికి వచ్చే రోగాలకు, ఇంట్లో ఖర్చులకు చాలటమే లేదు సరిగ్గా.

మొదటి తేదీనాడు అప్పిచ్చిన వాళ్ళు యమదూతల్లా వచ్చి ఆఫీసుగేటు దగ్గర కాపలా కాచి తన జేబులోని డబ్బుని గద్దల్లా తన్నుకపోవటం పరిపాటయిపోయింది. జీతం వచ్చిందనే సంతోషాన్ని, తనవద్దా డబ్బుందనే సంతృప్తిని భస్మంచేసే పరమ కిరాతకుల్లా కనుపించసాగారు వాళ్ళు పాపారావ్‌కు. అందుకే ఈ మధ్య జీతం అందిన రోజున పని లేకపోయినా చీకటిపడేవరకూ నోట్లను చూస్తూ తన్మయత్వంతో సీట్లోనే గడిపేస్తున్నాడు పాపారావ్.

గతం గుర్తుకొచ్చేటప్పటికి పాపారావ్ గుండె ఝల్లుమంది. ఉద్రేకం స్థానాన్నే ఉద్వేగం ఆక్రమించుకుంది. గుండెలో ఆరాటం మొదలయింది. కోరిక పాపారావ్‌ను ఓడించింది. వచ్చిన అవకాశాన్ని జారవిడుచుకుంటే మళ్ళీ జన్మలో అవకాశం రాదని పాపారావ్‌కు బాగా తెలుసు. మనసు తహతహలాడింది. గుండె రెపరెపలాడింది. పాపారావే కోరికయాడు.

పాపారావ్ 'హెయిర్ కటింగ్ సెలూన్'కి నడిచాడు. గోడలకు బిగించివున్న నిలువుటద్దాలలో తన ప్రతిబింబాన్ని వివిధ కోణాల్లో చూసుకున్నాడు. జుట్టు చిందరవందరగా పడివుంది. ముఖం జిడ్డుకారుతుంది. గడ్డాన్ని అరచేత్తో తడుముకున్నాడు. గరుగ్గా తగిలింది. కుషన్ చెయిర్‌లో కూర్చున్నాడు. తన గడ్డాన్ని నున్నగా గీసి, తలకు వాసన నూనె పట్టించి, ముఖానికి పౌడరు దట్టించిన వాడి చేతిలో రూపాయినోటు కుక్కి హుషారుగా ఈలవేసుకుంటూ రోడ్డు మీదకు చేరాడు పాపారావ్.

చిరుగాలి సుతారంగా జారుతుంది. వీధి దీపాలు మగతగా జోగుతున్నాయి. వెచ్చని

వూహలు పాపారావ్ మనసులో వూయలలూగు తున్నాయ్

మెయిన్‌రోడ్డు దాటాడు కొన్ని సందులు తిరిగాడు మరీ ఇరుగ్గా వున్న ఆ వీధిలోకి చేరాడు తన మిత్రులు అప్పుడప్పుడూ చెప్పు కునే మాటల్నిబట్టి ఈ వీధి ఆ వీధే నన్న నిర్ధా రణ కొచ్చాడు పాపారావ్ చీకటి చిక్కగా వుంది ఇళ్లలోనుండి వచ్చి రోడ్డుమీద పరచు కున్న వెలుగు నల్లటి గుడ్డమీది తెల్లని చారల్లా వుంది పారాపావ్ అడుగులు తడబడు తున్నాయి గుండె బరువెక్కింది నుదుటిన చిరుచెమట పడుతుంది వెన్నెముకలోనుండి వణుకు ప్రారంభమయింది రెండు చేతుల్ని పాంట్ జేబుల్లో కుక్కుకొని వణుకును అణచ డానికి వ్యర్థప్రయత్నం చేస్తున్నాడు పాపారావ్ ఆ రోడ్డులో అటూ ఇటూ నాలుగుసార్లు పచార్లు చేశాడు. ఏ గడపలో అడుగిడితే ఏమవుతుందో నన్న భీతి ఎవర్ని ఏమడగాలో తెలియని పరి స్థితి తిరిగి వెళ్ళిపోదామనిపించింది పాపారావ్‌కు మదిలోని కోరిక కళ్ళెంవేసి ఆపింది భయం భయంగా పక్కలకు చూస్తూ అడుగులో అడుగు వేసుకుంటూ నడుస్తున్నాడు పాపారావ్



"లోనికిరా బాబూ" ముసలమ్మ మాటవిన్న పాపారావ్‌కి అడుగు ముందుకు పడలేదు. ఆమెకేసి సంశయంగా చూస్తూ అక్కడే నిల బడిపోయాడు. పాపారావ్ పరిస్థితిని అర్థం చేసుకొన్న ముసలిది ముసిముసి నవ్వులు నవ్వుతూ "....రా బాబూ" అంది ఆప్యాయ తను మాటల్లో కురిపిస్తూ.

పాపారావ్ రెండువైపులా చూసి దాపులో ఎవరూ లేకపోవటంతో గబగబా ముసలిదాని వెంట లోనికి నడిచాడు.

"అమ్మాయ్! సుజాతా!" కేకేసింది ముసలిది.

పిల్ల తెమ్మెరలా తేలిపోతూ వచ్చి, చిలిపిగా చిరునవ్వు చిందిస్తూ కవ్వింపుగా పాపారావ్ కళ్ళలోకి చూస్తూ వయ్యారంగా గుమ్మం ప్రక్కగా నిలబడింది ఓ చక్కనిది. ఆమె చూపులోని వెచ్చదనానికి పాపారావ్ మనసు కాగిపోయింది. ఆశపండిన చూపుతో ఆమెను కైపుగా చూస్తున్న పాపారావ్ 'నచ్చిందా' అన్న ముసలిదాని గొంతు విని సమాధానం చెప్ప డానికి ప్రయత్నించాడు. నోటిలో తడి ఆరి పోయింది. మాట పెగిలి రాలేదు. తల ఆడిం చాడు. పాపారావ్ పడుతున్న అవస్థచూసి సుజాత తియ్యగా నవ్వుకొంది.

ముసలిది చిన్నగా బయటకు తప్పుకొంది.

"రండి"

పాపారావ్ మంత్రముగ్ధుడిలా ఆమె ననుస రించాడు.

"కూర్చోండి" ఆ కంఠ మాధుర్యాన్ని గ్రహించిన పాపారావ్ మనసుకి ఆ మాట అర్థం స్ఫురించలేదు. అలానే నిలబడి గదిని పరిశీలి స్తున్నాడు. గదిలోని అర్ధనగ్న చిత్రాలు, అత్తరు సువాసనలు, అగరువత్తుల పరిమళాలు పాపా రావ్‌ను మరో లోకంలోకి తీసుకపోయాయి.

"అలా నిలబడిపోయారేం?" ఎడంచేతిని చెంపకు చేర్చి సుతారంగా నవ్వింది సుజాత. పాపారావ్ కనురెప్పలు టపటపలాడాయి. మంచంమీద ఒదిగి కూర్చున్నాడు.

"మీరు కూర్చోండి....నిలబట్టం...." పాపా రావ్ ఎలాగో ఈ మాటలు అనగలిగాడు. లోతయిన బావిలోనుండి వచ్చినట్లున్నాయా మాటలు. గొంతు సవరించుకున్నాడు.

"మీ కిది కొత్త కదూ?" పాపారావ్ ముఖం లోకి సూటిగా చూస్తూ ప్రశ్నించింది సుజాత.

"అబ్బే....లే....లేదు" కంగారును అణచు కోడానికి ప్రయత్నించాడు పాపారావ్.

ఆమె కళ్ళు చిత్రంగా నవ్వాయి.

అతడు నాలుకతో పెదవులు తడుపు కున్నాడు. చెరగని క్రాపుని సవరించుకున్నాడు.

"మీకే ఆఫీసులో పని?" ఊహించని ప్రశ్న విన్న పాపారావ్ తడబడ్డాడు. గుమస్తాలంటే అందరికీ చులకనే! తాను గుమస్తానని తెలిస్తే ఆమె ప్రవర్తన మరో విధంగా వుంటుంది. తాను కలలుకన్నది, అనుభవించాలని వువ్వి ళ్ళూరింది ఖరీదైన శృంగారంకోసం.

"ఉద్యోగం చెయ్యాల్సిన అవసరం నాకేం లేదు. ఉన్న పొలాన్ని చూసుకుంటూ వూళ్లోనే వుంటున్నా" తానంత పచ్చి అబద్ధాన్ని యింత నిస్సంకోచంగా చెప్పగలడని పాపారావ్‌కి అప్పుడే తెలిసొచ్చింది. తన సమయస్ఫూర్తిని తనే మెచ్చుకున్నాడు మనసులోనే.

ఆమె నిండుగా నవ్వింది. వింతగా అతని కేసి చూసింది—కనుబొమ లెగరేస్తూ. పాపా రావ్ ఆమె గమనించడాన్ని గమనించాడు.

"రైలు ప్రయాణం. మంచి గుడ్డలు పాడవుతాయని యివి తొడుక్కున్నా. రైల్లో నా సూట్‌కేస్ ఎవరో కొట్టేశారు. అందులో నా గుడ్డలు...." తాను ధరించిన మాసిన బట్టలకు సంజాయిషీ చెప్పుకున్నాడు పాపారావ్.

ఆమె ఫక్కున నవ్వింది. అతడు గుటకలు మ్రింగాడు. అరచేతో నుదురు తుడుచుకున్నాడు. ఆ తర్వాత గడ్డం తడుముకున్నాడు. అతని మెదడులో ఓ ఆలోచన మెరిసింది. తనదగ్గర డబ్బెంతుందో ఆమెకేలా తెలుస్తుంది? మాసిన తన బట్టల్ని చూసి తనను చవకబారు రకంగా అంచనా వేస్తున్నదిలా వుంది. తక్కున జేబు లోని పైకంతీసి ఆమె చేతిలో వుంచాడు గోడ కేసి చూస్తూ. పైపంటితో క్రింది పెదవిని నొక్కుతున్నాడు.




చేతిలోని డబ్బుకేసి చూసి కిసుక్కున నవ్వింది

"చాలవా మీకు?" ఉక్రోషం వచ్చింది పాపారావ్‌కు నిస్సహాయంగా ఒక చేత్తో మరో చేతిని నలుపుకుంటున్నాడు అనిశ్చలంగా వుంది అతని చూపు

ఆమె కళ్ళు వెలిగాయి "మీకిది మొదటి సారికదూ?"

"లేదు ఎందుకనుకుంటున్నారు అలా?"

"లేపోతే పడుపువృత్తిలోనున్న మమ్మల్నెవరూ యింత గౌరవంగా పిలవరు" నేలకేసి చూస్తూ చెప్పింది సుజాత

"దానిదేముంది. మనుషుల్నిబట్టి ఉంటుంది"

పాపారావ్‌లో కోపం కట్టలు తెంచుకొని ప్రవహిస్తుంది మాటలతో కాలం వెళ్లబుచ్చడానికి చూస్తున్నదిలా వుంది రెండు నిముషాలు మవునంగా గడిచిపోయాయి. సహనం సన్నగిల్లింది పాపారావ్‌లో కోరిక తొందర చేసింది

"ఇప్పుడే వస్తా" నంటూ లోనికి పోయింది సుజాత.

పాపారావ్ జరగబోయే మధురక్షణాలను గురించి అంతకన్నా మధురంగా వూహించుకుంటూ ఊహల వుయ్యాలలూగుతున్నాడు

* * *

సుజాత గాలి దుమారంలా దూసుకవచ్చింది. ఒంట్లోని రక్తమంతా ముఖంలోకి చిమ్మినట్లు ముఖం ఎర్రనయింది కళ్ళు అగ్నిగోళాల్లా వున్నాయ్ పాపారావ్ వూహాలు తెగిపోయాయి. ఆలోచన అల్లకల్లోలమయింది అతని మనసు కంపించింది ప్రశ్నార్ధకంగా, భయంగా ఆమెకేసి చూశాడు

"మీ భార్యపేరు సరస్వతికదూ?" గద్దించి అడిగింది సుజాత

"అవును మీకెలా తెలుసు?" అసంకల్పితంగా అన్న పాపారావ్ అదే క్షణంలో తేరుకొని "నో నో" అన్నాడు

"మీ భార్య జబ్బుతో వుందికదూ,"

"భార్యా జబ్బా వాట్. మీరేంమాట్లాడుతున్నారో నా కర్థం కావటంలేదు" గంభీరంగా చెప్పాననుకున్నాడుగాని మాటలు తడబడ్డాయి.

సుజాత పేలవంగా నవ్వింది. నవ్వి అంది.

"ఇంకా నటించకండి. మీ ఆత్మను మీరు మభ్యపెట్టుకుంటూ మీరు చెప్పే కల్పితగాథను నన్ను నమ్మమనకండి. ఇదిగో మార్వాడిదగ్గర మంగళసూత్రాలు తాకట్టు పెట్టినట్లు రశీదు.... ఇది డాక్టరు సరస్వతికి వ్రాసిచ్చిన మందుల చీటీ. ఈ రెంటిమీదా ఈనాటి తేదీ వుంది. అంటే సరస్వతి అనబడే మీ భార్యకు జబ్బు చేసింది. మందులు కొనడానికి మంగళ సూత్రాలను ఈరోజే తాకట్టుపెట్టారు....అలా విస్తుపోతారేం....డబ్బుతోబాటు నా చేతికిచ్చారు ఈ రెండు చీటీలు. భార్య జబ్బుతో బాధపడుతుంటే మీరిలా రావటం .... ఎంత జుగుప్సాకరమో ఆలోచించారా?"

పాపారావ్ తటాలున లేచి నిలబడ్డాడు.

"ఏమండీ నిజంగా మీరు మందులు కొనలేదుకదూ" ప్రాధేయపూర్వకంగా అడిగింది సుజాత డబ్బును కాగితాలను పాపారావ్ చేతిలో వుంచుతూ.

తలెత్తి ఆమె ముఖంలోకి చూశాడు. నిర్మలంగావున్న ఆ ముఖాన్ని చూస్తూ నిజాన్ని దాచలేకపోయాడు.

"లేదు" అతి కష్టంమీద ఆ ఒక్కమాట నోరు పెగిలి బయటకు వచ్చింది.

"మగవారిలో ఈ విచిత్ర బలహీనత.... ఎందుకో ఏమోమరి .... ఎంత ఉధృతంగా వుంటుందో చూడండి. కట్ట తెగిన ప్రవాహం లాంటిది ఈ బలహీనత. తాళికట్టిన ఆలిలో లేని సుఖం సంతోషం వెలయాలిలో దొరుకుతుందనే భ్రమ. పరాయి స్త్రీతో కులకాలనే ఆరాటం. చీకటి సుఖాన్ని రుచిచూడాలన్న తాపత్రయం. ఇవన్నీ కలసి మగవాణ్ణి పిచ్చివాడిగా మారుస్తాయి. ఆ పిచ్చిలో యుక్తాయుక్త జ్ఞానాన్ని కోల్పోతారు. లేకపోతే భార్యని ఆ స్థితిలో వదలి మీరు వచ్చివుండేవారే కాదు."

పాపారావ్‌కు తల కొట్టేసినంత పనయింది. తనకే మంత్రశక్తి వుంటే ఆ క్షణంలో అచ్చట నుండి అదృశ్యమయిపోయేవాడే. పాపారావ్‌కు ఏ మంత్రశక్తీ లేదు. పాపారావ్ మామూలు మనిషి. అక్కడ అలాగే నిలబడ్డాడు. బయటకు పరుగుతీయాలనిపించింది. కాళ్ళు సహకరించ లేదు. మనసు దిమ్ముగా వుంది మంచులో ముంచేసినట్లు.

సుజాత తీవ్రంగా ఆలోచిస్తుంది — ఏం చేయాలో నని. రెండు నిముషాల మౌనాన్ని భంగపరుస్తూ గంభీరంగా పలికింది: "ఎంతో ఆశగా వచ్చారు. అనుకోని ఎదురుదెబ్బకు తట్టుకునే గుండె నిబ్బరం మీకుందో లేదో మరి. మీరు కావాలనుకుంటున్న ఈ శరీరాన్ని అనుభవించండి....కాని....కాని పవిత్రమైన మంగళ సూత్రం తాకట్టుపెట్టి తెచ్చిన ఆ డబ్బును ఈ పాపపు పనికి వినియోగించకండి. ఆ డబ్బు ఆ పవిత్రమూర్తికి ఆరోగ్యాన్ని చేకూర్చాలి. ఇదే నా కోరిక."

పాపారావ్‌కు ఇనుపగొడ్డలితో తన తలమీద బాదుతున్నట్లనిపించింది. "సుజాతా...." బిగ్గరగా అరిచాడు.

"నో....నో" పళ్ళు బిగించాడు. నుదురు అరచేత్తో బాదుకున్నాడు.

పాపారావ్ ఆమె కళ్ళలోకి చూశాడు. ఆమె పాపకూపంలోకి ఎలా వచ్చిందో. నిర్మలమయిన మనస్సు....ఉదాత్తమయినవ్యక్తిత్వం. అదే ఆమె నడిగాడు.

ఆమె కళ్ళలో నీరుబికాయి. మునివ్రేళ్ళతో కళ్ళద్దుకుంది. "మగవారి మాయలో పడినందుకు ఫలితం. పెద్దవారి మాటలను పెడచెవిన పెట్టి ఒకరిని నమ్మి తొందరపాటుతో చేసుకొన్న నిర్ణయానికి తగిన శిక్ష. గతాన్ని గుర్తుచేయకండి" విలవిలా ఏడ్చింది.

"క్షమించండి....బాధపెట్టాను. మీరు శాపగ్రస్తయిన దేవత, మా ఇంటి ఇలవేల్పు" రెండు చేతులెత్తి ఆమెకు నమస్కరించి పెద్ద పెద్ద అంగలతో బయటకు నడిచాడు పాపారావ్.

తృప్తిగా గుండెలనిండుగా గాలి పీల్చుకొంది సుజాత. □

# సినిమా

## "మా వూళ్లో మహాశివుడు"

గుళ్ళో దేవుడు వూళ్ళో కొస్తాడా....? కానీ విచిత్రమేమిటంటే యీ చిత్రంలో వచ్చాడు. వచ్చినంతమాత్రాన సమాజంలోని దుష్టశక్తులకు ప్రాతినిధ్యం వహించే వినాయకరావు కనకారావువంటివాళ్ళుచేసే అన్యాయాలు అక్రమాలు, కుతంత్రాలు, చూస్తూ సహిస్తాడా....? దైవధ్యానమే జీవిత పరమార్థంగా భావించే సాంబయ్యవంటి వుత్తముల అగచాట్లు ఆర్చుదేం, తీర్చుదేం....? ప్రేమే దైవం ప్రేమే సుందరమనుకున్న రవీ కమలల అన్యోన్య ప్రేమకు విఘాతం కలిగించే గోపాల్‌వంటి దుర్మార్గుల చేతులు నరికెయ్యదేం....? గుడ్లు పీకేయదేం....?

---

సినీతారాపథంలో 'తూర్పువెళ్ళే రైలు' ద్వారా పయనం ప్రారంభించింది జ్యోతి.
మంచి నటిగా తీర్చిదిద్దుతూ ఆ పయనాన్ని సులభం చేస్తున్నది దర్శకుడు 'బాపు'





శ్రీ సత్పురుషా ప్రొడక్షన్స్ నెం. 2లో శోభ

నిజంగా దేవుడే దిగివస్తే అతనికెన్నెన్ని సమస్యలు .... ఎన్నెన్ని పొరబాట్లు ఎన్నెన్ని తడబాట్లు, ఎన్నెన్ని తప్పుల తమాషాలు, వీట న్నిటి కలబోతే 'మా వూళ్ళో మహాశివుడు' - ఈ చిత్రంలో పరమశివుడుగా రావుగోపాలరావు, భక్తుడు సాంబయ్యాగా సత్యనారాయణ, ప్రేమ జంటగా మురళీమోహన్, సుభాషిణి, గ్రామ దేవతలుగా అల్లురామలింగయ్య, వంకాయల ప్రసాద్ బాబు, హాస్యజంటగా రాజబాబు, రమా ప్రభ, వీరుగాక పుష్పలత గిరిజ మున్నగువారు ముఖ్యతారాగణం—

సాంకేతికవర్గం: రాజాచంద్ర (దర్శకత్వం) కన్నప్ప (కెమెరా) సత్యం (సంగీతం) అప్పలాచార్య (మాటలు) బాబూరావు (రచనా సహకారం) కందస్వామి (ఎడిటింగ్) భాస్కర రాజు (కళ) పృధ్వీరాజ్ (నిర్మాణ నిర్వహణ) అల్లు అరవింద్ 'నిర్దేశ'గా దాసరి సత్య నారాయణమూర్తి, వేగివీర్రాజు నిర్మిస్తున్న ఈ చిత్రాన్ని అల్లు రామలింగయ్య సమర్పిస్తు న్నారు.

## పట్నం పిల్ల

యువ నిర్మాత కె. తాతాజీ ఉమాదేవి పిక్చర్స్ పతాకంపై-ఓ కన్నెపిల్ల అనాథ అయినపుడు జీవితంలో పొందిన అనుభవాల సంఘటనలను ఆధారంగా ఫామిలీ సెంటిమెంట్ ఇతివృత్తంతో నిర్మించిన రంగుల చిత్రం "పట్నం పిల్ల" అన్ని హంగులు పూర్తి చేసుకొని మే నెల మొదటి వారంలో, ఆంధ్ర దేశం అంతటా విడుదల కానున్నది.



'అల్లాఉద్దీన్ అద్భుతదీపం'లో శ్రీప్రియ



రాష్ట్రపతి భవన్‌లో భారత రాష్ట్రపతి డా॥ నీలం సంజీవరెడ్డి 'కరుణామయుడు' చిత్రం చూసిన సందర్భంలో, ఆయనకు మాల వేసి అభివందనాలర్పిస్తున్న ఆ చిత్ర నిర్మాత, కథానాయకుడు విజయచందర్

అనాథయైన కన్నెపిల్లగా "పట్నం పిల్ల"గా టైటిల్ పాత్రను శ్రీదేవి పోషించగా సరసన స్టేషన్‌మాస్టరుపాత్రను మురళీమోహన్ నటించి తన ప్రతిభను చూపించగా, చిత్రవిచిత్రమైన గెట ప్‌లో స్ట్రీట్ ఫైటర్‌గా.... సైకిల్‌షాపు యజమానిగా కమలహాసన్ నిర్వహించగా జంటగా సత్యప్రియ నటించింది. పల్లెకంతటికీ విలాస పురుషుడుగా .... కన్నబిడ్డ పిల్లను విడవని కామకేళీ పురుషుడుగా .... మైనర్ మోహన్ పాత్రను మోహన్‌బాబు కడుచక్కగా నటించగా కుటిభుజంగా "మేడిశెట్టి" అనే నూతన నటుడును తొలిసారిగా వెండితెరమీద చక్కని హావభావాలు అగపర్చాడు. పరిధిమించని హాస్యాన్ని సారథి అందించగా పొట్టి శిష్యుడుగా తెరబాబు — పొట్టిబాబు — తన పాత్రను నిర్వహించాడు. పెంచల్‌రావ్, పి. ఆర్. వరలక్ష్మి, అనిత, జయమాలిని, ఇతర ముఖ్య తారాగణం....

మాటలు, పాటలు: వేటూరి, సంగీతం: చక్రవర్తి, కెమెరా: సాయిప్రసాద్.

## వేడుక!

చిన్న బడ్జెట్‌లో చక్కని సాంఘిక చిత్రం తీసి విజయం సాధించడం చిత్రపరిశ్రమ మనుగడకు అత్యవసరమైన అంశం, చాలా పేరున్న నటీనటులతో, పెద్ద ఎత్తున హంగులు సమ

కూర్చుకొన్న చిత్రాలు విజయవంతం కావడంతో పెద్దగా విశేషం కన్పించదు. అందుకు భిన్నంగా జరిగేదే విశేషం. అటువంటి చిత్ర విజయం నిర్మాతలకేకాక పరిశ్రమకే వేడుక నిజంగా. ఆ వేడుకను తమ చిత్ర శతదినోత్సవంద్వారా చేశారు 'తాయారమ్మ-బంగారయ్య' చిత్ర నిర్మాతలు పూర్ణోదయా ఆర్ట్ క్రియేషన్స్‌వారు. ఏడిద నాగేశ్వరరావు, ఆకాశం శ్రీరాములు నిర్మించిన చిత్రం ఇది.

నటుడిగా సినీ జీవితం ప్రారంభించి, దర్శకు

మూడుసార్లు భారతదేశపు ఉత్తమ నటిగా బహుమతి గెలుచుకొన్న ఏకైక నటి శారద 'ప్రియబాంధవి' చిత్రంలో





'నాయిల్లు-నావాళ్లు' భావన, సుభాషిణి

డీగా మారిన కొమ్మినేని (శేషగిరిరావు) విజయం ఇది. 'ఫార్ములా' చిత్రంలాగా కాకుండా 'కారెక్టర్ ఆర్టిస్ట్స్' ప్రధానపాత్రలలో, అందునా 'టైటిల్‌రోల్స్' నిర్వహించిన చిత్రం ఇది. జానకి, సత్యనారాయణ (తాయారమ్మ-బంగారయ్య)ల విజయం ఇది. ఈ చిత్రంలో నటించిన ఇతర నటీ నటులకూ, (చంద్రమోహన్, మాధవి, రంగనాథ్, సంగీత ముఖ్యులు) చిత్రనిర్మాణంలో పాలుపంచుకొన్న సాంకేతిక నిపుణులకూ విజయం ఇది.

'తాయారమ్మ - బంగారయ్య' చిత్రం శతదినోత్సవం మద్రాసులో జరిపారు నిర్మాతలు. ఆలిండియా రేడియోలో వార్తలు చదివే ఏడిద గోపాలరావు (నిర్మాత ఏడిద నాగేశ్వరరావు సోదరులు) వ్యాఖ్యానంలో సభ నిర్వహించబడింది. దక్షిణ భారతదేశపు జెయింట్ నటులిద్దరు డా॥ ఎన్.టి. రామారావు అధ్యక్షులుగా, శివాజీగణేశన్ ముఖ్య అతిథిగా ఈ సభలో పాల్గొన్నారు. తమిళ చిత్రరంగంలో ఇప్పుడు 'నెంబర్ వన్' డైరెక్టర్‌గా పేరు తెచ్చుకొన్న భారతీరాజాకూడా అతిథిగా సభలో పాల్గొన్నారు.

'పది శాతం చిత్రాలు కూడా విజయం సాధించలేక పరిశ్రమ కల్లోలపడుతున్న ఈ తరుణంలో ఇటువంటి విజయాలు ఉత్సాహాన్నిచ్చి పరిశ్రమకు ఊపిరి పోస్తుంటాయి' అన్నారు ఎన్.టి. రామారావు తమ ఉపన్యాసంలో. శివాజీగణేశన్ తమిళంలో మాట్లాడి నిర్మాతలనూ, నటీనటులనూ, సాంకేతిక నిపుణులనూ అభినందించారు. తాయారమ్మా-బంగారయ్యలుకూడా మాట్లాడారు. నిర్మాత ఏడిద నాగేశ్వరరావు సభకు విచ్చేసినవారికి కృతజ్ఞతలు తెలిపారు.

## తాయారమ్మ-బంగారయ్య సిరీస్‌!

ఇంగ్లీషులో తరచుగా వస్తుంటాయి 'ఒకే పాత్ర' చాలా సినిమాలలో నటించే సందర్భాలు (టార్జాన్, జేమ్స్‌బాండ్ వగైరా). అలా భారతీయ చిత్రాలు, అందునా తెలుగు చిత్రాలు



'క్రాంతి'లో జయంతి, రంగనాథ్

ఇదివరకు రానట్లే లెక్క. (హిందీ నుంచి డబ్ చేయబడ్డ 'జింబో', 'జింబోనగర ప్రవేశం' అలా వచ్చిన సిరీస్) ఇప్పుడు 'తాయారమ్మ - బంగారయ్య' పాత్రలతో మరికొన్ని సినిమాలు వచ్చే అవకాశం వుంది, పై ఉత్సవంలో మాట్లాడుతూ నటుడు సత్యనారాయణ ఈ విషయం వివరించారు. దర్శకుడు కొమ్మినేని దగ్గర 'తాయారమ్మ-బంగారయ్య నెంబర్ టూ' సబ్జెక్ట్ తయారుగా వుందనీ, చిత్రనిర్మాణ ప్రయత్నాలు జరుగుతున్నాయన్నారు.

[మనలోమాట: తెలుగులో 'సిరీస్' చిత్రాలు రాలేదంటే కోప్పడవచ్చు చాలామంది ప్రేక్షక పాఠకులు. ఎప్పుడూ మడత నలగని దుస్తులే ధరిస్తూ, చెట్లచుట్టూ, గుట్టలచుట్టూ హీరోయిన్‌తో పరుగుపందెంలోలాగ పరుగులుతీస్తూ పాటలుపాడుతూ, ఏ రకమయిన బలహీనతా లేని స్ఫటిక సదృశుడై, అవకాశం వచ్చింది అలస్యం త్యాగం చేసెయ్యడానికి ఎగిరి గంతు వేసే తెలుగు 'కథానాయకుడి పాత్ర' పేర్లు మారినా, అదేగదా! అది సిరీస్ చిత్రాలక్రింద



'రతీ మన్మథ'లో సంగీత, సుధారాణి

లెఖవెయ్యవచ్చుగదా అంటే మా దగ్గర సమాధానం మాత్రం లేదు]

## "బొమ్మల కొలువు"

యువనిర్మాత, వాసిరాజు ప్రకాశం కొత్త చిత్రం 'బొమ్మలకొలువు' ముహూర్తం యిటీవలనే విజయాగార్డెన్సులో కన్నులపండువగా జరిగింది.

కొమ్మినేని దర్శకత్వంలో ఏప్రిల్ 21 నుంచి షూటింగ్ జరుపుకునే బొమ్మలకొలువు చిత్రంలో చంద్రమోహన్, జయమాలిని, కవిత, జగయ్య ప్రభృతులు ముఖ్య భూమికలు ధరిస్తున్నారు.

బొల్లిముంత శివరామకృష్ణ రచన చేస్తున్నారు. భాస్కరరావు ఛాయాగ్రహణ దర్శకులు, కళాధర్ కళా దర్శకులు, ఎస్. రాజేశ్వరరావు సంగీత దర్శకులు.

'కాలం మారింది' వంటి విప్లవాత్మకమైన చిత్రాన్ని తెలుగు ప్రేక్షకులకు అందించిన నిర్మాత వాసిరాజు ప్రకాశం ఈసారి 'బొమ్మల కొలువు' చిత్రాన్ని ఒక ఆదర్శవంతమైన కుటుంబగాధా చిత్రంగా నిర్మిస్తున్నారు.

## శ్రీ సత్పురుషా ఫిలిమ్స్

## "ప్రొడక్షన్ నెం.2"

నిత్యజీవితంలో జరిగే మానవ సంఘర్షణను, మమతానురాగాలను సుహృత్తరంగా, ఈస్ట్‌మన్ కలర్‌లో చిత్రీకరించబడ్డ చిత్రం ఇది. యీ చిత్రంలో రజనీకాంత్‌ది ఒక ప్రత్యేకమైన తరహా పాత్ర.... రజనీకాంత్ చెల్లెలుగా శోభ, ప్రియురాలిగా ఫటాఫట్ జయలక్ష్మి, కథానాయకుడు ఇంజనీర్ పాత్రలో శరత్‌బాబు నటించారు.

బాలు మహేంద్ర అపూర్వమైన ఛాయాగ్రహణం, ఇళయరాజా రసవత్తరమైన

సంగీతం సమాకూరుస్తున్న యీ చిత్రానికి రచయిత రాజశ్రీ, నిర్మాత: డా॥ ఎ. రఘురామ రెడ్డి, దర్శకత్వం: కె. మహేంద్ర.

## సుధాబిందువులు

ఆధ్యాత్మిక సాధనకూ, ఏకాగ్రతకూ, భజనలు—పూజలు, నగర సంకీర్తనములు—అవశ్యం కావలసినదేనని అన్నిమతాలు మనకు బోధిస్తునే వున్నాయి. కాని, యాంత్రికమైన జీవితంలో మనం కేవలం యీ భజనలతోనే, పూజలతోనే భగవంతునికి దగ్గరవుతున్నామని సంబరపడిపోతున్నాం. అయితే భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు శలవిచ్చినట్టు, మనం మన నిత్యజీవితంలో సత్య ధర్మ శాంతి ప్రేమ లను ఆచరించకుండా ఎన్ని పూజలు చేసినా అవన్నీ బాహ్యార్భాట వ్యక్తీకరణే అవుతాయి. యీ విజయాన్ని విశదీకరించే కొన్ని సంఘట నలు 'సుధా బిందువులు' చిత్రంగా రూపొం దాయి.

నటీనటవర్గం: చాలావరకు కొత్తవారే.

సాంకేతిక వర్గం:— కెమేరా: యస్. రామకృష్ణారావు, మేకప్: చిరంజీవి, సంగీతం: బండారు చిట్టిబాబు, నేపథ్యం: శ్రీమతి గీత, కుమారి శారద, ద్యారం వెంకట్రావు, బెనర్జీ బిలెమొరియా, ఎడిటింగ్: రవి-రమణ, సహ దర్శకత్వం చేకూరి కృష్ణారావ్, కథనం-మాటలు-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: రావుజీ.

## రతీ మన్మధ

ప్రముఖ నిర్మాత శ్రీ యస్.వి. సుబ్బరాజు సమర్పిస్తున్న శ్రీవాణీ వరలక్ష్మి కంబైన్స్‌వారి రతీమన్మధ చిత్రం హార్స్లీ హిల్స్ ప్రాంతంలో జరిగే ఒకే ఒక షెడ్యూలులో పూర్తికానున్నది. యీ చిత్రాన్ని యువనిర్మాత శ్రీ పి.వి.యస్.వి. ప్రసాద్ నిర్మిస్తున్నారు.

శ్రీ పోలవరపు బ్రహ్మానందరావు దర్శకత్వం వహిస్తున్న యీ చిత్రంలో సంగీత, ప్రసాద్‌బాబు, భరత్‌కుమార్, వంకాయల

మద్రాసులో తెలుగు సాంస్కృతిక సంస్థ 'కళాసాగర్' ఆధ్వర్యంలో ప్రదర్శింపబడ్డ 'రావణ మండోదరి' నృత్యనాటికలో ఒక దృశ్యం





'మా పూళ్ళో మహాశివుడు'లో అల్లు రామలింగయ్య, రాజబాబు

సత్యనారాయణ, ఫిలిం ఇన్‌స్టిట్యూట్‌లో శిక్షణ పొందిన గోపికృష్ణ, గరగ, హరిజన్ చిత్రం కథానాయిక రాజలక్ష్మి, లక్ష్మీచిత్ర, జయశీల ప్రధాన పాత్రలు పోషిస్తున్నారు.

అధునాతన ఇతివృత్తంతో రూపొందుతున్న రతీమన్మథ చిత్రంద్వారా కె.వి. రమణమూర్తి అనే నూతన రచయిత పరిచయం కాబోతున్నారు. బొమ్మరిల్లు చిత్రానికి సహకార దర్శకుడుగా పనిచేసి పరిచయమయిన శ్రీ కె.వి. రమణమూర్తి, రతీమన్మథ చిత్రం సంభాషణలు వ్రాస్తున్నారు. సత్యం సంగీత దర్శకత్వాన్ని ఎ.వి. రామ్‌చౌదరి ఛాయాగ్రహణాన్ని, నాయని మహేశ్వరరావు కూర్పును నిర్వహిస్తున్న యీ చిత్రం త్వరలో విడుదలవుతుంది.

## ప్రేమకు మేమే వారసులం!

నిర్మాత ఏ.వి. ప్రసాద్, రోహిణీ ఆర్ట్ పిక్చర్స్ పతాకంపై హనుమాన్ ప్రసాద్ దర్శకత్వంలో తలపెట్టిన 'ప్రేమకు మేమే వారసులం' చిత్రం షూటింగ్ ఏప్రిల్ 15 : తేదీ ఉదయం 12 గంటలకు భాగ్యనగర్ స్టూడియోస్‌లో ఆరంభం అయింది.

ప్రముఖ రాజకీయవేత్త రాష్ట్రీ సివిల్ సప్లయిశాఖామాత్యులు శ్రీ వీరప్ప కెమెరా స్విచ్ ఆన్‌చేయగా భాగ్యనగర్ స్టూడియో అధినేత శ్రీ బాదం రామస్వామి క్లాప్‌కొట్టారు.

తొలి షాట్ హీరో నారాయణరావుమీద తీశారు.

చిత్రం ఇతివృత్తంపై దర్శకులు హనుమాన్ ప్రసాద్ వివరిస్తూ ప్రేమ వ్యక్తి యొక్క మానసికసంస్కారానికి క్రమశిక్షణకి నిదర్శనం. అందుకే ప్రేమకి లొంగనిది ప్రేమతో మార్చ లేనిదీ లేదని అంటారు. ప్రేమ అనేది వ్యక్తిని మానసికంగా క్రమశిక్షణలో సక్రమపథంలో వుంచితే సమాజపు కట్టుబాట్లు సాంఘిక నియమాలు మాజాన్ని చక్కగా ఉ చడానికి ఉం



'కార్తీక దీపం'లో శోభన్‌బాబు, గీత

రిస్తాయి. నిజం అయిన ప్రేమ తెలిసి అనుభవించిన వ్యక్తి అపార్థాలకి అక్రమ తిరుగుళ్ళకి పాలుబడడు. అప్పుడు అందరి జీవితాలూ సుఖవంతం అవుతాయి. ఆస్థులు అంతస్థులుకన్నా ప్రేమ శాశ్వతం అయింది. ప్రతి వ్యక్తి ఒక ప్రేమ స్వరూపంగా మారి ఇతరులనుగూడా అలా తీర్చి దిద్దగలిగితే సమాజంలో సుఖం జీవితాల్లో సౌందర్యం పెరుగుతాయి అన్నారు.

ప్రతి కుటుంబం ప్రతి జంట 'ప్రేమకు మేమే వారసులం' అనుకున్న రోజున సమాజం సుందరస్వప్నం అవుతుంది. ప్రేమకు అర్థం అపార్థం కాదు. ప్రేమకు నిర్వచనం బలహీనతకాదు. సామాజిక స్పృహ చైతన్యం గల చిత్రాలు నిర్మించే తను, ఈ చిత్రానికి దర్శ



'ఇల్లాలి ముచ్చట్లు'లో మురళీమోహన్

కత్వం వహించడంలో గల కారణాల్ని హనుమాన్ ప్రసాద్ సహేతుకంగా వివరిస్తూ ఇంకా ఇలా అన్నారు. వయసులో వున్నవాళ్ళ ప్రేమ చాలా తీయటిది. దానికి కావల్సినంత గ్లామర్ వుంది. కానీ ఈ చిత్రకథ కేవలం గ్లామరస్ కాదు. బాయ్ మీట్స్ గరల్ కథ అంతకన్నా కాదు. 'ప్రేమించాము ప్రేమిస్తున్నాము' అనుకునే యువతరానికి ప్రేమయొక్క బాధ్యతని ధర్మాన్ని చెప్పడం ఈ చిత్రం లక్ష్యం!

'కొత్త అల్లుడు'లో జయప్రద





'పట్నం పిల్ల'లో శ్రీదేవి

ఈ చిత్రంలో దేవదాసు ఒక ముఖ్యమయిన పాత్రలో జనాన్ని ఆకట్టుకుంటాడు. అతని పక్కన సరోజ, 'నారాయణరావు—రూప' 'పి.ఎల్. నారాయణ—శైలజ' ఇతర జంటలు. మిగిలిన పాత్రల్లో హరిబాబు, కవిత దాసు, సత్తిబాబు, అనిత, జేవీరోహిణీ, ప్రసాద్ నటిస్తున్నారు. కథ: శ్రీమతి లక్ష్మీప్రసాద్ సృష్టించగా మాటలు జంధ్యాల రాశారు. కెమేరా: లక్ష్మణ్‌గోరే, కళ: కృష్ణమూర్తి, స్క్రీన్ ప్లే, దర్శకత్వం : హనుమాన్ ప్రసాద్.



# కథల పోటీ

## మొత్తం పదమూడు బహుమతులు

ప్రథమ బహుమతి : **750** రు.
ద్వితీయ బహుమతి: **400** రు.
తృతీయ బహుమతి: **300** రు.

ఇంకా... ప్రశంసార్హమైన మరో పది కథలకు ఒక్కొక్క-
దానికి రూ. **116** చొప్పున ప్రత్యేక బహుమతులు

## నిబంధనలు గమనించండి!

1. కథలు 16 పేజీలు మించకుండా (ముద్రణలో) ఉండాలి. (సుమారు పేజీకి 30 లైన్లతో 16 పేజీల ఫుల్‌స్కేపు పేజీలు మించకుండా).
2. అనువాదాలూ, అనుసరణలూ అంగీకరింపబడవు. రచనలు తమ స్వంతమే ననే హామీ పత్రాన్ని విధిగా పంపాలి.
3. ముఖ్యగమనిక: రచయితలు తమ చిరునామాను కథవున్న పేజీలలోగానీ, ఆ పేజీల వెనకగానీ కాకుండా, మరో కాగితంపై వ్రాసి జతచేయాలి.
4. రచయితలు కలం పేరుతోబాటు తమ అసలు పేరును విధిగా తెలియచేయాలి.
5. ప్రచురణార్హముగాని కథలు తిప్పిపంపగోరువారు కథలతోపాటు తగినన్ని తపాలా బిళ్ళలంటించిన స్వంత చిరునామాగల కవరు జతచేసి పంపాలి.
6. పోటీకి రచనలు పంపే కవర్లపై 'జ్యోతి కథలపోటీకి' అని విధిగా రాయాలి.
7. పోటీలో బహుమతి పొందని కథలలో ప్రచురణార్హమైనవాటిని ప్రచురణకు స్వీకరించే హక్కు మాకుంటుంది.
8. పోటీ విషయంగా జ్యోతి సంపాదకులదే తుది నిర్ణయం.

—ఎడిటర్

**రచనలు పంపేందుకు ఆఖరు తేదీ**
**15 మే 1979**

**Edited&Published by V. Leelavathy Raghavaiah, at 17B Rajaram Colony Kodambakkam Madras 600024,& Printed by D Hanumantha Rao,at Kranti Press, 12, Francis JosephStreet, Madras 600001**